అపరాధ పరిశోధన అనుబంధం—111

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## చెడిన ఆడది-ఆరిన దీపం

రచన : సికిందర్

## అమర ప్రేమికులు

రచన : వసుంధర

## పెళ్లికాని పిల్ల

రచన : టెంపోరావ్

## పాపపు చరిత్ర

రచన : బొమ్మిడి అచ్చారావు

అపరాధ పరిశోధన సప్లిమెంట్—111
మార్చి, 1983
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# చెడిన ఆడది—ఆరిన దీపం

## సికిందర్

గోడ దూకాడు ప్రకాష్.

చేతిలో సంచి పట్టుకొని వేగంగా వురికాడు లోపలికి.

అతడి కళ్ళు చురుగ్గా పరికిస్తున్నాయి. మెదడు ఎలర్టుగా వుంది. చీకట్లో ఆ దీపాలు వెలుగుతున్న బంగళాకేసి దౌడు తీస్తున్నాడు, మరి ఎటూ చూడకుండా.

అతను బంగళా సమీపిస్తూండగా, లోపలినుంచి పరుగు పరుగున ఒక ఆకారం వచ్చి చేరుకుందతన్ని, అలికిడి అవ్వని అడుగులతో.

పక్కకు తప్పుకొని, కాస్సేపు ఇద్దరి మధ్య గుస గుసలు—రహస్య సమాలోచనలు.

పరిసరాల్లో ఎక్కడా చడీచప్పుడూ లేదు. బంగళాలో మానవ సంచారం లేదు. దీపాలు మాత్రం వెలుగుతున్నాయి, నిశీధిలో నక్షత్రాల్లా.

# 4

మాటలయ్యాక ప్రకాష్ సంచిలోంచి కెమెరా తీశాడు. దాన్ని ఆ ఆకారానికిచ్చి, ఆ ఆకారం ఇచ్చిన సూచనలతో బంగళా వెనక్కి చేరుకున్నాడు.

వెనుక వరండా చేరుకుని, చప్పుడు గాకుండా తలుపు తీసుకుని లోపలికి ప్రవేశించాడు. ఎవరూ ఎదురుపడలేదు. ఆ గది దాటి పక్క గదిలో శబ్దాలు విన్పిస్తున్నాయి. అతను అటుకేసి నడిచాడు. తలుపు దగ్గరాగి, లోపలికి తొంగి చూశాడు—ఆమె వంట చేసుకుంటూ కన్పించింది.

ప్రకాష్ సంచిలోంచి పొడవాటి గుడ్డ, కొన్ని తాడు ముక్కలు తీశాడు.

సంచిని తలుపు దగ్గరే వదిలి, వాటితో అడుగులో అడుగు వేసుకుంటూ ఆమె వెనక్కి చేరుకున్నాడు గుట్టుగా.

ఆమె వంట చేసుకుంటోంది....

ఎందుకో ఆమె మెడ దగ్గర వెచ్చని స్పర్శకి గిరుక్కున తిరిగి చూసింది. అదురుపాటుతో కళ్ళు పెద్దవి చేసి కెవ్వున అరవబోయింది, కాని ప్రకాష్ చెయ్యి నోరు మూసేసింది. “అరవకు, బుచ్చమ్మా!” అన్నాడు, గుడ్డను ఆమె ముఖంమీదికి విసిరి, తల చుట్టూ లాగి బిగించి కడుతూ.

ఆమె నోరు మూసుకుపోయింది.

చేతులతో ఎదుర్కోబోయింది, ప్రకాష్ వాటిని మెలితిప్పి, వెనక్కి విరిచి తాళ్ళతో కట్టేశాడు. ఆమె గింజుకుంటోంది.

ప్రకాష్ ఆమెని దభీమని కిందికి పడవేసి, కాళ్ళు కూడా కట్టేశాడు.

ప్రకాష్ చేతులు విదిలిస్తూ లేచాడు.

స్టౌ మీద పొంగుతున్న పులుసులో ఓ గ్లాసుడు నీళ్ళు పోసి, చకచకా దారితీశాడు బయటికి, గుమ్మంలో సంచి అందుకుంటూ.

ఆమె భయ విహ్వలయై చూస్తోంది.

చకచకా గదులు చూసుకుంటూ, తనకు సూచించబడ్డ గదిలోకి జొరబడ్డాడు. అతి మెల్లిగా తలుపు లాగి ఎఖా సేశాడు.

బెడ్ మీద ఆమె కిటికీవైపు తిరిగి, ఏదో నవల చదువుకుంటోంది. అతను పూర్తిగా దగ్గరయ్యేవరకు ఆమెకు తెలియదు. భుజం మీద వెచ్చగా ఏదో తగిలేసరికి తిరిగి చూసింది. గొంతెత్తి కెవ్వుమంది.

ప్రకాష్ నవ్వి, ఆమె నోరు మూశాడు. వంగి, ఆమె కళ్ళలోకి హేళనగా చూశాడు. అవి భయంతో విచ్చుకున్నాయి. గజగజ వణికి పోతోంది, అలాగే చూస్తూ. రక్తం మాయమై ముఖం తెల్ల కాగితంలా అయింది.

ప్రకాష్ చెయ్యి తీసేసి మళ్ళీ నవ్వాడు, హేళనగా.

“నువ్వు—నువ్వెలా వచ్చావ్?” అర్చిందామె కదలకుండానే.

“విడుదలై, పారిపోయి కాదు.”

“నువ్వెప్పుడు విడుదలయ్యావ్?”

“నిన్ననే. నువ్వు మర్చిపోయి వుంటావు నా శిక్షాకాలాన్ని. నేను క్షణాలు లెక్కపెడుతున్నాను.”

అప్పుడతని చేతిలో కత్తిని చూసిందామె.

ఆమె బెదిరిపోయింది. “ఏమిటది? ఏం చేస్తావు నన్ను?”

ప్రకాష్ నవ్వాడు, “చంపను. రుచి చూస్తాను.”

ఆమె గభాల్న లేచి, “నేనరుస్తాను!” అని అరిచి

కిందికి దూకి తలుపు దగ్గరికి వురికింది.

వెనుకనుంచి విసురుగా కదిలి రెండు చేతుల్తోనూ నడుము పట్టుకొని వెనక్కి తీసుకున్నాడు ప్రకాష్. "నువ్వెక్కడికీ వెళ్ళలేవు! నువ్వరిస్తే విన్పించుకునేవారు లేరు!"

ఆమెను తీసుకొచ్చి బెడ్ మీద ఎత్తి పడేశాడు. "అమ్మోయ్!" అందామె.

"అంతే, అలాగే వుండు" అన్నాడతను, సంచి లోంచి తాళ్ళూ, గుడ్డలూ తీస్తూ.

"నీకు బుద్ధి చెప్పాలి!" అన్నాడతను నోరు కట్టేస్తూ. "నువ్వు కిక్కురుమనకుండా పడుండాలి! కదిలావంటే చెక్కేస్తాను నీ వొళ్ళు, ఈ చాకు పెట్టి!"

ఆమె చేతులు కూడా కట్టేసి కాళ్ళని చెరోవైపుకు లాగి బెడ్ కి కట్టాడు.

అప్పుడు వెటకారంగా నవ్వి సిగరెట్ తీసి వెల్గించుకున్నాడు.

భయంతో, షాక్ తో నిస్సహాయంగా చూస్తూన్న ఆమెని విజయగర్వంతో చూసి, బెడ్ మీదెక్కి ఆమె బట్టలు ఒక్కొక్కటే లాగి కింద పారేయసాగాడు.

ఆమె కళ్ళు మూసుకుంది.

"గుడ్! కొన్ని విప్పినపుడు కొన్ని మూసుకుని వుండాలి—కళ్ళూ నోరూ మాత్రమే సుమా! నీకిప్పుడు నువ్వెరుగని నరకం చూపిస్తాను, చూడు...."

## 2

ప్రభాకరరావు కారాపి హారన్ కొట్టాడు.

లోపలి నుంచి ఎవరూ రాకపోవడం చూసి, అతను విసుక్కున్నాడు. రాస్కెల్! బద్ధకం యెక్కువైంది

వీళ్ళకి....మరోసారి కొట్టాడు. అయినా జాడలేదు. లైట్లే కన్పిస్తున్నాయి ఇంట్లో, మనుషులేరు.

కారు దిగి, కసురుకుంటూ వెళ్ళి తనే గేటు తీశాడు. మళ్ళీ కారెక్కి స్టార్టుచేసి లోపలికి పోనిచ్చాడు. పోర్టికోలో ఆపి దిగుతూ, అక్కడే చూశాడు—కుడివైపు, పూలకుండీల ప్రక్కన పడివున్న ఆకారాన్ని.

కలవరపడి, గబగబా వెళ్తూ, "ఏమిట్రా ఇది, భాస్కర్?" అన్నాడు.

పనివాడు భాస్కర్ మాటరాక తల ఎలాగో వూపాడు.

రావ్ వంగి గబగబా నోట్లో గుడ్డలు తీసేసి, "ఏం జరిగిందిరా?" అన్నాడు ఆందోళనగా. అతన్ని లేవబెట్టి చేతి కట్లు కూడా విప్పేశాడు.

భాస్కర్ వణుకుతూ బెదురుగా చూశాడు. ఏదో చెప్పడానికి ప్రయత్నించాడు. మాట రాలేదు. "చెప్పు, ఏం జరిగింది? చెప్పూ...." రావ్ అతన్ని కుదిపేస్తూ అరిచాడు.

"దొంగ....దొంగ, సార్!"

"దొంగా?....దొంగ వచ్చాడా?"

"అవున్సార్! నా తలమీద కొట్టి, కట్టి ఇక్కడ పడేశాడు!"

"ఏడీ....? ఎక్కడ?"

"ఇంట్లో కెళ్ళాడు, సార్!"

"ఎంత సేపయింది?"

"చాల సేపయింది సార్, గంట దాటింది!"

రావ్ ఇంట్లోకి పరుగెత్తాడు. వెనుక భాస్కర్ లేచి వురికాడు. ఇద్దరూ హాల్లోకి వచ్చి, అక్కడెవరూ లేక

పోవడం చూసి, బెడ్ రూం కేసి ఉరికారు.

తలుపు తీసేవుంది.

లోపలి దృశ్యం స్పష్టంగా కన్పించింది....

రావ్ అదిరిపడ్డాడు. తలుపు మూసేస్తూ, "బుచ్చమ్మ ఏమైందో చూడు! దొంగ ఎటు వెళ్ళాడో వెతకండి!" అని భాస్కర్ని ఉరికించాడు.

భాస్కర్ పరుగుతీశాడు, తను చూసిన దృశ్యానికి కళ్ళు మూసుకుంటూ.

రావ్ గబుక్కున లోపలికి వెళ్ళి తలుపు లాగి మూసేశాడు. గడియ పెట్టేశాడు. గుండెలదురుతోంటే అతను, చెమటలు తుడుచుకుంటూ చూశాడు బెడ్ మీదికి.

ఆమె చటుక్కున కళ్ళు మూసుకుని ముఖం తిప్పుకుంది.

"నీల! నీల! ఏమయింది నీకు!" అతను ఆందోళనగా వెళ్ళి కట్లన్నీ విప్పేసి, లేపి కూర్చోబెట్టాడామెని. కింద పడ్డ బట్టలు ఆమె మీద కప్పాడు.

"ఏమైంది నీల, నీకు? ఏమిటిది?"

ఆమె హాఠాత్తుగా అతన్ని చుట్టుకుపోయి ఏడ్వసాగింది....

రావ్ ఉద్రేక పడిపోయాడు. ఆమె ముఖాన్ని చేతుల్లో పట్టుకొని, "చెప్పు, చెప్పు ఎవడొచ్చాడు ఇంట్లోకి?" అన్నాడు.

"వాడు....వాడు....ఓహ్....!!!" ఆమె మళ్ళీ ఏడ్వసాగింది.

"ఎవడు వాడు? చెప్పు, నీకు తెలుసా?"

"ప్రకాష్...." అందామె వెక్కిళ్ళతో.

ఉలిక్కిపడ్డాడు రావ్. "ఏమిటీ!....వాడొచ్చాడా?

ప్రకాష్ ఇక్కడికి వచ్చాడా? నిన్నిలా...."

"అవునండీ! నన్ను.... నన్ను.... ఓహ్!!!"

రావ్ ఆవేశంతో వూగిపోయాడు. ఆమెను వదిలి తటాలున లేచాడు. అప్పుడే తలుపు మీద చప్పుడైంది.

"సార్! బుచ్చమ్మని వంటింట్లో కట్టి పడేశాడు! వాడెటు వెళ్ళాడో చూస్తాం...."

పరుగెడుతున్న అడుగుల చప్పుడు.

"వాడి అంతు చూస్తాను!" రావ్ పిడికిలితో గోడ మీద గుద్దాడు. హఠాత్తుగా ఫోన్ మోగింది.

వెళ్ళి, కోపంగా రిసీవరెత్తి, "ఎవరు!" అనరిచాడు.

నీల తల వంచుకు ఏడుస్తోందలాగే.

"హలో, నేను ప్రకాష్‌ని మాట్లాడుతున్నాను...."

రావ్ బిగుసుకు పోయాడు ఆ గొంతు విని. ఏమీ అనలేక పోయాడు.

"ప్రభాకరరావ్, ఇప్పుడు నీ పరిస్థితిని వూహించుకో గలను...." అంటోందా గొంతు. "తెలుసా, నిన్నెక్కువ మాట్లాడించను. రెండు ముక్కలు మాట్లాడి పెట్టేస్తాను. శ్రద్ధగా విను. నువ్వు నీ భార్య గొప్ప పతివ్రత అనుకుం టున్నావు. ఆ గుడ్డి నమ్మకంతోనే నన్ను జైలుపాలు చేశావు, జనంతో కొట్టించి. అదే పని ఇప్పుడూ చేయ బోతున్నావేమో....ఎందుకంటే నీ భార్యను నేను.... ఓహ్, నీకు తెలుసు ఏం చేశానో, నా కసి తీర్చు కున్నాను. నాకు తృప్తిగా వుంది.

ఇప్పుడు నువ్వు కసెక్కిపోయి అప్పట్లోలా చేయ బోతున్నావేమో....కాలం ఒక్కలా వుండదు. ఆ పని చెయ్యకు. ఎందుకంటే నువ్వు పోలీసులకి చెప్పినా, రౌడీల్ని పంపించినా, ముందు నీ పరువు నడివీధిలో

వుంటుంది. ఇప్పుడున్న స్థితిలో—అంతకంటే ఘోరంగా నీ పెళ్ళాం ఫోటోలు కొన్ని నా దగ్గరున్నాయి. తెలిసిందా? ఇక నువ్వే ఆలోచించుకో....గుడ్ నైట్!"

## 3

ఫోన్ పెట్టేసి ప్రకాష్ బూత్‌లోంచి బయటికొచ్చాడు.

సిగరెట్ వెలిగించి, లోతుగా దమ్ములాగుతూ సాగిపోయాడతను. సక్సెస్! అతడి ముఖంలో తృప్తి, గర్వం వెలుగుతున్నాయి. గ్రాండ్ సక్సెస్! అనుకున్నాడు మళ్ళీ. అంతా అనుకున్నట్లే జరిగిపోయింది... తనకిప్పుడు అపాయం లేదు. ఆ రావ్ ఏమీ చేయలేడు. ఆ బిచ్ అంతకన్నా చేయలేదు. భాస్కర్ తోడ్పాటుతో విజయవంతంగా ముగిసింది అనుకున్నది. ఆ బాస్టర్డు తీసిన ఫోటోలు బాగానే వచ్చి వుంటాయి.... జేబులో రోల్‌ని తడుముకున్నాడు. రేపుదయం వీటిని ప్రింట్స్ తీసి సిద్ధంగా వుంచుకోవాలి.

అతను నడుచుకుంటూ తన గది వున్న వీధిలోకొచ్చాడు. అక్కడ అంతవరకూ బయట నిలబడి మాట్లాడుకుంటోన్న ఆడవాళ్ళు, గబగబా లోపలికి వెళ్ళిపోసాగారు. మగవాళ్ళు గుసగుసలాడుకోసాగారు అతన్ని చూసి. ప్రకాష్‌కి పట్టరాని కోపం వచ్చింది. వీళ్ళెవరూ తనవారు కాకపోయి బ్రతికిపోయారు. లేకపోతే బయటికి లాగి చితకబాదేసేవాడు పట్టుకుని! ఏమిటసలు వీళ్ళ ఉద్దేశ్యం? తను దుర్మార్గుడనే? తను చేసిన తప్పేమిటని? నిర్దోషులు జైలు కెళ్ళారూ? ఒక్కరూ నమ్మరేం తనని? మూర్ఖులు వీళ్ళంతా!

గదికొచ్చి ప్రకాష్ లైటు వేయకుండానే పక్కమీద

బోల్తా పడ్డాడు.

బరువుగా కళ్ళు మూసుకొని నిద్రకోసం ప్రయత్నించ సాగాడు.

తను సాధించిన కార్యానికెంతో తృప్తి మనశాంతిగా వున్నా, ఒకవైపు గతం గురించి ఆలోచనలు అతన్ని కలిచివేయసాగాయి. ఈ కళంకం పోదు తనకి! తను రేపిస్టు! తనని నమ్మరు, గౌరవించదిక ఈ లోకం!

నీల! అవును, ఆ బిచ్ తనకీ పరిసితిని తెచ్చింది!

ఏ ముహూర్తాన ఆమె తన టాక్సీ ఎక్కిందో, అదే తన అధోగతికి నాంది అయింది.

అది మొదలై నాలుగు నెలలైంది.

ఆ రోజు సాయంత్రం, అందరు ప్యాసింజర్ల లాగే ఆబిడ్స్‌లో ఆమె తన టాక్సీ ఎక్కి పోనివ్వమన్నప్పుడు, తను రొటీన్‌గానే దాన్ని తీసుకున్నాడు.

కానీ ఇంటికి మార్గంలో ఆమె మరోలా బయట పడింది___

ఆమె ధోరణి, మాటలు తనకి వింతగా, కొత్తగా అనిపించాయి. ఏ ప్యాసింజరూ అలా మాట్లాడలేదు.

ఆమె షాపింగ్ చేస్తున్న ధోరణిలో దారిపొడవునా తనని ప్రశ్నించింది. పేరేమిటి? వూరేమిటి? యెవరు తనవాళ్ళు? ఎంత అనుభవం డ్రైవరుగా? సొంతమా టాక్సీ? బాగుందా సంపాదన?..ఇలా అంతులేకపోయింది.

ప్రకాష్ విసుపోతూ కూర్చున్నాడు. తను అంగడిలో వస్తువా? సమానంగా అన్నిటికీ చెప్పాడు.

అప్పుడామె ఆసక్తి మరింత పెరిగింది.... ఇన్ని అర్హత లుండీ ఇదేం జీవితం? ఈ టీ నీళ్ళ జీతానికి ఈ శ్రమంతా ఎందుకు? దీన్ని వదిలేసి రాకూడదూ, తమ ఇంట్లో కారుకి

డ్రైవరు కావాలి? జీత భత్యాలు బ్రహ్మాండం! శ్రమ ఇంత వుండదు. సరేనంటే రేపే మా వారికి చెప్పేస్తాను, మరి ఆలోచించుకుని ఫోన్ చేస్తావా, నెంబరిస్తాను?

ప్రకాష్ ఉద్రేకపడ్డాడు. ఎక్కువ ఆలోచించలేదు. తను అంగడిలో వస్తువే. ఎవరెక్కువ ఇస్తే అక్కడికి పోతాడు.

నిజంగా తనకా టాక్సీ ఉద్యోగం ఏమీ నచ్చలేదప్పుడు. తన కష్టాలు తలచుకున్నప్పుడల్లా ఆ పిసినారి ఓనర్ని పీక పిసికేద్దామనిపించేది. వాడి టాక్సీని కొండ మీంచి దొర్లించి పారిపోదామన్పించేది.... అప్పుడామె మాటలెంతో రుచించాయి.

మర్నాడుదయం ఆమె తనని భర్తకి పరిచయం చేసి చెప్పినప్పుడు, అతను వెంటనే అంగీకరించి ఉద్యోగ మిచ్చేశాడు. ఆమె మాటంటే అతనికి....

అక్కడ్నించీ మొదలైంది తన కొత్త జీవితం.

ఆ ఇంట్లో తనూ ఒకడయ్యాడు, ఆ నల్గురిలో. భార్యాభర్తలిద్దరు గాక పనివాడు భాస్కర్ (22), వంటగత్తె బుచ్చమ్మ (19). వీళ్ళే ఇంట్లో మొత్తం సభ్యులు.

ఆ భార్యాభర్తల మధ్య వయోభేదం-ఆమె ద్వితీయ కళత్రమనీ (26), అతడామెకు దాదాపు తండ్రి వయస్కుడనీ (55) తెలిపింది.

ఆ కారణంగానేనేమో, ఆమె అంటే అతనికి వల్లమాలిన ప్రీతి, అపేక్ష, గారాభం. ఆమెకూ అతని పట్ల ప్రేమా, గౌరవం, భక్తీ. కానీ భాస్కర్ అనేవాడు, 'నమ్మకు బాస్, ఆమె బిచ్!' అని.

తను ఆశ్చర్యపోయేవాడు. నమ్మలేకపోయేవాడు ఆ మాటంటే. ఎలా అవుతుంది ఆమె బిచ్? చూస్తేనే

గౌరవం పుట్టుకొచ్చే విగ్రహం, ఆకట్టుకునే మాట తీరు, ఆమె నుంచి నేర్చుకోవాలనిపించే ప్రవర్తన—ఇవన్నీ గల ఆమెని పట్టుకుని ఆ మాటంటే చావబాదేద్దామనిపించేది భాస్కర్‌ని!

కానీ భాస్కర్ అంటూనే ఉండేవాడు. "ఆమెను నమ్మకు బాస్, నా మాట విను. ఆమెవన్నీ పైపై అలంకారాలే. ఆమె గురించి నీకేం తెలుసు? మొగుడూ అశక్తుడూ, మానసిక రోగీ అని తెలీక పప్పులో కాలేసింది పాపం—పెళ్ళాడేసింది. ఇప్పుడిక వేడి కోసం వెతుక్కుంటోంది. నాకే గాలం వేసింది తెలుసా? కాదన్నాను నేను. దొరికిపోతే నాకే కదా పడేది? మొగుడెంత మ్యాట్రలైనా ముక్కోపి, నా మెడ విరిచి పడేస్తాడు రోడ్డు మీద! మొదటి భార్య పిల్లలూ! పిల్లలూ! అని కలవరిస్తూనే కన్ను మూసిందట పాపం. ప్రసాదించలేడని తనకి తెలుసు. ఇప్పుడీ పడుచు పెళ్ళాం నా కారణంగా ప్రసవించిందంటే — బాబోయ్ — నువ్వే వూహించు పరిస్థితి! తల్లి కావాలనే తపనతో తెలివి తక్కువ పనులు చేస్తారు బాస్ కొందరు. ఆమె నసలు నమ్మడానికి వీల్లేదు. చాలా బరి తెగించిన మనిషి."

ప్రకాష్‌కి కొద్దిరోజుల్లోనే భాస్కర్ మాటలు నిజమని తెలిసిపోయింది. భర్త ఇంపోటెంట్. భాస్కర్ లొంగని ఘటం. మరి తను? తను సరికొత్త ఐటమ్!

ప్రకాష్ పసిగట్టాడు, ఆమె ప్రవర్తనలో క్రమంగా వస్తున్న మార్పుని.

ఆ చూపులు—అలా తన నెవరూ చూడలేదు.

ఆ నవ్వు—తనని చూసి అలా యెవరూ నవ్వలేదు.

ఆ మాటలు—ద్వంద్వార్థాలు తన దగ్గరెవరూ ప్రయో

గించలేదు.

ఆ స్పర్శ—తననెవరూ అలా స్పృశించలేదు.

ఒక రాత్రి—ఏదో రహస్య సైగ. దగ్గరికెళ్తే ఫలాన టైముకి బాల్కనీ కింద వుండమని ఆజ్ఞ.

ఆ రాత్రి—తనకి దురదృష్టం తెచ్చిన రాత్రి—ఆమె కోరికను తిరస్కరించాను.

అంత చులకనయ్యానా? నా అందం పనికి రాలేదా? ఆగు నీ పని చెప్తాను! అప్పుడు భీభత్సం .... చీరా జాకెట్టూ చింపుకుని మీదపడి ఆర్తనాదాలు..అయ్యయ్యో! అయ్యో! ఏమండీ! ఏమండీ! ఇలా రండీ! నన్ను కాపాడండీ! ఎక్కడున్నారండీ... త్వరగా రండీ! ఈ దుర్మార్గుడు చూడండీ నన్ను .... నన్నూ .... అయ్యయ్యో .... అయ్యో....

అంతే!

అప్పుడు క్షణాల్లో అంతా జరిగిపోయింది.

మేడమీంచి భర్త పులిలా వచ్చాడు. ఆమె నుంచి తనని దూరంగా లాగి డొక్కలో తన్నాడు. మళ్ళీ పట్టుకుని దబదబా బాదేసి బయటికి నెట్టాడు. భాస్కర్, బుచ్చమ్మా నోళ్ళు తెరుచుకొని చూస్తున్నారు. గొడవ విని ఇరుగు పొరుగు వచ్చి చేరారు. ఆమె భర్త తననింకా పచ్చడి చేస్తున్నాడు. వచ్చిన వాళ్ళూ తలో చెయ్యీ కలిపారు. ఉతికి, ఉమ్మేసి, పట్టుకెళ్ళి జైల్లో పారేసేదాకా వూరుకోలేదు వాళ్ళంతా!

## 4

ఉదయం నిద్ర లేచి ప్రకాష్, ముఖం కడుక్కుని సిగరెట్ వెలిగించాడు.

అతడెంతో రిలీఫ్ ఫీలవుతున్నాడు. రాత్రి తీర్చుకున్న

పగ అతడికెంతో సంతృప్తి నిస్తోంది. అయినా యింకేదో లోటు తోస్తోంది.... కళ్ళముందు వాళ్ళు ముగ్గురు మెదుల్తున్నారు. ఆ గుడ్డికన్ను మేజిస్ట్రేటూ, నడ్డిలేని ఇన్‌స్పెక్టర్, జిడ్డు మొహం ప్రాసిక్యూటర్.

వీళ్ళు ముగ్గురు కూడా తన న్యాయస్థానంలో దోషులే. వాళ్ళని క్షమించెయ్యమని ఘోష పెడుతోంది మనసు.... వాళ్ళు చట్టం పరిధులకు లోబడే వ్యవహరించారు. వాళ్ళ తప్పులేదు. ఆరోపణ అబద్ధపుదే. కాని ఆ పరిస్థితుల్లో ఆడదాని మాటకున్న చెల్లుబాటు మరి దేనికీ లేదు. అలాంటి అవకాశాన్ని కల్పించిన సృష్టికర్తకే విధించాలి శిక్ష!

తనిక ఈ నీతి పుటలు తిరగేసేయాలి. కొత్త అధ్యాయం తెరవాలి. ఇక్కడనుంచి కొత్త జీవితం ప్రారంభమవుతుంది కొత్త ఉద్యోగం, కొత్త మకాం, కొత్త వాతావరణం. ఇంకా ఈ గదిలో వుండకూడదు. మరో గది చూసుకోవాలి. అప్పుడే వుద్యోగం సంగతి. ఉన్నట్టుండి ఎలా వస్తుంది వుద్యోగం? మళ్ళీ ఆ పిసినారి దగ్గరికే పోవాలా ఉన్యాయమంటూ? తన సంగతి తెలిసిందా వాడికి? తెలిస్తే ఆదరిస్తాడా? చూడాలి.

ఆ తర్వాత రెండు రోజులూ ప్రకాష్ గది వెతకడంలో వుండిపోయాడు. మూడోనాటికీ గది దొరికే ఆశ కన్పించలేదు. గది బాగుంటే అద్దె కుదరదు. అద్దె కుదిరితే గది బాగుండదు. ఈ ప్రపంచంలో ఏ రెండూ కుదరవేమో? ఎందులోనో దూరిపోవాలనుకుంటూ, నాల్గో రోజు ఉదయం పిసనారి సంగతి చూద్దామని వెళ్ళాడు.

పిసినారి సర్దార్‌కి అంతా తెలుసు. "ఇంట్లో జొరబడి చేసినవాడివి, రేపు నా బండిలో చెయ్యవని నమ్మకమేమిటి భాయీ! ముందు షాదీ చేసుకో పో!"

అన్నాడు.

ఆ సాయంత్రం గదిలో కూర్చుని తీవ్రంగా ఆలోచించసాగాడు ప్రకాష్. నాల్గురోజుల కిందటి సంఘటన పూర్తిగా మర్చిపోయాడు. అటునుంచి ఏ రియాక్షన్ లేకపోతే రావ్ తన హెచ్చరిక పాటిస్తున్నాడనుకున్నాడు. అంతకంటే యేం చేయగలడు—

ఇక ఆ నెగటివ్ ని ప్రింట్స్ తీసే అవసర మెంతని కూడా ఆలోచించాడు. పరిస్థితిని చూస్తే అవసరమనిపించడంలేదు. రావ్ నమ్మాడు తన దగ్గర ఫోటోలున్నాయని. అందుకనే రియాక్షన్ లేదు. ఆ నెగెటివ్ రోల్ ని పెట్టెలో పడేసి వుంచాడు.

ఇప్పుడతని ఆలోచనలు ఒక్కదానిమీదే వున్నాయి— సంపాదన ఎలా? ఉద్యోగమెక్కడ? ఇలా తనెక్కడికి వెళ్ళినా వెలివేస్తారా? తను నేరం చేసివుంటే దాన్ని ఒప్పుకుంటాడు. కాని నిర్దోషి అయివుండీ యిలా అవమానాలు పొందుతూంటే చెడ్డ కసి పుట్టుకొస్తోంది లోకంమీద!

అతడిలా అశాంతిగా గడుపుతున్న సమయంలో హఠాత్తుగా హారన్ వినిపించింది బయట. కిటికీలోంచి చూశాడు.

కారులోంచి ఆమె పిలుస్తోంది.

నీల.

# 5

ప్రకాష్ కలవరపడ్డాడు—

ఎందుకొచ్చిందీమె?

ఆమె మళ్ళీ చెయ్యూపి పిలిచింది.

ప్రకాష్ తలుపు తీసి బయటికి వెళ్ళాడు. వీధిలో

అంతా యిటే చూస్తున్నారు. అతను కసిగా కారు వద్దకి నడిచి ఆమెని చూశాడు—గాభరా పడ్డాడు.

"కారెక్కు, నీతో మాట్లాడాలి!" అందామె డోర్ తీస్తూ.

ఆమెనే చూస్తున్నాడు రెప్ప వేయకుండా. అతడి వళ్ళు జలదరించింది! అదేమిటి? ఆమె కేమయింది? ముఖ మెందుకలా వుంది? ఆ కన్నేమిటి అలా వాచింది? చెంప ఎందుకు గీరుకుపోయింది? నుదురు బొప్పికట్టిం దేమిటి? అరె, పెదవులు వుబ్బేయెందుకు? చేతులమీదా చర్మం చిట్లి ...ఓహ్!

ఇవి తను చేసిన గాయాలా? కావు!

"కారెక్కు ప్రకాష్, నీతో మాట్లాడాలి." అందామె మళ్ళీ.

ఆ చూపుల్లో భావమేమిటి?

ప్రకాష్ తేరుకున్నాడు. "ఓహ్, యేం మాట్లాడాలి?"

"ఇక్కడ కాదు, నాతో రా చెప్తాను!" అధికారం వుంది గొంతులో.

ప్రకాష్ కేదో స్ఫురించింది. డోరు మూసేస్తూ, "నాతో ఏం మాట్లాడుతావు. వెళ్ళిపో!" అన్నాడు.

ఆమె చుర చుర చూసింది. "చూడు మైడియర్ రేపిస్టూ, టైము వేస్టుచెయ్యకు. అది నీకూ నాకూ మంచిది కాదు."

"ఏ రకంగా?"

"చాలా రకాలుగా."

"అందులో ఆరోగ్యాన్ని కూడా నా?"

"కావచ్చు."

ప్రకాష్ ఆలోచించాడు. "సరే నీ కెందుకు భయపడాలి?" అని వెనక్కి తిరిగి గదిలోకి నడిచాడు. గబగబా పెట్టె తెరచి అందులోంచి ఫిల్మ్ రోల్ తీశాడు. తిరిగి పెట్టె మూసి, దాన్ని జేబులో వేసుకున్నాడు. అది యెత్తుగా కన్పిస్తోంది. తీసి షర్టు చేతులు పైకిలాగి, ఎడమ చేతికి పైన దాన్ని దారంపెట్టి కట్టాడు. తిరిగి స్లీవ్ కిందికి లాగాడు. గుండీ పెట్టాడు.

అదిప్పుడు కన్పించడం లేదు.

వేగంగా బయటికొచ్చి గదికి తాళంవేసి కారెక్కి కూర్చున్నాడు. ఆమె స్టార్టు చేసింది. కారు పోతూంటే ఇరుగు పొరుగు, కాస్సేపట్లో ప్రపంచం వూహించని విపత్తులో పడిపోతుందన్నట్టుగా చూడసాగారు.

ప్రకాష్ ఆమెని గమనించసాగాడు. ఆమె మాట్లాడలేదు. సీరియస్‌గా డ్రైవ్ చేస్తోంది. కారు మెయిన్ రోడ్డుమీది కొచ్చాక కొంత దూరం వరకూ ప్రకాష్ వెనక్కి వెనక్కి తిరిగి చూస్తూ కూర్చున్నాడు. చివరికి నిశ్శబ్దాన్ని ఛేదించాడు.

"నా ఆరోగ్యమే నీ ఆరోగ్యం. వెనుక నువ్వెవర్నయినా తెస్తూంటే, ఆ వెనుక నీ దురదృష్టం కూడా వస్తోందని గ్రహించు."

"పిచ్చిగా మాట్లాడకు!" అని మాత్రమే అందామె.

ప్రకాష్ మరోసారి వెనక్కిచూసి, ఎవరూ వెంటాడ్డం లేదని తెలుసుకుని, ఆమెతో అన్నాడు, "అంబర్ పేటలో నాకు చిన్న పనుంది—అక్కడికి పోనిస్తావా? వెంటనే వస్తాను."

"ఏం పని?"

"నా సొంత పని."

ఆమె మాట్లాడలేదు. సీరియస్‌గా ఏదో ఆలోచిస్తూ డ్రైవ్ చేస్తోంది. అంబర్ పేట వచ్చాక ప్రకాష్ చెప్పిన ఒక వీధి మొదట్లో కారాపిందామె.

ప్రకాష్ దిగి చకచకా నడిచాడు ఓ ఇంట్లోకి.

అయిదు నిమిషాల్లో అతను తిరిగి వచ్చేసి కారెక్కాడు.

ఆమె పోనిచ్చింది మాట్లాడకుండా.

ప్రకాష్ అన్నాడు, "నీకు ఫోటోలు పంపించడం మర్చిపోయాను నీలా."

"ఎలా తీశావా ఫోటోలు?" అడిగిందామె అతన్ని చూడకుండానే.

"అది అవసరమా?"

"నువ్వసలు తీశావా అని నా కనుమానం. నువ్వింకా అవి చూపకుండానే బెదిరిస్తున్నావు."

"లేదు. నేను తీశాననే నువ్వూ, నీ భర్తా నమ్ముతున్నారు. అందుకే నామీద ఏ యాక్షన్ తీసుకోలేక పోయారు."

"అవును రేపిస్టూ, మా ఆయన అలాగే భయపడి పోతున్నాడు. భయపడి నీ జోలికి పోకుండా నా భరతం పడుతున్నాడు రాత్రీ పగలూ! శీలం పోగొట్టుకున్నానని నాలుగు రోజుల్నుంచీ నన్ను ఒకటే తంతున్నాడు! కూర్చోనీయడు, లేవనీయడు. కూర్చుంటే తంతాడు, లేస్తే తంతాడు! అసలు కన్పిస్తే చాలు, పట్టుకు తంతున్నాడు...."

ప్రకాష్ తృప్తిగా నవ్వుకున్నాడు, బయటికి చూస్తూ. చూసిందామె అది. "అలా నవ్వకు. నీ కది న్యాయం

కాదు."

"ఎందుకు కాదు? నీ కిలా జరగడం న్యాయమే."

ఆమె విసురుగా అంది. "అవును. నే న్నీకు అన్యాయం చేశాను. నిజమే! అందు కిప్పుడు బాధపడుతున్నాను. అప్పుడు నే నేం చేయను? ఆ పరిస్థితిలో ఇంకేం చేయను చెప్పు? నా....ఎలా అణచుకోను?"

ప్రకాష్ ఆమెని సూటిగా చూశాడు: "నువ్వు నిజంగా బిచ్ వే!"

"అవును అనుకో! అలాగే అనుకో! ఐ డోంట్ కేర్! అప్పుడు నువ్వూ కాదంటే సహనం కోల్పోయి అలా చేసేశాను! ఆ క్షణంలో యేం చేస్తున్నానో నాకే తెలియదు! తర్వాత పశ్చాత్తాప పడ్డాను....కానీ మా ఆయన వూరుకోలేదు. నిన్ను జైలుకు పంపేవరకూ ఆగలేదు. ఇప్పుడు నువ్వొచ్చి యిలా చేస్తావని వూహించలేదు.... పగ తీర్చుకున్నావు నామీద. బాగుంది. మరిప్పుడు నాకేం జరుగుతోందో తెలుసా చూడు నేనెలా అయ్యానో! ఈ ముఖం చూడు! యీ వళ్ళు చూడు! ఈ చేతులు చూడు! ఎలా వుందో నా పరిస్థితి! అప్పట్నించీ అతడు నన్ను కొట్టని క్షణంలేదు—"

"నీకు నా సానుభూతి."

"అంతేనా? నన్నర్థం చేసుకుంటే మరింకేమీ చేయలేవా"

"నే నేం చేయాలి?....యెవరి ఖర్మ వాళ్ళనుభవించాలి."

కారు వరంగల్ రూట్లో వెళ్తోంది.

ఆమె యెవరూలేని చోటు చూసి రోడ్డు ప్రక్కగా ఆపింది: "నన్నర్థం చేసుకో ప్రకాష్. మర్చిపోగలాన్ని.

నీకు నేను చేసినదానికి నువ్వు నాకు చేశావు. ఇంకేముంది? సరిపోయింది లెక్క. ఇంకా ఎందుకిలా అసహ్యించుకుంటావు? ద్వేషిస్తావు? నన్నిప్పుడు క్షమించలేవా? నేననుభవిస్తున్నదానికి నిన్నేమీ నిందించడంలేదు. పరిహారం కోరడమూ లేదు. సాయపడమని వేడుకొంటున్నాను. అంతే. నా పరిస్థితి యింకెవరికీ ఎలా చెప్పుకోను? నవ్వులపాలవుతాను...."

"నేను నీకేం సాయం చేస్తాను?"

"ప్రమాదం ఏర్పడింది నా బ్రతుక్కి!"

"అలాగా?"

"అవును, నా భవిష్యత్తు అంధకారం కాబోతోంది! నామీద ప్రేమ పోయిందతనికి.... బెదిరిస్తున్నాడు నన్ను! చెడిన ఆడది ఆరిన దీపమేనట! నన్నింక యింట్లో వుంచడట! విడాకులిచ్చేస్తాడట! లేకపోతే వెళ్ళగొడ్తాడట! లేదా చంపేస్తాడట! చిల్లిగవ్వ చేతికివ్వడట! అతని మాటలు వింటోంటే నాకు భయం పుట్టుకొచ్చింది. చాలా బ్రతిమాలాను. అతను మనసు మార్చుకునేలా లేడు. మానసిక రోగి పైగా! స్లీప్ వాకర్. రాత్రిళ్ళు నాకు నిద్రపట్టడం లేదు....నన్నేం చేస్తాడో తెలియదు, నిద్రలో లేచి! నాకేదేనా జరిగేలోపే పారిపోవాలనిపిస్తోంది ఇక్కడ్నించి...."

"పారిపో!" అన్నాడు ప్రకాష్.

"ఎలా? ఇలా పోయి ఎక్కడేం చేయను? ఎలా బ్రతకను?"

"మరొకడ్ని పెళ్ళాడేసేయ్!"

"ఆ పని చెయ్యను. పెళ్ళిలో మోసముంది. ఏ మగవాడెంత యోగ్యుడో ముందే తెలియదు. పైకి అందరూ

మోసగాళ్ళే. నాకు పిల్లలు కావాలి. ఇందాకా నువ్వనుకున్నట్లు కోరికలు తీర్చుకోవడం కాదు. నేనంత నీచానికి దిగజారలేదు. ఇతన్తో నేనెంత మోసపోయానో తెలిశాక, విరక్తితో పిల్లలకోసమే ఇలా దిగజారాను—

"నాకు మళ్ళీ పెళ్ళీ పెటాకులూ వద్దు. ఇతన్తో జరిగింది చాలు. చేసిన తప్పు మళ్ళీ చేయను. ఇప్పుడు నా ఇష్టం వచ్చినట్లు బ్రతుకుతాను, ఇష్టంవచ్చి నందర్ని కంటాను. మరి, ముందు బ్రతుకు తెరువు ఒకటి చూసుకోవాలిగా?"

"అవును. అందుకు ఎక్కడన్నా వేయమన్నావా కన్నం నన్ను?"

"ఓహ్, అలా చేసి పారిపోతే వూరుకుంటాడంటావా అతను? వెతికి ఎక్కడున్నా పట్టుకుని చంపేస్తాడు. చావు నాకిష్టంలేదు. అలా నేనెందుకు చావుని కొని తెచ్చుకోవాలి, చెప్పూ?"

"అతను చావాలనుకుంటున్నావా అయితే?"

"ఓహ్, కాదు! కాదు, కాదు! బ్రతికుండనీ అతన్ని, ప్రకాష్, యెవర్నీ చంపే హక్కు లేదు మనకి. అతడు నన్ను పట్టుకోకుండా మాత్రమే ఆపాలంటున్నాను, అంతే."

"అంటే, నువ్వతని సొమ్ము దోచుకొని పారిపోతావు-కానీ—అతను నిన్ను పట్టుకునే ప్రయత్నాలేవీ చేయకూడదు. అంతేనా?"

"అంతే. అవునంటే, ప్రకాష్, నువ్వలా చేయగలవా? ఈ మాత్రం తోడ్పడగలవా? ఈ నరకంనించి బయట పడతాను—నిన్ను జీవితాంతం మర్చిపోలేను. నీకూ కొంత ప్రతిఫలం ఇస్తాను, వూరికే వద్దు. ఇప్పుడెలాగూ నువ్వూ బ్రతుకు తెరువు చూసుకోవాలిగా...."

ప్రకాష్ ఆలోచనల్లో పడ్డాడు బయటికి చూస్తూ.... ఆలోచిస్తోంటే ఆమె మాటలు అతన్ని వశపర్చుకుంటున్నాయి. ఆ మాటల్లో అర్థముందనిపిస్తోంది. అవి సబబుగా తోస్తున్నాయి .... తను ఆమెకు చేసింది అన్యాయమే, అవును. తనవల్లనే కదూ ఆమెకీ పరిస్థితి ఏర్పడింది? తనకు చేసిన దానికి ఆమె పశ్చాత్తాప పడ్డానంది.

అలా ఆమె ఏ పరిస్థితుల్లో చేసిందో ఇప్పుడు బోధపడుతోంది. కామాన్ని అణచుకోమనవచ్చు. కానీ మాతృత్వాన్ని నిషేధించడం ఎంత దారుణమైన విషయం! తానప్పుడు కనికరించి—సహకరిస్తే ఏం పోయిందట! యెందుకీ అర్థంలేని బోడి భేషజాలు? కోరివచ్చిన కాంతని తిరస్కరించమని యెందులో చెప్పబడ్డ నీతి సూత్రమట? బోడి నీతులు! బోడి హిపోక్రసీ!

ఇహ జరిగిందేదో జరిగింది. తనకు ఈమెవల్ల కీడు జరిగిందనుకుంటే ఈమె భర్తవల్ల కూడా జరిగింది. ఎక్కువే జరిగింది. మరి అతన్ని గురించి తనేం ఆలోచించాడు? అతను తిట్టినతిట్లు, తన్నిన తన్నులు యెలా మర్చిపోయాడు? ఈమె మీద కసి తీర్చుకోవడంవల్ల అతడికేం జరిగింది? అతడీమెమీద తన కసి తీర్చుకుంటున్నాడు!

కాదు, ఇలా కాదు.

అతన్ని ఏదో చేయాలి. అప్పుడే తనకు శాంతి. శారీరకంగా కాకపోయినా, మానసికంగానైనా జన్మలో కోలుకోలేనంతగా కొల్లగొట్టాలి!

దానికి ఈమె చెప్తున్న దాంట్లో అవకాశం కన్పిస్తోంది...

అతని ఖజానా ఖాళీచేసేందుకు ఈమెతో సహకరిస్తే

పదరదూ వాడి రోగం?

అందులో తనకొచ్చే భాగంతో భేషుగ్గా స్థిరపడ వచ్చు ఇక జీవితంలో!

అవును, బాగుంది ఆలోచన.

అతని అంగీకారానికి ఆమె ఉప్పొంగిపోయింది.

"నా మొదటి బిడ్డకు నీ పేరే పెట్టుకుంటాను!" అంది.

"నీకు మార్గం ఆలోచించి రేపు చెప్తాను" అన్నా డతను.

ఇద్దరూ తిరిగి బయల్దేరారు. అంబర్ పేటలో మళ్ళీ దిగిపోయి ప్రకాష్ ఆమెను పంపేశాడు-రేపు సాయంత్రం ఇందిరా పార్కులో వుండమని.

ఆమె వెళ్ళిపోయాక ఫోటోగ్రాఫర్ మునీర్ ఇంట్లోకి నడిచాడు.

మునీర్ చూస్తూనే నవ్వసాగాడు.

"ఏమిటి?" అన్నాడు ప్రకాష్ కలవరంగా.

"నన్ను ఫూల్ చేయాలనుకున్నావా, భాయ్?" అన్నాడు మునీర్.

"ఏం జరిగింది?"

మునీర్ నవ్వాపుకుని, "ఆ రోల్-అసలు ఎక్స్‌పోజ్ చేయబడలేదు" అన్నాడు.

"ఏమిటీ ... అంటే?"

"దాన్నుపయోగించలేదు, భాయ్...." అంటూ ఫిల్మ్ రోల్‌ని చేతిలో పెట్టాడు మునీర్.

"ఏమిటి నువ్వనేది. మునీర్?"

"అందులో ఒక్క స్నాప్ లేదు, నువ్వు కొన్నట్టే వుంది."

ప్రకాష్ ఉలిక్కిపడ్డాడు, "నిజమా?"

"లేక నీతో పరాచికమా?"

ప్రకాష్ కొయ్యబారి పోయాడు. అతడికి ముచ్చెమటలు పోశాయి.

# 6

"బాస్! హాలో, హాలో, హాలో.... బాగున్నావా?"

"కూర్చోరా, భాస్కరుడా."

"కంగ్రాచ్యులేషన్స్, బాస్! నువ్వు ఘటికుడివి!"

"ఎలా వుంది అటు రియాక్షన్?"

భాస్కర్ కూర్చుంటూ పగలబడి నవ్వాడు. ప్రకాష్ రెండు టీలకి ఆర్డరిచ్చాడు. రెస్టారెంట్‌లో చాలా రష్‌గా వుంది.

"అయ్యో బాస్, ఏం చెప్పను! యెలా చెప్పను!" భాస్కర్ పడీపడీ నవ్వుతున్నాడు. "భలే బాగు, నువ్వు చేసింది! ఆ రాత్రినుంచీ చూడాలి భాగోతం! గదిలోంచి గుభీ గుభీమని సౌండ్స్ వస్తూంటే. ఉయ్యో మొర్రో మంటూ కుక్కపిల్లలా కుళ్ళి కుళ్ళి ఏడ్పులూ! బలే మజాలే! వహ్వా, వండర్ఫుల్! వళ్ళు వాచిపోయిందనుకో బిచ్కి—"

"భాస్కర్, ఇప్పుడు నీ వీపు వాయించబోతున్నాను" అన్నాడు ప్రకాష్ కర్కశంగా, టీ అందుకుంటూ.

భాస్కర్ ఉలిక్కిపడి చూశాడు. "అయ్యో.... యెందుకు, బాస్?"

"నన్ను బాస్ అంటున్నావు, బాస్‌కి ద్రోహం చేయవచ్చునా?"

"నేనేం చేశాను?" అయ్యో...."

ప్రకాష్ ఫిల్మ్ రోల్ తీసి ముందు పెట్టాడు.

భాస్కర్ తికమకగా చూశాడు దాన్ని, "ఫిల్ము చుట్ట...." అన్నాడు.

"దాన్ని ఏం చేశావ్?"

"ఫోటోలు గుంజాను, మొన్న. బాగా రాలేదా?"

"ఎన్ని గుంజావు?"

"అయిదు...." భాస్కర్ ఉలిక్కిపడ్డాడు, "బాస్, అవి బాగా రాకపోతే నన్ను కొట్టకు! నాకు తీయటం రాదనిముందే చెప్పాను...."

"నువ్వసలు తీయలేదని చెప్తున్నాను."

"బాస్!"

ప్రకాష్ చటుక్కున వంగి కాలరు పట్టుకున్నాడు.

"బాస్! జనంలో....కొట్టకు! కొట్టకు!"

ప్రకాష్ అలాగే పట్టుకుని, "నిజం చెప్పకపోతే ఇలాగే గొంతు నలిపేస్తాను...." అన్నాడు, కళ్ళలో నిప్పులు కురిపిస్తూ.

భాస్కర్ గజగజ వణికిపోయాడు. "నిజం....నిజమే చెప్తున్నాను.... నేను ఫోటోలు తీశాను!"

"కానీ ఇందులో ఒక్కటీ లేదు!"

"నేను అయిదు తీశాను!"

"అయితే తీసి రోల్ మార్చి వుంటావు, అవి నువ్వుంచుకున్నావు."

"ఓహ్....అయ్యో.... ఓహ్.... అవి నేనేం చేసుకుంటాను?"

"ఏమైనా చేసుకుంటావు."

"లేదు, బాస్. నన్ను నమ్ము. నీకంత ద్రోహం చెయ్యను. నేన్నీకు పూర్తిగా—మనస్ఫూర్తిగా సహకరించాను. నన్ను నమ్ము బాస్....నాకే దుర్బుద్ధీ పుట్టలేదు"

కళ్ళు నీళ్ళు తెచ్చుకున్నాడు భాస్కర్.

ప్రకాష్ అతన్ని వదిలేశాడు.

“అయితే ఒక్కటే జరిగి వుండాలి—నా గదికొచ్చి యెవరో మార్చి వుండాలి.”

“ఎవరు చేస్తారలా?”

“నీల—లేకపోతే నీ దొర.”

“దొర—అతడికా ఆలోచన రాదు, బాస్. భార్యనే చితక బాదుతున్నాడు. నీ విషయం ఆలోచించలేను. తప్పంతా భార్యదేనని....”

“నాకేదో కీడు జరుగబోతోంది....”

భాస్కర్ ఆవేదనగా చూశాడు. “అయ్యో.... బాస్, నీకీ కష్టాలెందుకు?”

“సానబెట్టేందుకు.”

వాళ్ళిద్దరు విడిపోయారు. ప్రకాష్ తీవ్రంగా ఆలోచిస్తూ గదికి సాగిపోయాడు. కానీ మధ్య దారిలో అతడికేం జరుగనున్నదో తెలియదు. ఒక చీకటి సందులో అకస్మాత్తుగా చుట్టుముట్టాయి కొన్ని ఆకారాలు. ప్రకాష్‌కి తేరుకునే సమయమే చిక్కలేదు, ఎదుర్కొనే మాట అటుంచి.

వళ్ళు హూనమై స్పృహ తప్పిపడిపోయాడు క్షణాల్లో.

## 7

ఫోన్ పెట్టేసి, ప్రభాకరరావు నవ్వుతున్నాడు.

కళ్ళమ్మట నీళ్లొచ్చేలా నవ్వుతున్నాడు. నవ్వుతునీ నవ్వుతునీ కళ్ళు తుడుచుకున్నాడు. అది దూరంనుంచి చూస్తున్న నీల బెదిరింది. ఆమె దగ్గరికి రావడానికి భయపడి, గదిలోకి మాయమైంది. ఫోన్ యెక్కడ్నించి

వచ్చిందో తెలియదా మెకు. అతడలా యెందుకు నవ్వు తుంటున్నాడో అసలు తెలియదు.

"అలాగే జరగాలి, రాస్కెల్‌కి!"

అతడనుకుంటూ వుండడం విని ఉలిక్కిపడింది.

ఆ మర్నాడు ప్రకాష్‌కి అతికష్టంగా తెల్లారింది.

అతనికి వళ్ళు ఇంకా నొప్పులుగా వుంది. నయం! వాళ్ళు వట్టి చేతుల్తోనే దాడిచేశారు. లేకపోతే చచ్చిపోయేవాడే ఆ దెబ్బలకి. అతను బాధగా లేచి, అద్దంలో మొహం చూసుకున్నాడు. ఉలిక్కిపడ్డాడు. మొహమంతా ఎలా అయింది! బాగా వాచింది. నుదురుమీదా, గడ్డంమీదా వాపులు కన్పిస్తున్నాయి. చెంపలు ఎర్రగా వున్నాయి. కుడి కన్ను ఉబ్బింది. కింది పెదవి రెండింతలైంది.... బాధ!

మంచం దిగి, తలపోటుకి రెండు ఆస్ప్రోలు వేసుకొని, నిలబడలేక మళ్ళీ వాలిపోయాడు. వంట్లో బలమంతా ఏమైంది? నడుము విపరీతమైన నొప్పి! వెధవలు, అప్పుడెక్కడ కొట్టేసున్నారో తెలియదు. ఇప్పుడు అంగుళం అంగుళం బాధే! బాస్టర్డ్, ఎంతకు తెగించాడా రావ్!

రావ్! యూ ఫ్లాప్ మాస్టర్ జనరల్!

అతనికి భాస్కర్ మాటలు జ్ఞాపకం వచ్చాయి. 'మొగుడెంత న్యూట్రలైనా ముక్కోపి! నా మెడ విరిచి పడేస్తాడు రోడ్డుమీద!'

నీకెంత పౌరుషం, యూ బ్లడీ ఇంపోటెంట్! పిడికిళ్ళు బిగించాడు ప్రకాష్. నా హెచ్చరికని లక్ష్యపెట్టక, నా గదిలో ఫిల్ము కాజేసి, నన్నే తన్నిస్తావా? నీకు మూడింది. ఇప్పుడు నిజంగా మూడింది. చూడు ఇప్పుడు నిన్నేం చేస్తానో, యూ సెన్స్‌లెస్ సిల్లీ

ఫూల్!

రాత్రి సంఘటనతో ప్రకాష్‌కి కోపం పెచ్చు పెరిగి పోయింది. దాన్ని అణచుకుని, ఏం చేయాలో శాంతంగా ఆలోచించడానికతనికి, రెండు లీటర్ల బియ్యం టాబ్లెట్లు అవసర మయ్యాయి.

అరగంట తర్వాత అతడలాగే పడుకుని ప్రశాంతంగా ఆలోచిస్తున్నాడు...సాయంత్రానికల్లా అతడి మెదడులో ఒక పథకం రూపు దిద్దుకుంది.

ఆ సాయంత్రం చెప్పిన ప్రకారం కలుసుకున్నాడు నీలని, ఇందిరా పార్కులో.

అతన్ని చూడగానే ఆమె గాభరా చెందింది.

ప్రకాష్ నవ్వి, "నిన్న నువ్వొచ్చావు ఇలా.... ఇవ్వాళ నా వంతయిందీ అవతారం!" అన్నాడు.

"నీ సెన్సాఫ్ హ్యూమర్ బాగుంది" అందామె నవ్వి. అంతలోనే ఆందోళనగా చూసింది, "ఏమిటిది, ప్రకాష్? ఏం జరిగింది? రాత్రి అతనికేదో ఫోన్ వచ్చింది .... పిచ్చి పిచ్చిగా నవ్వుకున్నాడు. అలాగే జరగాలి రాస్కెల్‌కి.... అనుకుంటూండగా విన్నాను... ఏమిటది?"

"నీ అనుమానం నిజమే, నీలా నన్ను కొట్టించాడు గూండాలతో."

"ఆ ఫోటోలు....!!"

"నేను ప్రింట్స్ తీయలేదు. అవసరం లేదనుకున్నాను. నీ మొగుడు ఆ రోల్‌ని నా గదిలోంచి కాజేశాడు..... లైవ్ రోల్‌ని ప్లాంట్ చేసి...."

"ఓహ్, ఎంతకు తెగించాడు!" ఆమె ఫూగిపోయింది. "నువ్వతన్ని వదలకూడదు ప్రకాష్! బుద్ధి చెప్పాలి!

ఇప్పుడు బాగా బుద్ధి చెప్పాలి!"

"స్లీప్ వాకర్.... మెంటల్ కేసు....మగతనం లేదు, మతిలేని పనులు చేస్తున్నాడు. చెయ్యనీయ్! అతను స్లీప్ వాకర్ కావడం మనకే మంచిదయింది...."

"అంటే....ఏమిటి ప్రకాష్?"

"నేనొక మార్గం ఆలోచించాను."

"ఏమిటది చెప్పు?"

"చెప్తాను. ముందు మనం వాటాలు మాట్లాడుకోవాలి...."

"చెప్పానుగా, నీకిస్తానని?"

"ఎంత, ఫిఫ్టీ ఫిఫ్టీ యా?"

"అమ్మో....అంత వీలు కాదు!"

"ఎంత వుంటుంది లూటీ?"

"ఆరేడు లక్షలుండొచ్చు."

"హార్డు క్యాషేనా?"

"కొంత బంగారం కూడా...."

"నాకెంత ఇవ్వాలనుకుంటున్నావు?"

"ల...లక్ష?"

"రెండు చెయ్, సరిపోతుంది. ఒంటరిగాడ్ని. మిగిలిన నాలుగైదూ నువ్వుంచుకో. పిల్లాజెల్లా కోరికలున్న దానివి."

ఆమె క్షణం ఆలోచించి, "సరే—అలాగే" అంది.

"నువ్వు చచ్చిపోతావ్" అన్నాడు ప్రకాష్.

ఆమె ఉలిక్కిపడింది. "ఏమిటీ ...!!"

"నువ్వు చచ్చిపోతావ్."

"చచ్చిపోతానా....! ఓహ్, ఏమిటి నువ్వనేది?"

"శ్రద్ధగా విను. నువ్వు చచ్చిపోతావన్నాను. తప్పె

ముంది? యెవరమైనా చచ్చేవాళ్ళమే కదా? నువ్వు చచ్చిపోతావు. కానీ చావవు. చచ్చిపోయినట్లు నీ భర్త నమ్ముతాడు...."

"ఓహ్, సరిగ్గా చెప్పు!" అరిచిందామె.

"నువ్వు చచ్చిపోయినట్లు అతన్ని నమ్మించబోతున్నాం. ఇంకెలా గాలిస్తాడు నిన్ను? నోర్మూసుకుని— రిపీట్ — నోర్మూసుకుని పడుంటాడు నే చెప్పినట్టు! ఇంకా ఈ వయిసులో సంపాయించలేదు కదూ? కష్టపడి కూడబెట్టిందంతా కొల్లగొట్టేసే నాతీ నోరూ బాదుకుంటూ చస్తాడు! నాకదే కావాలి...."

"అవును. చెప్పు ప్రకాష్. నిన్నర్థంచేసుకున్నాను."

"నువ్వెళ్ళిపోయాక నీ భర్త నిన్ను గాలించకుండా, పోలీసు రిపోర్టు ఇవ్వకుండా వుండాలంటే నీలా, నువ్వు చచ్చిపోయినట్లే కాదు, అతనే చంపినట్లు కూడా నమ్మించబోతున్నాం...." అన్నాడు ప్రకాష్ ఆలోచనల్లో పడిపోతూ. "స్లీప్ వాకర్ కదూ? బెస్టు సొల్యూషన్. నిద్రలో చేసిన పని....నమ్మకేంచేస్తాడు? సాక్షులు కూడా వుంటారు. ఇంకేం"....

"నీలా, నువ్వు రేపు రాత్రి పన్నెండూ ఒంటిగంట ప్రాంతాల నాకోసం ఇంట్లో ఎదురుచూస్తూండు. అయితే నీ భర్త పడుకోబోయేముందు — ఆ మహాపురుషుడు పాలు తాగుతాడనుకుంటాను? — అందులో మందు కలుపు. స్లీపింగ్ పిల్స్ తాగి కుంభంగా నిద్రపోతాడు. నేను మళ్ళీ కెమెరాతో, ఒక బీరు సీసాలో మేకరక్తంతో వస్తాను''....

"మీరిప్పుడు వేర్వేరు — పక్క ప్రక్క గదుల్లో పడుకుంటున్నారనుకుంటాను? నీ గదిలోనే నేను

సృష్టిద్దాం. నీ బెడ్ మీద రక్తం చిమ్ముదాం. నేలమీద కొంత ఒలికిద్దాం, కిచెన్‌లోంచి కూరలు కోసే కత్తి తెచ్చి, రక్తంలో ముంచి అక్కడ పడేద్దాం. నీ చేతి గాజులు కొన్ని ముక్కలు చేసి బెడ్ మీద పడేద్దాం. నువ్వు రేపు రాత్రి ఏ చీరలో అయితే వుంటావో, ఆ చీరను విప్పేసి మరొకటి కట్టుకోవాలి. ఆ విప్పిన చీరను రక్తంతో తడిపి బయట కారులో వెనుక సీట్లో ప్లాంట్ చేద్దాం...వింటున్నావా?"

తలూపిందామె.

"అప్పుడు నేలమీద రక్తంతో నువ్వు కాళ్ళు తడుపుకోవాలి. నేను నీ భుజాలు పట్టుకొని ఈడ్చుకుపోతాను బయటికి—నడవలోంచి మెట్ల దగ్గరికి. ఆ తర్వాత కిందికి, నీ పాదాలు అప్పుడు దారి పొడవునా మరకలు సృష్టిస్తాయి—అతను ఈడ్చుకుపోయినట్టు. కారు పోర్టికోలో ఆగి వుంటుంది. వెనుక సీటుమీద మరికొన్ని మరకలు. గేటు బార్లా తెరచి వుంటుంది. ఆ కారులో నీ భర్త కూర్చుని వుంటాడు."

"యూ సీ నీలా, నీ భర్త సోమ్నాంబులిస్టు. నిన్ను నిద్రలో చంపి తీసికెళ్ళి కారులో యెక్కడో పారేసి వచ్చి అలా కూర్చున్నాడన్నమాట. వింటున్నావా? అలాగే నిద్రపోయాడు. అతన్ని తీసుకొచ్చి మనం అలా కూర్చోబెడతాం కారులో, డ్రైవింగ్ సీట్లో. స్లీపింగ్ పిల్స్ ప్రభావంలో వుంటాడు. మనకే ప్రమాదం వుండదు. అతని చేతులకీ, వంటిమీద కూడా రక్తాన్ని పూస్తాం. చెప్పులకి కూడా. దట్సాల్, అంతే....ఇంట్లో పనివాళ్ళు ఎప్పుడు లేస్తారు ఉదయం?"

"బుచ్చమ్మ అయిదు గంటలకి లేస్తుంది, భాస్కర్

కూడా అప్పుడే."

"అప్పుడు వాళ్ళు బయట కారూ, కారులో రావుని చూసి కేకలు వేస్తూ గొడవ చెయ్యరు కదా?"

"ఊఁహూ, అలా చెయ్యరు."

"అదే నేనాశించింది. అతనంటే వాళ్ళకి భయం భక్తీ, అభిమానం, జాలీ, విధేయత ఎట్సెట్రా ఎట్సెట్రా కదూ? నువ్వంటేనే అసహ్యం వాళ్ళకి. నువ్వు చచ్చి పోయావంటే బాగైందనుకుంటారు.... నీ భర్త చంపినందుకు ఇంకా సంతోషిస్తారు .... వాళ్ళు కారులో పరిస్థితి చూసి, ఇంట్లో నువ్వు లేకపోవడమూ, నీ గదిలో భీభత్సమూ చూసి, ఏం జరిగి వుంటుందో సులభంగా గ్రహించేస్తారు."

"అవును."

"నిన్ను భర్త చంపేశాడనుకుంటారు రాత్రి. రోజూ నిన్ను హింసిస్తున్నాడు. రాత్రి షిటాఫ్ యాంగర్ లో నిద్రలో వచ్చి చంపేశాడనుకుంటారు. కారులో ఎక్కడో పారేసి వచ్చి అక్కడే కూర్చుని నిద్రపోయాడను కుంటారు. కంగారుపడుతూ అప్పుడు లేపితే లేస్తాడు. ఏం జరిగిందో వాళ్ళు చెప్పాక నిలువునా .... సరే, నువ్వూహించుకో అతని పరిస్థితి!"

"అప్పుడేం చేస్తాడు? గంతులేస్తూ గబగబా వాళ్ళతో అంతా శుభ్రం చేయించేస్తాడు. తను స్నానం చేసేస్తాడు. వాళ్ళు చెప్పినట్టు వింటారు, యజమానిని కాపాడు కోవాలి. నువ్వు పోతే పోయావ్, దే వోంట్ కేర్. ముగ్గురూ కలిసి అంతా హుష్ కాకీ చేసేసి, మళ్ళీ యెప్పటిలా వుంచుతారు ఇంటిని .... అవునా?"

"అవునంతే జరుగుతుంది!"

"ఇవీ వాళ్ళకు చెప్పలేని భయాలు, నీలా! శవం ఎక్కడుందో, యెవరికి కనిపిస్తుందో, పోలీసులెక్కడ వస్తారో.... ఇలా అనుక్షణం భయపడి చస్తుంటారు. నీ భర్త శవాన్ని యెక్కడ వదిలాడో చెప్పలేదు. అలాగే భయపడుతూ భయపడుతూ బ్రతికున్నంత కాలం చావాలి, నీలా! క్షీణించి, కుపిక్కించిపోవాలి! నాకదే కావాలి.... జీవితాంతం అతనికి నరకం! ఆ నరకాన్ని నేనింకా ఎక్కువ చేస్తాను ..."

"ఎలా?"

"ఇక్కడొక లూప్ హోల్ వుంది. అది దొరక్కూడదతనికి! అతనికే అనుమానమూ రాకూడదు, మనం చేసిందాంట్లో. నువ్వు సేఫ్‌ని ఖాళీచేసి పోతావ్. అదెలా జరిగిందనే సందేహం సహజంగా నే వస్తుందతనికి. దాంతో అతనెక్కువ ఆలోచించకుండా—అయిడియాలు తట్టకుండా— నేనీ పని చేస్తాను...."

"ఏమిటది?"

"అతన్ని కారులో కూర్చోబెట్టినప్పుడు ఫోటోలు తీస్తాను. వెనుక సీట్లో దృశ్యం కూడా తీస్తాను. ఆ తర్వాత ఇంట్లో భీభత్సానికి కూడా కొన్ని స్నాప్స్ తీసుకుంటాను. అప్పుడు, ఉదయం అతనికి ఫోన్ చేస్తాను."

"ఏమని?"

"మిస్టర్ ప్రభాకరరావు, మెడియకర్ పూర్ ఫెలో, యెలా వుంది దెబ్బకు దెబ్బ? నన్ను జయించానని విర్రవీగావు కదూ? ఇప్పుడేం జరుగుతుందో చూడు! జీవితాంతం దయాదాక్షిణ్యాలుమీద బ్రతకాలి! నిన్ను గులాములా ట్రీట్ చేసి, కుక్కలా ఆడిస్తాను. రాత్రి

నువ్వు నీ పెళ్ళాన్ని చంపి పారేయడం నాకు కనువిందు చేసింది....నీ వెనుకే ఇంటికొస్తూ కెమెరా తెచ్చుకొని కావల్సినన్ని ఫోటోలు తీసుకున్నాను. వాటికి నువ్వెలాగూ మూల్యం చెల్లించక తప్పదు కాబట్టి, అదెప్పుడో ఇంకా ఎందుకని అప్పుడే ఖాళీచేసి పోయాను ఖజానాని.... సారీ, ఇలా స్వేచ్ఛ తీసుకున్నందుకు. ఈసారి తప్పకుండా ఫోటోలు పంపడం మర్చిపోనని ప్రామిస్ చేస్తున్నాను— ఎలా వుంది?" నవ్వాడు ప్రకాష్.

ఆమె చప్పట్లు కొట్టింది సంతోషంతో. "బాగుంది! బాగుంది!"

ప్రకాష్ తృప్తిగా చూశాడు. "అలా చేద్దాం. ఇందులో ఏ మోసమూ లేదు. సక్సెస్ గ్యారంటీ సెంట్ పర్సెంట్ ఇస్తాను. మరి....నా ఫీజు స్పాట్ పేమెంట్ జరగాలి."

"అలాగే! అప్పుడే ఇచ్చేస్తాను. నువ్వు చెప్పిందంతా పూర్తిచేశాక సేఫ్ తెరుద్దాం. అది అతని గదిలోనే వుంది. తాళాలు తలగడకిందే వుంటాయి. తెరచి మనం వాటాలు పంచుకొని వెళ్ళిపోదాం...."

## 8

గోడ దూకాడు ప్రకాష్.

చేతిలో సంచి పట్టుకొని వేగంగా వురికాడు లోపలికి.

అతడి కళ్ళు చురుగ్గా పరికిస్తున్నాయి. మెదడు ఎలర్టుగా వుంది. చీకట్లో మేడమీద ఒకే ఒక్క గదిలో లైటు వెలుగుతున్న బంగళాకేసి పరుగుతీస్తున్నాడు, మరి ఎటు చూడకుండా.

అతను బంగళాని సమీపిస్తూ, లోపలినుంచి ఎవరైనా వస్తారేమోనని చూశాడు. కానీ రాలేదు. అతనాశించి

నట్లు ఆమె రాలేదు. ముందు తలుపు తీసే వుంది. లోపలంతా చీకటి! తను చెప్పిన సమయానికి ముందే వచ్చాడు. ఆమె ఎక్కడుంది? గుండె వేగంగా కొట్టుకుంటూంటే, చప్పుడు గాకుండా అడుగు పెట్టాడు హాల్లోకి.

మేడమీద లైటు ఎందుకు వెలుగుతోంది?

ప్రశ్న ఉదయించిందతని మెదడులో.

పైకి మెట్ల దగ్గరికి నడుస్తూ, గుండె నిబ్బరం చేసుకున్నాడు. ఇంట్లో యెక్కడా శబ్దాలు లేవు. తలుపు ఆమే తీసి వుంచిందా? గదిలో ఎదురు చూస్తోందా? పైకి చేరుకుని, అతను నడవలో నడుస్తూ గదుల్ని చూడసాగాడు. ఆ వరుసలో రెండు గదులు మూసి వున్నాయి. మూడో గదిలో నే లైటు వెలుగుతోంది, తలుపు తెరిచి వుంది.

ప్రకాష్ ఆగాడు. చెవులు రిక్కించాడు.

లోపలేదో శబ్దమవుతోంది....

గోడకి చేరబడి, జాగ్రత్తగా తొంగి చూశాడు లోపలికి.

ఆ గది ఆమెది కాదు.

ఆమె భర్త బెడ్ మీదే వున్నాడు, నిద్రపోతూ.

ఆమె బెడ్ ప్రక్కనే, తలవైపున, నిలబడి వుంది అటు తిరిగి. ఆమె చేతిలో తాళాల గుత్తి చప్పుడు చేస్తోంది, సేఫ్ కీ హోల్ లో పెట్టి తిప్పుతోంటే....

ఆమె ఏ మాత్రం తొందరలేకుండా, తాపీగా తెరుస్తోంది సేఫ్ ని....అప్పుడే! అప్పుడే యెవరన్నారు తెరువమని? యెందుకీ తొందర?

ప్రకాష్ వెన్ను జలదరించింది—తెరచుకున్న సేఫ్ లోపలికిచూసి!

బ్లడీ ఇంపోటెంట్, బాగా సంపాయించాడు....

ప్రకాష్ ఇక లోపలికి వెళ్ళిపోవాలన్న ఆతృతని అణచుకున్నాడు. ఏమిటామె ఉద్దేశ్యం? ఏం చేస్తోం దిప్పుడేది? చూడాలి....ప్రకాష్ చూస్తున్నాడు. ఆమె సూట్‌కేసులో సేఫ్‌ని ఖాళీచేస్తోంది. నోట్లు, నగలు. కట్టలు, కుప్పలుగా పడుతున్నాయి. ఆమె చకచకా పని పూర్తి చేసుకుంటోంది. ప్రకాష్‌కి నోరు పిడచగట్టుకు పోతోంది. కళ్ళప్పగించి చూస్తున్నాడు. ఆమె మాత్రం మరెటూ చూడటం లేదు. తన లోకంలో వుంది. ఎంతగా నంటే....తన ప్రక్కనే ఏం జరుగుతోందో తెలియదు.

ప్రకాష్ ఉలిక్కిపడి చూశాడు. చూసి గట్టిగా అరవాలనుకున్నాడు—

కానీ అప్పటికే ఆలస్యమైంది—

స్లీప్ వాకర్ కమ్ సెన్స్‌లెస్ సిల్లీ ఫూల్ అనుకున్న ప్రభాకరరావు, వళ్ళు విరుచుకుంటూ లేచి కూర్చున్నాడు.

## 9

"ని—ని—ని—నీలా..!!!" అని అరుద్దామనుకున్నాడు ప్రకాష్, అప్పటికీ.

కానీ గొంతు దాటి రాలేదు మాటలు. కాళ్ళు చేతులతో బాటు నోరు కూడా పడిపోయినట్టుంది పరిస్థితి! కొయ్యలా నిల్చున్నాడు, కళ్ళు విప్పదీసుకుని చూస్తూ.

రావ్ నిదానంగా బెడ్ దిగి, తీరికగా ఆమె వెనుకకు వచ్చాడు. అతడి కళ్లు నిద్రలోంచి మేల్కొన్నట్లు లేవు, నిద్రలో నడుస్తున్నట్లూ లేవు, పూర్తి మెలుకువతో వుండి అతనంతవరకూ నిద్ర నటించాడని చెప్తున్నాయి!

"నువ్వు పతిద్రోహి వే ననుకున్నాను, ఇప్పుడు దొంగవు

కూడా నన్నమాట" వెలువడ్డాయి మాటలు అక్కడి గొంతునుంచి శాంతంగా.

గిరుక్కున తిరిగిందామె, అదిరిపడుతూ.

ఆమె చేతిలో నోట్లూ, నగలూ జారిపోయాయి.... జలజలా.

కెవ్వున కేక వేసి కళ్లు మూసుకుంది, యెదురుగా ఏదో భూతాన్ని చూసినట్టు.

అప్పుడు జరిగింది—

దాదాపు ఆ కేకతో పాటే బాల్కనీ కిటికీలోంచి దుబ్బుమని ఓ ఆకారం దూకింది లోపలికి..అది విసురుగా అక్కడ్నించి రావ్ వెనుకకు రాబోయింది, అది గ్రహించి రావ్ చటుక్కున పక్కకు తొలిగాడు. ఆ ఆకారం ఠక్కున మధ్యలోనే ఆగిపోయింది, సంకెళ్ళు వేసినట్టు.

ప్రకాష్ గాభరాగా, ఆశ్చర్యంగా చూశాడతన్ని. అతనికి తన వయసే వుంటుంది. బక్కగా వున్నాడు. చిన్న ముఖం. చేతుల్లో ఏమీ లేదు. కానీ కుడిచెయ్యి విరిగినట్టు మెడకి స్లింగ్‌తో చేతికి సిమ్మెంట్ ప్లాస్టర్ వుంది....

ప్రభాకరరావు నవ్వుతూండడం చూసి తేరుకున్నాడు ప్రకాష్.

"రా, రా, ప్రియుడా, నీకోసమే యెదురుచూస్తున్నాను...."

నీల కళ్ళు తెరచి చూసింది. ఆ యువకుడు చటుక్కున ఆమె దగ్గరికి జరిగాడు. నీల అతన్ని పట్టుకుని భర్తని భయకంపితురాలై చూసింది. "నువ్వా—పాలు తాగి—"

నవ్వాడు రావ్ మళ్ళీ, "పాలకంటే ముందు విరుగుడు

తా గాను," చెప్పాడతను భుజాలెగరేస్తూ. "మీ రెలా పోతారో చూద్దామనిపించింది .... ఏదీ, పారిపోండి చూస్తాను? నేను పది లెక్క బెట్టేట్లోగా మీరు గేటు దాటి వెళ్ళిపోవాలి, ఆ తర్వాత నేను ఫోన్ చేస్తాను పోలీసులకి. సరేనా? ఈ గేమ్ నాకు బాగుంది.... సినిమాల్లో నే చూశాను. ఇప్పుడు స్వయంగా చేస్తున్నాను. కమాన్ సూట్ కేసు ఎత్తుకోండి....వన్, టూ త్రీ...."

"నీకెలా తెలిసింది మా గురించీ!" అరిచింది నీల, అతని మీదికి పోతూ.

రావ్ ఆమెని హేళనగా, ఏవగింపుగా చూసి, గడ్డం పట్టి వెనక్కి తోశాడు. "తెలుసుకున్నా నే, నీతిలేని దానా. ఏం, కష్టమనుకున్నావా? నీ నాటకం, జాణతనం నాకంతా తెలుసు. జారిణికైనా పోషించే వాడిమీద భక్తి వుంటుంది. విశ్వాసంగా పడివుంటుంది. కానీ నువ్వు? నువ్వెంతకన్నా హీనంగా దిగజారావు!

ఎలా తెలియదు నీ రంకుతనం? వళ్ళంతా దెబ్బలు తగిలించికని, బాత్ రూంలో జారిపడ్డానంటే నమ్మేస్తాననుకున్నావా నన్ను? అనుమానించి, కనిపెట్టి నిన్ను చూస్తే — రాత్రిళ్ళు నాకు పాలలో నిద్రమాత్రలు కలిపిచ్చి, ఈ గదిలో తలుపు వేసుకొని, నీ ప్రియుడితో తన్నించుకుంటూ, నేను కొడుతున్నట్లు జీతగాళ్ళకి నమ్మిస్తూంటే చేతులు ముడుచుకూర్చుంటాననుకున్నావా? నీ ఉద్దేశ్యమేమిటో తెలుసుకుందామని నియమించాను డిటెక్టివ్ ని! అప్పుడే తెలిసిపోయింది నీ పూర్తి స్కీము, కుట్ర—"

ఉలిక్కిపడి ఆ యువకుడు ముందుకెళ్ళాడు, ఆవే

శంతో వూగిపోతున్న ఆమెని పట్టుకుందామని. విదిల్చి కొట్టి అరిచిందామె భర్తమీదికి పోతూ. "అవును చేశాను! అలాగే చేశాను! బాగా చేశాను! ఇంకా చేస్తాను! చేసి తీరుతాను! నువ్వేం చేస్తావ్? నీకేం చాతవుతుందని పెద్ద మాట్లాడుతున్నావ్? నీకూ ఆ మునగ చెట్టుకీ ఏం తేడా వుంది? నువ్వెంత మగాడివో చూశాను! తరించాను నీ మగతనానికి! నీకు నా దండాలు మహా ప్రభో, కడుపు నిండిపోయింది నీ మగసిరికి! మురిసి పోయాను నీ...."

ఆమె పకపకా నవ్వింది. "సిగ్గులేదూ, నన్ననడానికి? నీ మొహానికి మాటలు కూడానా? ఆ ప్రకాష్‌గాడు నన్నవమానించి పోతే నువ్వేం చేశావ్? ఆడదాన్ని—నేను పూనుకుని—బయట మందిని కూడగట్టుకుని తన్నించాలా వాడ్ని! వాడు తీసిన ఫోటో రీలుని ఈ సుమన్ చేత నేను తెప్పించి నాశనం చేయాలా! నువ్వు గాజులేసు కూర్చుంటావా? పెళ్లాన్ని సుఖపెట్టలేవు సరి! ఇంటి మీదికి వెధవలు వచ్చి నన్ను దోచుకుపోతూంటే చూస్తూ కూర్చుంటాడా మొగుడు! ఏం మొగుడమ్మా! యెక్కడి మొగుడమ్మా! భలే మొగుడే దొరికాడు నాకు...."

ఆమె నవ్వుతోంది విరగబడి....

"నువ్వెంత సిగ్గు వదిలేశావు....నువ్వు ముదనష్టపు దానివే!" అన్నాడు రావ్ ఆవేశాన్ని అణచుకుంటూ, ఏవగింపుగా. "నిన్ను బుద్ధి లేక చేసుకున్నానే, దరిద్రపు మొహందానా! నీ సుఖానికి లోటొచ్చిందని నాతో అన్నావా ఎప్పుడైనా? నా డబ్బు నీ నోరు మూయించింది! అందుకే జీతగాళ్ళతో సానివేశాలు వేశావ్! ఇంటి పరువు బజార్లో పెట్టావ్! ఆ ఒక్కటీ తప్పితే.

నీకేం తక్కువ చేశాను చెప్పు? డబ్బిచ్చాను, నగలిచ్చాను, హోదా ఇచ్చాను. నాదంతా నీదే అన్నాను యెప్పటికైనా. పెళ్ళిగాక ముందు నీ స్థితేమిటి! ఇప్పుడేమిటి! ఆలోచించు—"

"ఆ ప్రకాష్‌గాడు నీ పని పట్టకముందు బాగానే వున్నావు. ఈ ప్రియుడితో నీకు బాగానే జరుగుతోంది. పిల్లలు పుట్టకుండా జాగ్రత్త పడుతున్నావు. పిల్స్ వాడుతున్నావ్, నా భయానికి. నీ ఈ వ్యవహారం నాకు మొన్న డిటెక్టివ్ చెప్పేవరకూ తెలియదు! ఆ ప్రకాష్ గాడు యెప్పుడైతే నీకు జన్మకు సరిపడా సుఖాన్నిచ్చి పోయాడో, అప్పుడే నీకు అయిడియాలొచ్చాయి. ఈ ప్రియుడి మాయలోపడి నీకు నామీద అంతవరకూ వున్న ప్రేమా గౌరవం కూడా పోయాయి—నా డబ్బు చూసి అవిచ్చావనుకుంటే! నాకిలా ద్రోహంచేసి, దోచుకు పోవడానికే సిద్ధపడ్డావ్—"

"దోచుకుపోతాను! ఇదంతా నాదే అన్నావ్, తీసుకు పోనీయ్!"

"నీదేనా—ఇదంతా నీదే! కాదన్నానా? కానీ నా తదనంతరమన్నాను. నేను బ్రతికుండగా కాదు. నా పెళ్ళాం నన్ను దోచుకుని ప్రియుడితో లేచిపోయిందనే అవమానం భరించలేను. అర్థమైందా? నేను పోయాక ఏమైనా చేసుకో! అందుకే ఆ ప్రకాష్‌గాడు నీకు బుద్ధి చెప్పిపోతే ఏమీ చేయలేకపోయాను. రెండోసారి లోకం వాడ్నే నమ్ముతుందే, వెర్రిదానా అన్నాను. నవ్వుల పాలవుతాం మనం. తప్పు నీదేనని నిందించానా నేను? బాధించానా నిన్ను? యెప్పటిలాగే చూసుకుంటానన్నాను. ఇంటి పరువు కాపాడుకోవాలి. నిన్ను వెళ

గొట్టలేను. నీమీద నాకేం కోపం కలగలేదు, సానుభూతి తప్ప. కానీ దానికీ నువ్వు అర్హురాలివి కాలేకపోయావ్."

"మూయ్ నోరు! అర్హతల గురించి మాట్లాడు తున్నావా?"

రావ్ చెయ్యెత్తాడు ఆమెని కొట్టడానికి. ఆ యువకుడు వెనక్కి లాగకపోతే చెంప పగిలేదే! తలుపు ఇవతల చెమటలు కక్కుతున్నాడు ప్రకాష్—వింటూ, చూస్తూ.

"నన్ను అమర్యాదగా సంబోధించే స్థితికి యెదిగా వన్నమాట నువ్వు?" అన్నాడు రావ్ నిప్పులు కక్కుతూ.

"అన్నీ వదిలేసిన దానివి....యూ ఆరే వ్హోర్! నేనా లస్యంగా కళ్ళు తెరిచాను. ప్రకాష్‌గాడి దెబ్బకి నీకిలాంటి అయిడియాలు తడతాయని నేనెలా అనుకుంటాను.... వాడ్ని మభ్యపెట్టి, ఆశపెట్టి, రెచ్చగొట్టి—"

"అవును, మభ్యపెట్టాను—వాడి సానుభూతికోసం! ఆశపెట్టాను—నా పని జరగడంకోసం! రెచ్చగొట్టాను తన్నించి—నా కసి తీరడానికీ, నీమీద కక్ష గట్టడానికీ! నువ్వేం చేస్తావ్?" ఆమె విసురుగా సూట్‌కేసు అందు కుని, కిందపడ్డ నోట్లూ, నగలని అందులో వేసుకుంది.

"నేనిలాగే చేస్తాను. నువ్వు చచ్చేవరకు నేనెందు కాగాలి? దొంగతనంగా నా కోర్కెలు యెందుకు తీర్చు కోవాలి? స్వేచ్ఛగా నే పోతాను! నే నేమీ దొంగిలించ డంలేదు—నువ్విస్తావన్నదే పట్టుకుపోతున్నాను. నువ్వేం చేస్తావిప్పుడు? నన్నేం చేస్తావ్."

"నువ్విప్పుడు నా భార్యవి కావు. వింటున్నావా? బిచెస్‌కి నేను రొట్టెముక్క కూడా వేయను. నా సంపదమీద నీకిప్పుడేం అధికారం లేదు. నిన్ననే ఇదంతా

అనాథాశ్రమానికి వ్రాసేశాను. తెలిసిందా? కాబట్టి నువ్విప్పుడు దొంగవి. ఆ నోట్ కేసులో నువ్వు గడప దాటు, నీ వెనుక పోలీసులుంటారు....” రావ్ చెప్పి నవ్వాడు.

వాళ్ళిద్దరు క్షణంపాటు చూసుకున్నారు ఒకర్నొకరు లీలా, సుమన్.

“ఇక అర్థమైందా? ఆలస్యం చేయక నిర్ణయించుకో” అన్నాడు రావ్.

“నన్నిలాగే గెంటేస్తావా, ఏమీ ఇవ్వకుండా?”

“నేనెందుకు గెంటేస్తాను? నీవాడు తీసుకుపోతాడు. నేను నీకెందుకివ్వాలి? తీసుకుపోయేవాడు తీరుస్తాడు అన్నీ!” రావ్ అతని వైపు చూశాడు.

“ఏరా, ప్రియుడా! తీర్చవూ? బొమ్మా కావాలి, సొమ్మూ కావాలి అంటే యెలారా! సొమ్ముంచుకొని బొమ్మని ఆశించాలి. అప్పుడే అర్హత. నానుంచి ఆశించకు. ఆ మిగిలిన చెయ్యి కూడా విరుగుతుంది. ఇప్పటికే ఏదేదో చెయ్యాలని ఏమీ చెయ్యలేక అలా నిలబడ్డావ్. నిన్న స్కూటరు మీంచి పడి చెయ్యి విరగ్గొట్టుకున్నావని డిటెక్టివ్ ఫోన్ చేసి చెప్తే, నవ్వాగలేదు నాకు.... బాగయింది రాస్కెల్‌కి అనుకున్నాను!”

రావ్ పకపకా నవ్వాడు.

వాళ్ళిద్దరు ఒకర్నొకరు చూసుకుంటున్నారు ఆతృతగా.

ప్రకాష్ కదలకుండా అలాగే నిల్చున్నాడు, చెమటలు కక్కుతూ.

రావ్ ఇంకా నవ్వుతున్నాడు, విజయం తాలూకు నవ్వు అది. నవ్వితే అతనికి కన్నీళ్ళు వస్తాయి. అతి నవ్వు అనర్థదాయకమన్నారు. అతని నవ్వుకి అనకట్టవేస్తూ

పడిందొక తలమీద ఘాతం! మెరిసిందొక కళ్ళముందు మెరుపు! కమ్ముకున్నాయి యెదురంతా చీకట్లు! పడ్డాడు నేలమీద దుబ్బుమని శబ్దం చేసుకుంటూ. ఆమెను వెంటనే ఘాతంమీద ఘాతం! బాధమీద బాధ!

"పోలీసుల్ని పిలుస్తావూ? మమ్మల్ని పట్టిస్తావూ? చావు! నువ్విలాగే చావు! చచ్చిపో చేతకాని వాడా.." విజృంభించి వీరావేశంతో బాదేస్తున్నారు వాళ్ళిద్దరూ. ఆమె చేతిలో సూట్ కేసు పదేపదే అతని తలమీద పడు తోంది. అతని బూటుకాలు కడుపులో తగులుతోంది. అతను కాళ్ళూ చేతులు కొట్టుకుంటూ దొర్లుతున్నాడు. తల పచ్చడయిపోతోంది....రక్తం వరదలవుతోంది.... క్షణాల్లోనే అతను చలనం కోల్పోయాడు. హఠాత్తుగా అతని ఎగవూపిరి ఆగిపోయింది....

హంతకులు పరుగుతీశారు—

అప్పుడు తేరుకున్నాడు ప్రకాష్. అతని చేతిలో సంచి జారి కిందపడింది. వాళ్ళు బయటకొచ్చేస్తున్నారు వేగంగా....ప్రకాష్‌కేదో విచిత్ర శక్తి ఆవహించిందా క్షణంలో. వేగంగా మార్పులు జరిగి, అతన్ని ముందుకు తోసింది. వంగి సంచిలోంచి రక్తం బాటిల్ తీసుకొని లోపలికి జొరబడ్డాడు—బయటకొచ్చేస్తూన్న వాళ్ళిద్దర్నీ విసురుగా ఢీకొట్టాడు, వాళ్ళని వెనక్కి నెట్టేస్తూ.

గావు కేక వేసింది। నీల, సూట్ కేసుని వదిలేస్తూ. అతని కళ్ళలో ఆమెకి తన మృత్యువే కనిపించింది....ఆమె ఇంకా కేక పూర్తిచేయకుండానే, ప్రకాష్ చేతిలో బాటిల్ ఆమె నెత్తిన తలమీద పడింది. ఫెళ్ళున పగిలి భళ్ళున రక్తం జలజలా కారిందతని వళ్ళంతా....నీల మళ్ళీ కెవ్వుమంది. చాచి ఆమె ముఖం మీద కొడుతూ

ప్రకాష్ పగిలిన బాటిల్ ని సుమన్ కడుపులో దింపేశాడు.

నేల కూలాడతను, జంతు రక్తంతో తన రక్తాన్ని కలుపుకుంటూ. వెళ్ళి గోడకి కొట్టుకున్న నీల, ఒక వెర్రి కేకతో ప్రకాష్ మీదికి లంఘించింది — పళ్లు బిగిస్తూ, పొడవాటి గోళ్ళున్న చేతుల్ని విసురుతూ.

ఆమె రెండు చేతులూ దొరకబుచ్చుకుని ప్రకాష్, గిరగిరా తిప్పుతూ హఠాత్తుగా వదిలేశాడు. ఆమె వెళ్ళి స్టీలు బీరువా అంచుకు గుద్దుకుని దభీమని కిందపడింది. అదే క్షణంలో కిందనుంచి అరుపులూ, పరుగెత్తుకొస్తున్న అడుగులూ విని ప్రకాష్, రెండంగల్లో వెళ్ళి ఆమె తల పట్టుకున్నాడు. దాన్ని బీరువాకు పెట్టి కొట్టసాగాడు. బలంకొద్దీ కొట్టసాగాడు....కసి కొద్దీ కొట్టసాగాడు. అదెప్పుడో పగిలి లోపలి భాగాలు వెలుపలికొచ్చేసి రక్తం ధరదలుగా ప్రవహించి పోతోంది...కానీ ప్రకాష్ ఆగలేదు.

పైకి వురికి వచ్చిన బుచ్చెమ్మా, భాస్కర్ లు తలుపు దగ్గరే ఆగిపోయారు, కళ్లు తేలవేస్తూ. దభీమని కిందపడి స్పృహ తప్పింది బుచ్చెమ్మ. ఎలాగో నిలదొక్కుకుని భాస్కర్ లోపలికి పరుగెత్తుకొచ్చాడు.

"బాస్!" అరిచాడతను కంపించిపోతూ. "అయ్యో.. బాస్ ఏమిటిది.... బాస్!....ఓహ్, బాస్..ఏమిటిదంతా!"

ప్రకాష్ చేతుల్లోంచి జారిపడిపోయింది నీల—వికృతంగా వుందామె, నిర్జీవంగా.

ప్రకాష్ చిన్నగా వెనక్కి తిరిగి చూశాడు. అతడి కళ్ళలో మృత్యువు ఇంకా నాట్యమాడుతూనే వుంది.

భాస్కర్ వెనక్కి జరిగిపోయాడు, బెదిరిపోతూ. "అయ్యో....అయ్యయ్యో....ఎంత పని జరిగింది..నువ్వెంత

పని చేశావు, బాస్!"

ప్రకాష్ లేచి నిలబడ్డాడు నిదానంగా, చేతులకయిన రక్తాన్ని షర్టుకి తుడుచుకుంటూ. ఆవేశాన్ని తగ్గించుకుంటూ గదిలో చుట్టూ చూశాడు, శవాలని. అప్పుడే అతని కళ్ళలో సంతృప్తి వ్యక్తమైంది.

"అయ్యో, ఎందుకిలా చేశావ్! ఎందుకు చేశావ్!" భాస్కర్ అరుస్తున్నాడు.

ప్రకాష్ అతన్ని సమీపించి నవ్వాడు గర్వంగా. "ఎలా చేశానో చెప్పు, భాస్కరుడా బాగా చేశాను కదూ? వీళ్లు నీ దొరని చంపారు. నేను వీళ్ళని చంపాను.... ఎలా వుంది."

"ఓహ్...." భాస్కర్ కళ్ళు మూసుకున్నాడు. "అయితే మంచి పని చేశావ్, బాస్. బాగా చేశావ్. కానీ నువ్వు వెళ్ళిపో! ఇక్కడ వుండకు, వెళ్ళిపో! వీళ్ళలో వీళ్ళు కొట్టుకు చచ్చారని చెప్తాను—నువ్వు పారిపో!"

భాస్కర్ ఏడ్చేస్తూ ప్రకాష్‌ని పట్టుకు లాగాడు.

ప్రకాష్ నిర్లిప్తంగా నవ్వాడు, కింద చూస్తూ. బీరువా దగ్గర బోర్లా పడివుంది నీల శవం. భాస్కర్‌ని విడిపించుకుంటూ అక్కడికెళ్ళాడు ఆయాసంగా. అలసటగా, ఆమె శవంమీద చతికిలబడి, "ఏడ్వకురా, ఫూల్!" అన్నాడు. కాళ్ళు సుమన్ శవంమీద జాపాడు.

అది చూడలేక కళ్ళు గట్టిగా మూసుకున్నాడు భాస్కర్.

"ఓహ్, బాస్! నువ్వు పారిపో ఇక్కడ్నించి!"

"ఏడ్వకు ఫూల్, ఏడ్వకు! నన్నెందుకు పారిపొమ్మంటున్నావ్? ఆ నాడు చేయని నేరానికి శిక్ష అనుభవించ

లేను? ఇప్పుడు చేసి అనుభవించడంలో తప్పేముంది?" నవ్వాడతను పేలవంగా, తలెగరేసి. "లేదు, పారిపోను. నామీద అప్పటి నింద పోవాలిప్పుడు....నన్నవమానించి వెలివేసిన వెధవలంతా తలలు వంచుకోవాలిప్పుడు!"

ఆవేశంగా అరిచాడతను, సుమన్ శవాన్ని తన్నేస్తూ.

"నీ దొర_భాస్కర్_చాలా మంచివాడురా! గుడ్ ఫెలో. నేనే అపార్థం చేసుకున్నాను. ఈ బిచ్ మాయమాటలు నమ్మి మోసపోయాను. అపకారం తలపెట్టాను, నీ దొరకి. ఇప్పుడిలా మూల్యం చెల్లించుకుంటున్నాను. చాలదూ ఈ ప్రాయశ్చిత్తం?"

"అయ్యో, వద్దు బాస్! నువ్విక్కడ వుండొద్దు! పారిపో! వాళ్ళలో వాళ్ళే కొట్టుకు చచ్చారని చెప్తాను పోలీసులకి! దీనికి శిక్ష వద్దు నీకు! బాస్—ప్రకాశన్నా—నా మాట విను...." ఏడ్చేస్తూ ప్రకాష్ భుజాలు పట్టుకున్నాడు భాస్కర్.

అతని చేతులు తీసేశాడు ప్రకాష్. "నన్నొదులు భాస్కర్. మా అమ్మ నాకో మాట చెప్పేది.... ఏమిటో తెలుసా? క్షుద్రుల్ని క్షమించకు అని వాళ్ళని శిక్షించడానికి దేనికీ భయపడవద్దని. కొంచెం క్రూడ్‌గా వుంది కదూ? అయినా ఆమె మాటంటే బ్రహ్మవాక్కు నాకు. అందుకే ఈ పని చేశాను.... ఈ బిచ్‌కీ, ఆ సనాఫె బిచ్‌కీ ఈ లోకంనించి విముక్తి కలిగించాను. నేనేం విచారించడం లేదు. నాకు చాలా సంతోషంగా వుంది. ఎందుకనంటే భాస్కర్, హంతకుడు కంటే అధముడు రేపిస్టు. రేప్ ఈజ్ క్రైం వరస్ట్ దెన్ మర్డర్ అన్నారు. నాకు రేపిస్టు కంటే హంతకుణ్ణి అనిపించుకోవడంలోనే తృప్తి. నా మీద కళంకం

దీనితో పోతుంది. పిలువ్ పోలీసుల్ని."

భాస్కర్ ఏకుపాపి రెప్పవేయకుండా చూస్తున్నాడు.

"పిలువ్ పోలీసుల్ని, భాస్కర్."

భాస్కర్ అలాగే చూస్తున్నాడు.

సిగరెట్ తీసి ప్రశాంతంగా వెల్గించుకుంటున్నాడు ప్రకాష్.

"నిన్నే...పిలువ్ పోలీసుల్ని."

"బాస్..."

"పోలీసుల్ని పిలువ్ బాస్టర్డ!"

అదిరిపడి, అక్కడ్నించి పరుగెత్తుకెళ్ళి ఫోన్ చేయసాగాడు భాస్కర్, గబగబా....

—:సమాప్తం:—

# అమర ప్రేమికులు

## వసుంధర

"ఇంత రాత్రివేళ ఎక్కడికిరా బయల్దేరావ్?" అంది మాలతమ్మ కొడుకు వంక ఆశ్చర్యంగా చూస్తూ.

"సెకండ్ షో సినిమాకమ్మా!" అన్నాడు ముత్యాలరావు.

"సెకండ్ షో కెందుకూ — రేపు ఆదివారమేగా — ఏ మ్యాట్నీకో వెళ్ళొచ్చు—" అంది మాలతమ్మ.

"ఆ సినిమాకు మ్యాట్నీకి టికెట్ దొరకడానికి ఇంకా రెండు నెలలేనా గడవాలి. రేపు ఆదివారం కాబట్టే ఈ రోజు సెకండ్ షోకు వెడుతున్నాను—" అని తల్లి ఇంక యెదురు ప్రశ్నలేమీ వేయకుండా చకచక వీధిలోకి నడిచాడు ముత్యాలరావు.

ముత్యాలరావుకి చాలా ఉత్సాహంగా వుంది. బయట కాస్త చలిగా వున్నా ఉత్సాహంలో ఆ చలి తెలియడం లేదు.

సెకండ్ షో అని తను తల్లికి అబద్ధం చెప్పాడు.

కానీ తను నిజానికిప్పుడు వెతుకుతున్నది సినిమాకు కాదు-వేదవతి కదకు.

వేదవతి పేరు తల్చుకోగానే అతడి తనువు పులకరించింది.

వేదవతి వయసులో ఉన్నదన డానికి ఆమె వయసు పొంగుల సాక్ష్యం వున్నది. ఒకసారామెవైపు చూసిన వాళ్ళు మళ్ళీ కళ్ళు తిప్పుకోలేరు. ఆమె గొప్ప అందగత్తె కాకపోవచ్చు కానీ చాలా సెక్సీగా వుంటుంది.

వేదవతి ముత్యాల్రావుని ప్రేమించింది. పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నది. ముత్యాల్రావూ ఆమెను ప్రేమించాడు కానీ పెళ్ళిచేసుకోవాలనుకోవడం లేదు.

వేదవతి తన అభిప్రాయం అతడికి పూర్తిగా చెప్పింది. ముత్యాల్రావు తన అభిప్రాయం ఆమెకు సగంమాత్రమే చెప్పాడు.

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను కానీ..." అని ఆగిపోయాడతను.

ఆ వాక్యం అతడిచేత పూర్తి చేయించడానికి వేదవతికి వారం రోజులు పట్టింది. "నువ్వు నన్ను నమ్మవు, అపారం చేసుకుంటావు, అసహ్యించుకుంటావు. మన ప్రేమ ఇలాగే వుండిపోనీ—" అంటూ అతడామెకు అసలు సంగతి చెప్పకుండా వారం రోజులు దాటవేశాడు. ఆమె నొక్కించగా తన మనసులోని మాట చెప్పాడు.

ఈ రోజుల్లో పెళ్ళయ్యాక యెందరో దంపతులు సెక్సు పరంగా ఇబ్బందులకు గురవుతున్నారు. అందువల్ల పెళ్ళికి ముందే కొంతకాలం దాంపత్య జీవితం అనుభవించి ఒకరికొకరు నచ్చినదీ లేనిదీ తేల్చుకొనడం మంచిదని

ముత్యాలరావు అభిప్రాయం.

ఇది విని వేదవతి తెల్లబోయింది. తర్వాత నెమ్మదిగా- "నేను నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను. నీకోసం ఏమైనా చేయగలను. ఎందుకైనా సిద్ధపడతాను. కానీ ఆ తర్వాత నువ్వు నన్ను మోసం చేయకూడదు—" అన్నది.

ఆమెను మోసం చేయడం కోసమే ముత్యాలరావు ఆ షరతు పెట్టాడు. ఆడది యెందువల్లనో ఈ ఒక్క విషయాన్ని విస్మరిస్తుంది.

ముత్యాలరావుకు వేదవతిని పెళ్ళిచేసుకోవడం ఇష్టం లేదు. అందుకు చాలా కారణాలున్నాయి. వాటిలో మొదటిది ఆమె చాలా సెక్సీగా వుండడం. ఆడది అంత సెక్సీగా వుండడం—మగవాడుగా సహించగలడు. కానీ భర్తగా భరించలేడు.

ఆపైన వేదవతికి యెవ్వరూ లేరు. పదిమంది దయతో చందాలమీద చదువుకుని ప్రస్తుతం ఉద్యోగం చేస్తోంది. అంత సెక్సీగా ఉన్న మనిషి ఇంతకాలం స్వచ్ఛంగా ఉండగలగడం కష్టం.

ఈ రెండు కారణాలను బట్టి ముత్యాలరావు ఏ తరహా మనిషో ఊహించవచ్చు. అతడామెను పెళ్ళిచేసుకోక పోవడానికి ఏమేం కారణాలుండవచ్చునో వేరే వివరించ నవసరంలేదు.

ఈ ముత్యాలరావును ప్రేమించి వేదవతి అతడినొక మహోన్నత వ్యక్తిగా భావిస్తున్నది. అతడి కోరిక తీర్చ డానికి ఈ రోజు ముహూర్తం పెట్టింది.

ముత్యాలరావు ఓసారి సమయం చూసుకున్నాడు. తొమ్మిదిన్నర అయింది. వేదవతి పెట్టిన ముహూర్తం

పది గంటలు.

“రాత్రంతా పూర్తిగా నీదాన్ని. నాకు నమ్మకమున్నది — నేను నీకు నచ్చుతానని!” అంది వేదవతి అమాయకంగా.

ఆమె ఒక చిన్న ఇంట్లో ఉంటున్నది. ఆ యింటివారూళ్ళో లేరు. మూడు రోజులవరకూ రారు. పగలైతే చుట్టుపక్కలవారికి తెలిసిపోతుంది. రాత్రి తొమ్మిది గంటలు దాటాక ఆ వీధంతా సద్దుమణుగుతుంది.

ముత్యాల్రావు కాలినడకన వెళ్ళాలని నిర్ణయించుకున్నాడు. చేసేది తప్పు పనని అతడికి తెలుసును. అందుకని సాక్ష్యాలు లేకుండా జాగ్రత్తపడుతున్నాడు.

సరిగ్గా పదిగంటలకు ముత్యాల్రావు వేదవతి ఇల్లు చేరుకున్నాడు.

వీధి నిర్మానుష్యంగా ఉన్నది. ఇళ్ళల్లో అంతా నిద్రపోతున్నట్లున్నారు. వీధిలో కుక్కలు కూడా మొరగడం లేదు.

వేదవతి ఇంట్లో మాత్రం దీపం వెలుగుతున్నది. తలుపు ఓరవాకిలిగా వేసి వుండడంవల్ల బయట మెట్లమీద వెలురు పడుతున్నది. ఆ మెట్లు యెక్కేముందు ముత్యాల్రావు మరో పర్యాయం వీధిలో చుట్టూ చూశాడు. అప్పుడు గబగబా మెట్లు ఎక్కాడు. ఓరవాకిలిగా వున్న తలుపు తోశాడు.

అంతే!

వివేకం హెచ్చరించకపోతే అతడు కెవ్వుమని అరిచి వుండేవాడే!

గదిలో మంచం. మంచంమీద వేదవతి. ఆమె చేయి ఒకటి క్రిందకు వేలాడుతున్నది. వంటిమీద బట్టలు

అ సత్య స్సంగా వున్నాయి. అయితే ఆమె సెక్సీగా లేదు. నిర్జీవంగా వున్నది. అందుకు సాక్ష్యం—ఆమె గుండెలవద్ద కనిపిస్తున్న కత్తి పిడి—అక్కణ్నించి ధారగా ప్రవహించి ఎండిన రక్తం!

ముందడుగు వేయాలా? వెనక్కి పోవాలా?

వేదవతి చచ్చిపోయింది. ఎవరో చంపేశారు.

తానిప్పుడు పోలీసులకు రిపోర్టు చేయాలా? లేక....

ముత్యాల్రావు చటుక్కున వెనక్కి తిరిగాడు. చకచకా మెట్లు దిగాడు. అతడి బుర్ర పనిచేయడం లేదు. కాళ్ళు మాత్రం పనిచేస్తున్నాయి.

వచ్చేటప్పుడు ముప్ఫై అయిదు నిమిషాలు పట్టింది. కానీ ఇప్పుడతడు ఇరవై రెండు నిమిషాల్లో ఇల్లు చేరాడు.

"అదేమిట్రా—అప్పుడే సినిమా అయిపోయిందా?" అంటూ ఆశ్చర్యపోయింది అతడి తల్లి.

"సెకండ్ షోకు కూడా టికెట్లు దొరకలేదమ్మా—" అన్నాడు ముత్యాల్రావు. అయితే తను కోరిన టికెట్ ఈ జీవితకాలానికి దొరకదని అతడికి తెలుసు.

## 2

మూడు నాలుగు రోజుల వరకూ ముత్యాల్రావు వేదవతి ఇంటివైపు వెళ్ళలేదు. పేపర్లో ఆమె హత్య గురించిన వార్త వస్తుందేమోనని చూశాడు. పేపర్లలో రాలేదు. ఊళ్ళో యెవరూ చెప్పుకోవడంలేదు.

వేదవతిని ఎవరు చంపారు? ఎందుకు చంపారు? ఆ తర్వాత ఆమె శవం ఏమైంది?—ఈ విధమైన ఆలోచనలతో ముత్యాల్రావు సతమతమైన మాట మాత్రం నిజం. అయితే ఈ ప్రశ్నలకు సమాధానం దొరికే చోటుకి మాత్రం అతడు వెళ్ళలేదు.

నాలుగు రోజులు గడిచాక అతడికింక ఫరవా లేదని పించింది. ధైర్యం చేసి, ఆ యింటికి వెళ్ళాడు.

ఆ యింట్లో ఇప్పుడు మనుషులున్నారు. కానీ వేదవతి లేదు.

ముత్యాలరావు వేదవతి స్నేహితుడని ఆ యింట్లో వారికి తెలుసు. అయితే అతడు చాలా మర్యాదస్థుడనే దురభిప్రాయం కూడా వారికి వున్నది.

"మేము నిన్ననే వచ్చామండి. వేదవతి ఊళ్లో లేదు. ఇంటికి తాళం పెట్టి యెదురింటి వాళ్ళకు ఇచ్చి వెళ్ళిందట" అన్నాడు ఇంటి వాళ్ళ చిన్నబ్బాయి ప్రసాద్.

"ఎప్పుడిచ్చిందట?" అన్నాడు ముత్యాలరావు కుతూహలంగా.

ఆ అబ్బాయి చెప్పాడు.

ముత్యాలరావు ఆశ్చర్యంగా-"నిజంగా?" అన్నాడు.

ఆ అబ్బాయి అతడివంక ఆశ్చర్యంగా చూస్తూ—"మీరంత ఆశ్చర్యపడ్డారేమిటండీ?" అన్నాడు.

ముత్యాలరావు ఆశ్చర్యపడకేం చేస్తాడు? తానామెను నిర్జీవంగా చూసిన మర్నాడుదయం ఆమె ఆ పని చేసిందంటే ఎలా నమ్మగలడు?

"నువ్వు నాకో ఉపకారం చేయాలి. మీ ఎదురింటి వాళ్ళ దగ్గరకు వెళ్ళి తాళంచెవి వాళ్ళకు వేదవతి స్వయంగా ఇచ్చిందో, యెవరిచేతనైనా పంపించిందో కనుక్కుని వచ్చి నాకు చెప్పాలి—" అన్నాడు ముత్యాలరావు.

"ఎందుకండీ?" అన్నాడా కుర్రాడు.

"తర్వాత చెబుతాను...." అన్నాడు ముత్యాలరావు.

రెండు నిమిషాల్లో ప్రసాద్ తిరిగివచ్చి—"మీరెలా

ఊహించారో గానీ వాళ్ళింట్లో తాళం చెవి ఇచ్చింది వేదవతి కాదుట. యెవరో యువకుడట. సన్నంగా, పొడవుగా వున్నాడట. చిన్న గెడ్డం కూడా వుందట..." అన్నాడు.

"చాలా థాంక్స్!" అన్నాడు ముత్యాలరావు అకృణ్ణించి కదులుతూ.

సన్నగా, పొడవుగా వుండి చిన్న గెడ్డం వుండే ఆ యువకుడెవరో ముత్యాలరావూహించగలిగాడు. అతడి పేరు మోహన్. వేదవతికి ఇంకో స్నేహితుడు. వేదవతి పెళ్ళి గురించి తనను బలవంత పెడుతున్నట్లే అతడు వేదవతిని పెళ్ళి గురించి బలవంత పెడుతున్నాడు. అయితే వేదవతి ముత్యాలరావునే ప్రేమిస్తున్నానంటున్నది.

మోహన్ కారణంగా కూడా ముత్యాలరావుకు వేదవతి సచ్ఛీలతపై నమ్మకం పోయింది. వాళ్ళిద్దరూ చనువుగా తిరగడం చాలాసార్లు చూశాడతను. వేదవతిని నిలదీసి అడిగితే—"అతడు చాలా మంచి స్నేహితుడు—" అని ఊరుకున్నది.

"మంచి స్నేహితుడు ప్రేమికుడు కాలేడా?" అన్నాడు ముత్యాలరావు.

"నా ఆలోచనల్లో నువ్వుండగా మరే మగవాడూ నాకు ప్రేమికుడు కాలేడు—" అంది వేదవతి.

"అలాంటప్పుడు అతడితో యెందుకు తిరుగుతావ్? నలుగురూ అపార్థం చేసుకునే అవకాశముంది—" అన్నాడు ముత్యాలరావు.

"ఏం చేసేది? ఓసారి ఓ ఇరుకు సందులో నలుగురు రౌడీలు నన్నల్లరి పెట్టబోయారు. ఈ మోహన్ నన్ను

రక్షించాడు."

"అది చాలా పాత ట్రిక్కు...."

"పాతదో, కొత్తదో నాకు అనవసరం. ఆ యిరుకు సందులో అతడు నన్నేం చేసినా నాకూ దిక్కులేదు. అతడు నన్ను ఆడదానిలా వాంఛించడం లేదు. భార్యను చేసుకోవాలనుకుంటున్నాడు. అలాంటి వాడు మంచి స్నేహితుడు కాడా?" అంది వేదవతి.

"నిన్ను భార్యను చేసుకోవాలనుకునేవాడు స్నేహితుడెలాగౌతాడు?"

"నేనలా అనుకోవడం లేదు కాబట్టి! అతడు నా మాటలను మన్నించే రకం కాబట్టి!"

"అతడు నువ్వు చెప్పినట్లే విశేషపక్షంలో అతడినే పెళ్ళి చేసుకొనవచ్చు కదా!"

"ముందే చెప్పాను. ఆడది జీవితంలో ఒక్కసారే ప్రేమిస్తుంది. నేను ప్రేమించడం అప్పుడే అయిపోయింది—" అంది వేదవతి.

"మోహన్‌కు లేని—నాలో వున్న ఆ విశిష్టత ఏమిటి?"

"మోహన్ మనిషి మంచివాడే.... కానీ అన్ని దురలవాట్లూ ఉన్నాయి. తాగుతాడు, వ్యభిచరిస్తాడు. నా భర్త అతడిలాకాక నీకులా ఉండాలన్నది నా సహజమైన కోరిక...."

"అన్ని దురలవాట్లున్నవాడిని నువ్వు స్నేహితుడిగా మాత్రం ఎలా భరిస్తున్నావ్?" అన్నాడు ముత్యాలరావు.

వేదవతి నవ్వింది—"కొందరు పైకి ఎంతో పెద్ద మనుషుల్లా కనబడుతుంటారు. వాళ్ళకు దురలవాట్లుండక పోవచ్చు. కానీ ఏ మాత్రం అవకాశం వచ్చినా ఆడదాన్ని మోసం చేయాలనే చూస్తుంటారు. అలాంటి

వారే ప్రమాదకరమైన స్నేహితులు. మోహన్ దురల వాట్లకు బానిస కావచ్చు. కానీ అతను మనసున్న మనిషి. నాపట్ల అతడెంతో మర్యాదగా వ్యవహరిస్తాడు. నన్ను తాకడానికి కూడా నా అనుమతి కావాలి అతడికి. అతడి తీరు చూస్తూంటే నాకెంతో ఆశ్చర్యంగా వుంటుంది. అన్నింటికీ మించి అతడిలో నిజాయితీ వున్నది. తన దురలవాట్ల గురించి అతడే నాకు చెప్పాకున్నాడు. లేకుంటే నాకు అతడి గురించి తెలిసేది కాదు. అన్ని విధాలా మంచివాడైన ఆ స్నేహితుడు నన్ను ప్రేమిస్తున్నానంటే అతడి బారినుంచి తప్పించుకొనడం కోసం త్వరగా నిన్ను వెతుక్కున్నాను. నువ్వు నాకు దొరకడం నా అదృష్టం—"

ముత్యాలరావుకీ మాటలు విన్నాక చాలా అనుమానాలు వచ్చాయి. తన్ను తాకడానికి కూడా అనుమతి కావాలంది. మోహన్ కెప్పుడైనా ఆమె అలాంటి అనుమతి ఇచ్చిందా? మోహన్ బారినుండి తప్పించుకొనడంకోసం తనను వెతుక్కున్నానంటున్నది. మోహన్ ఆమెను బ్లాక్ మెయిల్ చేస్తున్నాడా? చేస్తున్నాడంటే ఎందుకు? ఆమె ఏదైనా తప్పు చేసిందా? ఆ తప్పు శీలానికి సంబంధించిందా? తనామెకు దొరకడం అదృష్టంగా భావిస్తోంది. తనకోసం ఏమైనా చేస్తుందా?

మర్యాదగా కనబడుతూ ఆడదానికి ద్రోహం తలపెట్టేవారి గురించి ఆమె మాట్లాడిందన్న విషయం మాత్రం అతడి ఆలోచనల్లోకి రాలేదు.

ఆ మోహన్‌కి అన్ని దురలవాట్లూ ఉన్నాయి. పెళ్ళికోసం ఆమె వెంటబడుతున్నాడు. అయితే ఆమె నిరాకరించింది. నిన్న తను పూర్తిగా ముత్యాలరావుకు

వశమైపోతున్నానని ఆమె మోహన్‌కు చెప్పిందా? అప్పుడు మోహన్ ఆమెను...

ముత్యాల్రావు ఓసారి మోహన్‌ను కలుసుకుని మాట్లాడాలనుకున్నాడు.

# 3

"నమస్కారమండీ — మీరు మా యింటికి వస్తారని ఎప్పుడూ అనుకోలేదు—" అన్నాడు మోహన్ ముత్యాల్రావును సాదరంగా ఆహ్వానిస్తూ.

ఆ యిల్లు చూస్తూ ముత్యాల్రావు చాలా ఆశ్చర్యపోయాడు.

మోహన్ తాననుకున్నంత చౌకబారు మనిషి కాడు.

నాలుగు గదుల ఇల్లు అది. డ్రాయింగ్ రూంలో కార్పెట్ పరిచి వుంది. గదిలో స్టీరియో సెట్టు, టెలివిజన్ ఉన్నాయి. ఆ ఊళ్ళో టెలివిజన్ రాదు. కానీ బూస్టర్ పెడితే అప్పుడప్పుడు మద్రాసు వస్తుందట. గది అలంకరణ కూడా ఉన్నతాభిరుచులతో ఉంది.

ముత్యాల్రావు ఇబ్బందిగా సోఫాలో కూర్చుని—"వేదవతి గురించి తెలుసుకుందామని వచ్చాను—" అన్నాడు.

"వేదవతి ఊళ్ళో లేదుగా — ఊరు వెడుతున్నట్లు మీకు చెప్పలేదా?" అన్నాడు మోహన్ ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ.

"నాకు చెప్పలేదు. ఏ ఊరు వెళ్ళిందో యెప్పుడు వెళ్ళిందో చెబుతారా? ఆమెను నేను అర్జంటుగా కలుసుకుని మాట్లాడాలి—" అన్నాడు ముత్యాల్రావు.

"వెళ్ళింది అమలాపురం. మీరు వెళ్ళి కలుసుకోవడం అనవసరం. రేపు తిరిగి వచ్చేస్తుంది—" అన్నాడు

మోహన్.

ముత్యాలరావు ఉలిక్కిపడి—"రేపే వచ్చేస్తుందా—అదెలా సాధ్యం — అసంభవం?" అన్నాడు. అతడి కనులముందు నిర్జీవంగా వున్న వేదవతి శరీరం మెదులున్నది.

"అసంభవమా—ఎందుకని?" అన్నాడు మోహన్.

ముత్యాలరావుకు ఏం బదులివ్వాలో తోచలేదు—"ఇంతకీ ఆమె అమలాపురం యెప్పుడు వెళ్ళిందో చెప్పలేదు—...." అన్నాడు.

మోహన్ చెప్పాడు.

"అరె—అదెలా సాధ్యం—అసంభవం?" అన్నాడు ముత్యాలరావు. తనామెను నిర్జీవంగా చూసిన మర్నాడుదయం ఆమె అమలాపురం బయల్దేరి వెళ్ళిందంటే తానెలా నమ్ముతాడు?

"మీరేమంటున్నారో నాకు అర్థం కావడంలేదు. నేనే స్వయంగా వెళ్ళి ఆమెను బస్సు ఎక్కించి వచ్చాను—...." అన్నాడు మోహన్.

"సరే లెండి. వేదవతి రాగానే నాకు కబురు చేస్తారా?" అన్నాడతడు.

"నేను మీకు కబురు చేయడమెందుకు? రాగానే తనే ఆమె మిమ్మల్ని కలుసుకుంటానని అన్నది...." అన్నాడు మోహన్.

"ఏమో-అలా జరుగదని నాకు అనిపిస్తున్నది. రేపు మీరు ఏ సమయంలో ఇంట్లో ఉంటారో చెబితే వచ్చి కలుసుకుంటాను...."

"మీకు అంత శ్రమ ఎందుకు? ఫోన్ చేయండి - చాలు....నా నంబరిస్తాను...." అన్నాడు మోహన్.

అప్పుడే గ్రహించాడు ముత్యాల్రావు—అతనికి ఫోను కూడా ఉన్నదని!

నెంబరు తీసుకుని ఆ యింటి నుంచి బయటపడినాక ముత్యాల్రావు ఆలోచించసాగాడు. మోహన్‌కు ఎలాంటి అలవాట్లున్నాయో తనకు తెలియదు.... కానీ ...అతడు సొసైటీలో మర్యాదస్థుడని అనిపించుకునే విధంగానే జీవిస్తున్నాడు. అతడి ముందు తను చాలా విధాలుగా తీసికట్టు. అతడిని కాదని వేదవతి తనను ప్రేమిస్తున్న దంటే అందుకు కారణం ఏమిటి?

వేదవతి ఏమైంది? ఆమె చావలేదా? మోహన్ తనే ఆమెను స్వయంగా అమలాపురం బస్సు యెక్కించా నంటున్నాడు. అది నిజమా? మరి తను చూసిన సంగతి ఏమిటి?

మోహన్ వేదవతిని చూశానంటున్నాడు. అందుకు అతడు తప్ప వేరే సాక్ష్యం లేదు. వేదవతిని అతడే చంపి రాత్రికి రాత్రి ఆ శవాన్ని మాయంచేసి ఈ విధంగా నాటకమాడుతున్నాడా?

మోహన్‌ని చూస్తూంటే హత్య చేసినవాడిలా అగు పించడంలేదు. చిద్విలాసంగా, నిర్భయంగా ఉన్నాడు. బహుశా గుండెలు తీసిన బంటు అయుండాలి.

పైగా రేపే ఆమె అమలాపురం నుంచి వచ్చేస్తుం దంటున్నాడు. ఆమె నిజంగా వస్తుందా? ఒక్కరోజు చూస్తే అన్నీ తెలుస్తాయి.

ఆ ఒక్కరోజూ ఆగడం ఎంతో కష్టమనిపించింది ముత్యాల్రావుకి.

మర్నాడు సాయంత్రం అతడు మోహన్‌కి ఫోన్ చేశాడు.

"వేదవతి రాలేదండీ—పనులు కాలేదనీ—యింకా రెండ్రోజుల వరకూ రాలేననీ టెలిగ్రాం ఇచ్చింది. కానీ అదిప్పుడే అందింది. మీ ఫోన్ నంబరు చెప్పండి. ఆమె రాగానే ఫోన్ చేసి మీకు తెలియబరుస్తాను...." అన్నాడు మోహన్ ఫోన్లోంచి.

ముత్యాల్రావు ముఖం చిన్నబోయింది—"నాకు ఫోన్ లేదు. నేనే మిమ్మల్ని కంటాక్టు చేస్తాలెండి...." అని ఫోన్ పెట్టేశాడు.

అతడు తన ఆఫీసు నుంచి చేశాడు ఫోన్. ఈ సమాచారం ఆఫీసుకు చేరడం అతడి కిష్టంలేదు. మోహన్ యెలాంటివాడంటే అతడు వేదవతి గురించిన సమాచారమంతా మరెవరికయినా చెప్పి ముత్యాల్రావుకి అందజేయమనవచ్చు.

మోహన్‌కి ఫోను ఉంది. తనకు లేదు.

ఆ విషయమలా వుంచితే యిప్పుడు వేదవతి బ్రతికి ఉన్నట్లా, లేనట్లా?

మోహన్ ఏదో నాటకమాడుతున్నాడు. వేదవతి గురించి తన కేమీ తెలియదనడానికి బదులు—ఆమె యింకా బ్రతికి ఉన్నదన్న భ్రమ తనకు కలిగించాలనుకుంటున్నాడు. అతడాశించే ప్రయోజన మేమిటి?

తను శవం చూసినట్లు అతడికి తెలియదు. తెలిస్తే ఏమవుతుంది?

మోహన్ హంతకుడు. వేదవతిని హత్య చేశాడు.

వేదవతి హత్య కాలేదని తన్ను నమ్మించాలని చూస్తున్నాడు మోహన్.

ఇప్పుడు తనేం చేయాలి?

హఠాత్తుగా వేదవతి గుర్తొచ్చింది.

పాపం—వేదవతి తనను మనసారా ప్రేమించింది. తన్ను పెళ్ళి చేసుకుని తనతో హాయిగా జీవించాలని కలలు గన్నది. అందుకోసం మోహన్‌వంటి వాణ్ని కూడా వదులుకోవాలనుకున్నది. పెళ్ళికి ముందే తనకు సర్వస్వం అర్పించాలనుకున్నది.

ఇప్పుడు వేదవతి జీవించిలేదు. ఆమెను చంపినవాణ్ని తను బయట పెట్టవద్దూ?

ముత్యాలరావు బాగా ఆలోచించాడు. అతడి బుర్ర చురుగ్గా పని చేసింది.

తను మోహన్‌ని బ్లాక్ మెయిల్ చేస్తే!....

వేదవతి చనిపోయిందని తనకు తెలుసు. ఆ చావుకు కారణం హత్య అనీ తెలుసు. హంతకుడు మోహన్ అని ధృవపడుతోంది.

అలాంటప్పుడు........

వేదవతి వంటి అమాయకురాలిని చంపినందుకు మోహన్‌కు జీవితంలో మనఃసిమితం లేకుండా చేయాలి. అందులోనూ వేదవతి తనకు ప్రియురాలు.

ఆ పైన....డబ్బు కూడా సంపాదించవచ్చు....

ముత్యాలరావు రాత్రి తన ఇంట్లో గదిలో ఒంటరిగా కూర్చుని ఓ ఉత్తరం తయారుచేశాడు'

"డియర్ మోహన్!

నువ్వు వేదవతిని చంపిన విషయం నాకు తెలుసు. నీ నేరం బయటపెట్టే ఉద్దేశ్యం నాకు లేదు. పదివేల రూపాయలు ఓ బ్రీఫ్ కేసులో పెట్టి రాత్రి సమయంలో పూర్వం వేదవతి ఉండే యింటి దొడ్లో—విడిగా ఉండే ఎర్ర ఆకుల

త్రోటన్న మొక్క క్రింద పాతిపెట్టు. ఈ రాత్రికే అది జరగాలి....

నీ

శ్రేయోభిలాషి"

ఉత్తరం పూర్తిచేసి కవర్లో పెట్టి మోహన్ యింటి అడ్రసుకు పోస్టు చేశాడు ముత్యాలరావు. అలవాటు లేని పని కావడంవల్ల అతడికి చేతులు వణికాయి. అయితే అలవాటులేని పని అయినప్పటికీ అతడు చాలా జాగ్రత్తలు తీసుకున్నాడు.

ఉత్తరం వ్రాసేటప్పుడు చేతికి గ్లవ్స్ తొడుక్కున్నాడు. ఉత్తరం కష్టపడి ఎడమచేతితో వ్రాశాడు. పోస్టు చేసేటప్పుడు కూడా కవరుమీద వ్రేలిముద్రలు పడకుండా అవసరమైన జాగ్రత్తలు తీసుకున్నాడు. తన మీదకు అనుమానం రాకుండా అది వేరే వీధిలోని పోస్టు డబ్బాలో వేశాడు.

ఆ ఉత్తరం అందేక మోహన్ ఏం చేస్తాడు? తను చెప్పిన విధంగా వెళ్ళి అక్కడ డబ్బు పాతి పెడతాడా?....

పాతిపెడితే తను వెళ్ళి ఆ డబ్బు ఎలా తీసుకొనడమో అతడు ముందే ఆలోచించాడు. అంతకు ముందే అతడింకో పథకమూ ఆలోచించాడు. మోహన్‌కి తనమీద అనుమానం రాకుండా ఉండడం కోసం ముందు జాగ్రత్త అది!

## 4

"అరే—ఫోన్ చేయవచ్చుగా—యింటికే వచ్చారేమిటి? అదీ కాక వేదవతి రావలసిన రోజు రేపు గదా—...." అన్నాడు మోహన్.

"నేను వేదవతి కోసం రాలేదు. మీ కో కొత్త విశేషం చెప్పడానికి వచ్చాను—" అంటూ ముత్యాల్రావు మోహన్ కో ఉత్తరం చూపించాడు.

డియర్ ముత్యాల్రావ్!

నువ్వు వేదవతిని చంపిన విషయం నాకు తెలుసు. నీ నేరం బయటపెట్టే ఉద్దేశ్యం నాకు లేదు. పదివేల రూపాయలు ఓ బ్రీఫ్ కేసులో పెట్టి రాత్రి సమయంలో పూర్వం వేదవతి ఉండే యింటి దొడ్లో—విడిగా ఉండే ఎర్ర ఆకుల క్రోటన్సు మొక్క క్రింద పాతిపెట్టు. ఈ రాత్రికే అది జరగాలి....

నీ

శ్రేయోభిలాషి"

మోహన్ ఆ ఉత్తరాన్ని ఆశ్చర్యంగా చదివి—"అంటే వేదవతి బ్రతికి లేదంటారా? అమలాపురం చేరేక ఆమె నెవరయినా చంపేసే రంటారా....?" అన్నాడు.

"ఏమో—అదేమీ నాకు తెలియదు. కానీ వీడెవరో నన్ను బ్లాక్ మెయిల్ చేస్తాడేమిటీ?" అన్నాడు ముత్యాల్రావు.

మోహన్ గతుక్కుమని—"అవును....వాడెవరో కానీ యెందుకు మిమ్మల్ని బ్లాక్ మెయిల్ చేస్తున్నాడు? మీ గురించిన ఆధారమేదో వాడికి చిక్కి ఉంటుంది. అయినా ఆమె అమలాపురంలో ఉన్నట్లు మీకూ, నాకూ తప్ప యెవ్వరికీ తెలియదు. మీరుగానీ అమలాపురం వెళ్ళారా? అక్కడ ఆవేశంలో ఆమెను.... ... ...." అని ఆగిపోయాడు.

ముత్యాల్రావు తెల్లబోతూ—"ఆమెను నేను హత్య చేశానంటారా? ఎందుకు చేస్తానూ?" అన్నాడు అమాయకంగా.

"వేదవతితో స్నేహం చేసినవారంతా ఆమెను చంపాలనుకునే క్షణం యెప్పుడో ఒకసారి వస్తుంది—" అన్నాడు మోహన్.

సంభాషణ ఈ విధంగా దారిమళ్ళడం ముత్యాల్రావుకి నచ్చలేదు. మోహన్‌ని ట్రాప్ చేయబోయి తనే ట్రాప్‌లో పడుతున్నాడా అని అనుమానం కూడా వచ్చిందతడికి.

"ఈ ఉత్తరం చూశాక నాకు అనుమానంగా వుంది. ఇంక వేదవతి రాదు. ఆమె ఈ లోకంలో లేదు...." మోహన్ కళ్ళు తుడుచుకుంటూ అన్నాడు.

అనుకోకుండా తను మోహన్‌కి సాయపడ్డానని ముత్యాల్రావు గ్రహించాడు. అందుకని తను యే పని మీద వచ్చాడో అది వెంటనే మొదలుపెట్టా లనుకున్నాడు.

"వేదవతికి మీతోనూ నాతోనూ తప్ప వేరెవ్వరితోనూ ప్రస్తుతం స్నేహం లేదు. ఆమె హత్య చేయబడి ఉంటే మనిద్దరిలోనూ ఒకడు హంతకుడయుండాలి. నాకు వచ్చిన ఉత్తరాన్ని బట్టి ఓ మనిషివద్ద నన్ను హంతకుడిగా ఋజువుచేసే ఆధారాలేమో ఉన్నాయి. ఆ మనిషి ఎవరు? అతడీ ఆధారాలెలా సంపాదించాడు? అతడే హంతకుడా? ఆధారాలు తనే సృష్టించాడా?.... ఇవన్నీ మనం తెలుసుకోవాలంటే ఆ హంతకుడికి మనమో అవకాశమివ్వాలి. అందుకోసం నేనో పథకం వేశాను.

అందులో మీ సాయం కావాలి——" అన్నాడు ముత్యాలరావు.

"చెప్పండి——" అన్నాడు మోహన్.

"నేనో చిన్న ప్లాస్టిక్ పెట్టె తెస్తున్నాను. దాన్ని ఆ క్రోటన్సు క్రింద పాతిపెడదాం. ఆ పెట్టెలో డబ్బుండదు. కానీ వుందనుకుని హంతకుడు దానికోసం ప్రయత్నిస్తాడు. అతడిమీద నిఘా వేయాలి. లేదా యే డిటెక్టివ్‌కైనా ఈ పని అప్పగించాలి...." అన్నాడు ముత్యాలరావు.

"ఇందులో డిటెక్టివుల ప్రసక్తి యెందుకు? సాహసిక చర్యలంటే నాకెంతో ఇష్టం. ఆ పని నేనే చేయగలను...." అన్నాడు మోహన్.

"సరే——అయితే మనమిద్దరం కలిసి వెడదాం——" అన్నాడు ముత్యాలరావు.

"అసలు మనం ఆ క్రోటన్సు క్రింద పనిగట్టుకుని వెళ్ళి పాతిపెట్టడమెందుకు? హంతకుడనేవాడుంటే మనం పాతిపెట్టామని ఊహించుకుని వెళ్ళడా?"

"ఏమో——ఏం చెప్పగలం? వాడు మనని వెయ్యి కళ్ళతో కనిపెడుతూ వుండివుండవచ్చు. మనం ఆ క్రోటన్సు క్రింద యేదో పాతామని తెలిసినాకనే అక్కడికి వెళ్ళి చూసుకోనవచ్చు...." అన్నాడు ముత్యాలరావు.

"మీరు మనం మనం అంటున్నారు. ఈ కేసులో ఇంతవరకూ నాకే సంబంధమూ లేదు——" అన్నాడు మోహన్ ఇబ్బందిగా.

"అయాం సారీ——కానీ వేదవతి హత్యా నేరం విషయం మనిద్దరం కలసి సమిష్టిగా పరిశోధించాలన్నది

నా అభిప్రాయం. ఇప్పుడు చెప్పండి—వేదవతి ఉంటు న్నది అద్దె యిల్లు. వాళ్ళింటికి వెళ్ళి క్రోటన్సు మొక్క క్రింద యీ ప్లాస్టిక్ పెట్టెను పాతే ఉపాయ మేమిటి? సాహసిక చర్యలంటే మీకు యిష్టమని అంటున్నారు. ఇందుకేదయినా పథకం చెప్పండి!" అన్నాడు ముత్యాలరావు.

మోహన్ కొద్దిక్షణాలు ఆలోచించి—"ఇది చాలా సులభం. ఈ రోజు శనివారం. స్కూల్సుకి సెలవు. ఆ యింట్లో ప్రసాద్ ఒక్కడే వుంటాడు. మగవాళ్ళు ఉద్యోగాలకీ—ఆడవాళ్ళు సంగీతానికో, కుట్టుపనులు నేర్చుకుందుకో బయటకు పోతారు. ప్రసాద్‌ని టాకిల్ చేయడం పెద్ద కష్టంకాదు. రండి—వెడదాం...." అన్నాడు.

ఇద్దరూ వెళ్ళారు. మోహన్ చెప్పినట్లే యింట్లో ప్రసాద్ ఒక్కడే వున్నాడు.

మోహన్‌కా యింటి గురించి అన్ని ఆరా లెలా తెలుసు? అతడు శనివారాలు వెళ్ళి వేదవతిని కలుసుకుం టూం దేవాడా? ప్రసాద్‌ని యే విధంగా టాకిల్ చేసే వాడు?....ముత్యాలరావు మనసులో రకరకాల ఆలోచ నలు తలెత్తాయి.

"వేదవతి ఊర్నించి రావడానికింకా రెండు రోజులు పట్టవచ్చు. తను వేసిన ఎర్ర ఆకుల క్రోటన్సు మొక్కకు ఎరువు వేయమని ఆమె చెప్పివెళ్ళింది. అలా చేయకపోతే ఆమెకు కోపం వస్తుంది. ఈ రోజే వున్నట్లుండీ నాకీ విషయం గుర్తుకు వచ్చింది. వెంటనే పరుగున వచ్చాను. దారిలో ఈయన కనిపించారు...." అన్నాడు మోహన్.

ఆ ఎర్ర ఆకుల క్రోటన్సు మొక్కను వేదవతి వేసు

కుంది. దాన్ని ప్రాణంగా చూసుకుంటోంది. ఆ విషయం తనకు చెప్పింది. మోహన్‌కు కూడా చెప్పిందా? వేదవతి తనతో ఉన్నంత చనువుగానూ మోహన్‌తో కూడా ఉంటుందా?....ముత్యాలరావు ఆలోచిస్తున్నాడు.

అంతా దొడ్లోకి వెళ్ళారు. వారు కోరిన ప్రకారం ప్రశాద్ గునపం తీసుకునివచ్చాడు. ముత్యాలరావు గునపం అందుకున్నాడు.

మోహన్ ప్రసాద్‌ని పక్కకు తీసుకుని వెళ్ళి కబుర్లలో పెట్టాడు.

ముత్యాలరావు గునపం తీసుకుని జాగ్రత్తగా మొక్క చుట్టూ తవ్వసాగాడు, అతడి బుర్రలో యెన్నో ఆలోచనలు....

తను పోస్టుచేసిన ఉత్తరం నిన్ననే మోహన్‌కి అందిందన్న విషయం ధృవపర్చుకున్నాడు. ఆ ఉత్తరం చదివేక మోహన్ భయపడి వుంటాడు. అప్పుడేం చేస్తాడు? ఉత్తరంలో చెప్పిన ప్రకారం డబ్బిక్కడ పాతిపెట్టాడా? అతడి వ్యవహారం చూస్తూంటే ఏమీ తడబడుతున్నట్టు లేదు సరిగదా అసలా ఉత్తరం తనకు అందనట్లే వ్యవహరిస్తున్నాడు.

మొక్క చుట్టూ తవ్వడం పూర్తయింది. ముత్యాలరావు నెమ్మదిగా మొక్కను పైకి తీశాడు. దాని అడుగున ఓ చిన్న ప్లాస్టిక్ పెట్టె వున్నది. అతడు ఆత్రుతగా ఆ పెట్టె తెరిచి చూశాడు. అందులో ఒక వందరూపాయల నోట్ల కట్ట వున్నవి. అంటే సరిగ్గా పదివేలు.

ముత్యాలరావోసారి వెనక్కు చూశాడు. కాస్త దూరంగా మోహన్, ప్రసాద్ మాట్లాడుకుంటున్నారు. ఇద్దరూ ఈ లోకంలో వున్నట్లు లేరు.

ముత్యాల్రావు నోట్లకట్టను తన జేబులోకి తోసేశాడు. తను కూడా తెచ్చిన ప్లాస్టిక్ పెట్టెను కూడా అక్కడే పాతిపెట్టి పైన యథాప్రకారం మొక్కను పాతిపెట్టాడు. తర్వాత అతడు వాళ్ళిద్దరి వద్దకూ వెళ్ళి—"హమ్మయ్య—వచ్చిన పనయింది—" అన్నాడు.

ప్రసాద్ దారి చూపించగా అతడు బాత్రూముకు వెళ్ళి కాళ్ళు, చేతులు కడుక్కున్నాడు.

ముత్యాల్రావు, మోహన్ కలిసి ఇంట్లోంచి బయటకు వచ్చేరు.

"ఇంక నన్ను రోజూ కాపలా వుండమంటారా?" అన్నాడు మోహన్.

"రోజూ యెందుకు? యీ రాత్రికి ఉంటే చాలు........"

"ఏమో—వాడీ వేళే వస్తాడని గ్యారంటీ ఏమిటి? మనం కాచుకుని ఉంటామన్న అనుమానంతో వాడు కొన్నాళ్ళు వేచివుండవచ్చును...." అన్నాడు మోహన్.

"ఏమో-నాకు మాత్రం హంతకుడి ఆచూకీ దొరికినట్లే అనిపిస్తున్నది—" అన్నాడు ముత్యాల్రావు.

## 5

"అబ్బా — యెవరూ?" అంటూ విసుగ్గా లేచింది ముత్యాల్రావు తల్లి. ఆమె మంచి నిద్రలో వుండగా ఎవరో తలుపు తట్టారు.

ఆమె తలుపు తీసి ఎదుటి వ్యక్తిని చూసి—"యెవరు నువ్వు?" అని అడిగింది.

అతడామెకు పూర్తిగా అపరిచితుడు.

"మీ అబ్బాయి స్నేహితుణ్ని. అతడితో అర్జంటుగా మాట్లాడాలి. ఓసారి లేపండి—" అన్నాడతడు చాలా

వినయంగా.

తల్లి వెళ్ళి కొడుకును లేపింది. ముత్యాల్రావు విసుక్కుంటూ లేచాడు.

"ఎవరో నీ స్నేహితుడినంటూ వచ్చాడు.." చెప్పింది తల్లి.

ముత్యాల్రావు మత్తు వదిలింది. వెళ్ళి ఆ స్నేహితుణ్ని చూశాడు. అతడెవరో తెలియక — "ఎవర్నువ్వు?" అనడిగాడు.

"వేదవతి హత్య గురించి మాట్లాడ్డానికి వచ్చాను. ఏదైనా గదిలోకి పోయి మాట్లాడుకుందాం—" అన్నాడతడు తగ్గింపు స్వరంలో.

ముత్యాల్రావతణ్ని తన పడక గదిలోనికి తీసుకని వెళ్ళాడు. అతడి స్నేహితుడు వెనకనుంచీ తలుపులు మూశాడు.

"తలుపు లెందుకు మూశావ్?" అన్నాడు ముత్యాల్రావు.

"బయట నీ అమ్మ ఉంది. బాగుండదని!" అన్నాడతడు.

"ఎందుకని?"

అతడు చొక్కా విప్పాడు. అతణ్ని చూస్తూ దిమ్మెర పోయాడు ముత్యాల్రావు. సన్నగా కనబడుతున్నా కండలు తిరిగి ఉన్నాడతడు.

"ఇందుకు?" అన్నాడతడు కండలు పొంగిస్తూ.

"ఎవరు నువ్వు?" అన్నాడు ముత్యాల్రావు భయంగా.

"వేదవతిని చంపినవాణ్ని—" అన్నాడతడు.

ముత్యాల్రావుకి నోట మాటరాలేదు. అతడు హంతకుడా? తను మోహన్‌కి ఉత్తరం వ్రాస్తే అతడెలా

గొచ్చాడు?

"అయితే ఇక్కడికెందు కొచ్చావ్?"

"నా పదివేలూ తీసుకుని పోవడానికి...."

"ఏ పదివేలు?"

"బుకాయించకు. అంతా నాకు తెలుసు...."

"నిజంగా నాకేమీ తెలియదు—" అన్నాడు ముత్యాలరావు.

"నేను హత్యలు చేసేవాడినే కావచ్చు. కానీ అనవసర రక్తపాతం నాకిష్టముండదు. అందుకని మర్యాదగా అడుగుతున్నాను. లేని పక్షంలో నీ వద్దనుంచి డబ్బు తెచ్చుకునే మార్గం నాకు తెలుసు...." అన్నాడతడు.

ముత్యాలరావు ఆలోచిస్తున్నాడు. ఎవరితడు? తనవద్ద పదివేలూ ఉన్నట్లు ఇతడికెలా తెలుసు?

"వేదవతి చనిపోయి ఉంటే ఆమెను మోహన్ చంపి వుండాలి. నువ్వామెను చంపి ఉంటావంటే నేను నమ్మలేకపోతున్నాను...." అన్నాడు ముత్యాలరావు.

"మోహన్ చంపమన్నాడు. నేను చంపాను. మోహన్ డబ్బు పాతిపెట్టమన్నాడు. నేను పాతిపెట్టాను. ఇప్పుడు మోహన్ డబ్బు తెమ్మన్నాడు. నేను తెస్తున్నాను...."

"అంటే?" ముత్యాలరావు బుర్ర చురుగ్గా పనిచేస్తోంది.

మోహన్ చాలా తెలివైనవాడు. తెగించినవాడు. అతడి జోలికి తనవంటి సామాన్యుడు వెళ్ళడం ఏమాత్రం మంచిది కాదు.

"వేదవతి చనిపోతే — ఆమె శవం ఏమైంది?" అన్నాడు ముత్యాలరావు.

"చంపడం నా వంతు అంతే!" అన్నాడతడు.

ముత్యాల్రావు వందరూపాయల నోట్ల కట్ట అతడికిచ్చి "ఇది నాకు క్రోటన్సు మొక్క క్రింద దొరికింది. అక్కడి కెలా వచ్చిందో నాకు తెలియదు...." అన్నాడు.

"నువ్వు చాలా బుద్ధిమంతుడివి. వస్తాను...." అని అతడు వెళ్ళిపోయాడు.

"ఎవర్రా అతడు?" అంది ముత్యాల్రావు తల్లి.

"నా స్నేహితుడమ్మా!" అన్నాడు ముత్యాల్రావు.

"ఎందుకొచ్చాడు?" అంది తల్లి.

"ఎందుకా?" అని — "ఎందుకో నీ కెందుకులే అమ్మా—తర్వాత చెబుతాను. ఇప్పుడు నిద్రవస్తోంది—" అనేసి తన గదిలోకి వెళ్ళిపోయాడు ముత్యాల్రావు.

నిద్రవస్తోందని తల్లితో అయితే చెప్పాడుగానీ ఆ రాత్రి యెంతసేపటికీ అతడికి నిద్రపట్టలేదు. పదివేల రూపాయలు చేతికి దొరికినట్లే దొరికి పోయాయి. వేదవతి హత్య గురించిన వివరాలూ తెలిశాయి. కానీ హంతకుడిని తానేమీ చేయలేని స్థితిలో ఉన్నాడు. తను వేదవతి శవాన్ని మాత్రం చూశాడు. ఆ శవం ఏమైందో కూడా తెలియదు.

# 6

ఆ రోజు మోహన్ ఇంటికి వేదవతి రావలసిన రోజు.

అతడిని మళ్ళీ కలుసుకుని మాట్లాడాలంటే ముత్యాల్రావుకు భయంగా ఉన్నది. అయితే ఉత్తరం గురించి ఏమీ తెలియనట్లు నటించిన మోహన్ ముందు తనూ నటించలేడా?

సాయంత్రం ఆఫీసునుంచి ఫోన్ చేశాడు ముత్యాల్రావు.

"వేదవతి వచ్చిందండీ—" అన్నాడు మోహన్

ముత్యాలరావుకు ఆశ్చర్యంతో నోట మాట రాలేదు.

"ఎప్పుడు?" అన్నాడతడు.

"ఓ గంటయింది. తిన్నగా మాయింటికే వచ్చింది....

"ఇప్పుడు మీ ఇంట్లోనే ఉందా?" అన్నాడు ముత్యాలరావు ఆత్రుతగా.

"ఆఁ" అన్నాడు మోహన్.

"ఓ అరగంటలో వస్తున్నాను. మీరక్కడే ఉండండి—...." అని ఫోన్ పెట్టేశాడు ముత్యాలరావు.

ముత్యాలరావుకి మనసు మనసులో లేదు. వేదవతి చనిపోలేదా? అయితే ఆ రోజు తను చూసిన శవం సంగతి ఏమిటి?

ఏదో నాటకం జరిగింది. అది తెలుసుకోవాలంటే తను ఆమెను కలుసుకుని మాట్లాడాలి.

సరిగ్గా అర గంటలో అతడు మోహన్ ఇంట్లో ఉన్నాడు.

తలుపులు తెరిచే ఉన్నాయి. మోహన్ సోఫాలో కూర్చుని ఉన్నాడు. గదిలో ఇద్దరి మాటలు వినిపిస్తున్నాయి. ఒకడు మోహన్ రెండో కంఠం వేదవతిది. అందులో ఏమీ సందేహం లేదు. అయితే....

అక్కడి దృశ్యం చూసి నిశ్చేష్టుడయ్యాడు ముత్యాలరావు.

మోహన్ కుర్చీలో కూర్చుని ఎదుటి వ్యక్తితో మాట్లాడుతున్నాడు. అతడి మాటలకు ఎదుటి వ్యక్తి నుంచి బదులు వస్తున్నది. కానీ....

ఆ గదిలో మోహన్ ఒక్కడే వున్నాడు.

ఉన్నట్లుండి మోహన్ ముత్యాలరావును చూశాడు.

"హలో—రండి....రండి.... వేదా..... ముత్యాలరావు

గారొచ్చారు...." అంటూ అతడిని సాదరంగా ఆహ్వానించాడు.

"రా....నీ గురించే మాట్లాడుకుంటున్నాం...." అంది వేదవతి.

ఆమె మాటలు వినబడ్డాయి. కానీ ఆమె అతడికి కనబడలేదు.

"ఆమె ఎక్కడ?" అన్నాడు ముత్యాల్రావు.

"ఆమె అంటే?" అన్నాడు మోహన్.

"వేదవతి...."

"నీ ఎదురుగా ఉంటే ఎక్కడని అడుగుతావేమిటి? మాత్యం—నీకు గానీ మతిపోయిందా?" మందలింపు స్వరం వేదవతిది వినిపించింది.

"నాకు మతిపోయినట్లే ఉంది. మాటలు వినబడుతున్నాయిగానీ ఆమె నాకు కనబడ్డంలేదు...." అన్నాడు ముత్యాల్రావు.

"ముందు—మీరిలా వచ్చి కూర్చోండి...." అన్నాడు మోహన్.

మోహన్‌కి పక్కగా కూర్చున్నాడతడు.

"కనపడక పోవడానికి నేనేమైనా దెయ్యాన్నా, భూతాన్నా—" అంది వేదవతి.

అప్పుడు ముత్యాల్రావుకు అనిపించింది. ఆ కంఠ స్వరం కూడా సినిమాల్లో దెయ్యాలకులా సన్నగా ఉన్నది. కానీ అది వేదవతి కంఠమేనని అతడికి కచ్చితంగా తెలుసును.

"మీకు ఇంకా వేదవతి కనబడ్డంలేదా?" అన్నాడు మోహన్ నవ్వుతూ.

"మీకూ కనబడుతున్నదని అనుకోను. మీరు నన్నేదో

ఆటపట్టిస్తున్నారు...." అన్నాడు ముత్యాల్రావు.

"మిమ్మల్ని ఆటపట్టించడం నాకేమవసరం...." అన్నాడు మోహన్.

ముత్యాల్రావు ఆలోచిస్తున్నాడు.

మోహన్ ఎందుకో తనతో ఆటలాడుతున్నాడు. ఎదురుగా వేదవతి లేదన్న విషయం తథ్యం. కానీ ఆమె మాటలు ఎలా వస్తున్నాయి? తన ప్రశ్నలకామె బదులెలా ఇవ్వగలుగుతున్నది? కచ్చితంగా అది టేపు రికార్డరు వ్యవహారం కాదు.

మరి?

ఇంతకీ ఈ నాటకం ప్రయోజన మేమిటి?

"ఏమిటి ముత్యం — అలా మౌనంగా ఉంటావ్? ఏమైనా మాట్లాడు...."

అది వేదవతి కంఠం. సందేహంలేదు. కుర్చీలోంచే వస్తున్నది. అందుకూ సందేహం లేదు. అయితే ఆమె కనబడదేం?

ఒకవేళ....ఆమె చచ్చి దెయ్యమయిందా?

ముత్యాల్రావు లేచి కుర్చీని సమీపించాడు. అందులో తడుముబోగా ఏమీ తగలేదతడికి. ఈలోగా మోహన్ అతడిని సమీపించి పక్కకు లాగి— "మిస్టర్ ముత్యాల్రావ్! మీరు ప్రేమించినట్లే నేనూ ఈమెను ప్రేమించాను. మనిద్దరిలో ఎవరినామె వివాహం చేసుకుంటుందో తెలియదు. కానీ అంతవరకూ మనం ఒకరి ఎదుట ఒకరు ఆమెతో చనువుగా ఉండరాదు. నేనామెను తాకను. మీరూ ఆమెను తాకరాదు—...." అన్నాడు.

"ఆమె నాకు కనబడనప్పుడు తాకడం ప్రసక్తి ఎక్కడ?" అన్నాడు ముత్యాల్రావు నీరసంగా. ఇదంతా

ఏమిటో అతడికి అర్థంకాకుండా ఉన్నది.

అప్పుడతడికి కుర్చీలోంచీ నవ్వు వినబడింది. ఆ నవ్వు వింటూంటే వేదవతి కుర్చీలో కూర్చుని ఉండి నవ్వు తున్నదనే అనిపిస్తుంది.

ఇందులో ఏదో మోసముంది! వేదవతి మోహన్ కలిసి ఏదో నాటకమాడుతూండి ఉండాలి. లేదా ఆమె దెయ్యమై వచ్చి మోహన్ మీద పగ తీర్చుకునే ప్రయ త్నంలో ఉండిఉండాలి. తను దెయ్యమై వచ్చానన్న విషయం తెలియడంకోసం తనకు కనబడంలేదు.

అయితే ఇందులో ఓ తిరకాసున్నది. వేదవతిని మోహన్ హత్య చేసివుంటే, లేదా చేయించివుంటే— ఆమె తిరిగిరావడాన్ని అతడు అనుమానించాడా? తనను భ్రమలో ఉంచడానికి అతడేదో నాటకమాడు తున్నాడా?

అంతా అయోమయంగా ఉంది — "నేను వెళ్ళి పోతాను—" అన్నాడు ముత్యాలరావు.

"సరే—ముత్యం.... నేను వచ్చి నిన్ను కలుసుకుని మాట్లాడతాగా—" అన్న వేదవతి గొంతు వినిపించింది. ఆ గొంతు వింటూంటే అతడికి భయంవేసింది. చరచరా అడుగులు వేశాడు. మోహన్ చటుక్కున అతిడినను సరించి అందుకుని—"నిజంగా మీకు వేదవతి కనబడ్డంలేదా?" అన్నాడు.

"నాకు అబద్ధాలాడే అలవాటు లేదు..." అన్నాడు ముత్యాలరావు.

"ఆ విషయం నాకు తెలుసులెండి..." అన్నాడు మోహన్.

అప్రయత్నంగా మోహన్ ముఖం వంక చూశాడు

ముత్యాలరావు. తను మోహన్ కు ఉత్తరం వ్రాయడం, తనకూ ఉత్తరం వచ్చినట్లు చూపించడం, క్రోటన్సు మొక్క కింద డబ్బు పాతడం కోసం మోహన్ సాయం కావాలని అర్థించడం...ఇవన్నీ ఏమిటి..అబద్ధాలు కావా? అని అతను ప్రశ్నిస్తున్నట్లుగా అనిపించిందతడికి.

"మరెందుకీ ప్రశ్న వేశారు?"

"ఆమె కట్టుకున్న లేత నీలం షిఫాన్ చీర, అదే రంగు బ్లవుజు, గులాబి రంగులోని ఆమె శరీరఛాయ, చెవులకు వ్రేలాడే పెద్ద పెద్ద రింగులు...ఇందులో ఏమీ మీకు కనబడలేదా?"

ముత్యాలరావు అదోలా అతడి వంక చూసి బదులేమీ ఇవ్వకుండా అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. అతడు వేదవతి నెందుకు వర్ణించాడో అప్పుడు తెలియలేదు ముత్యాలరావుకు.

# 7

ముత్యాలరావు తిన్నగా తన స్నేహితుడు వాసు ఇంటికి వెళ్ళి—"నీకు తెలిసిన గొంతు ఒకటి కుర్చీలోంచి వినిపిస్తుంది. మనిషి కనబడడు. నువ్వడిగిన ప్రశ్నలన్నింటికీ జవాబులు వస్తూంటాయి. అప్పుడా కుర్చీలో దెయ్యమున్నదనుకోనా లేక దీనికి సైన్సు ఏమైనా బదులివ్వగలదా?" అనడిగాడు.

వాసు సైంటిస్టు. స్నేహితుడి ప్రశ్న విని అతడు నవ్వి "దెయ్యాలు లేవని నేను అనలేదు. నా జ్ఞానం పరిమితం. ఆ కుర్చీలో దెయ్యం లేదని నేను చెప్పలేను. కానీ సైన్సు అలాంటి ఏర్పాటు చేయగలదు. నువ్వు వాకీటాకీల గురించి వినే ఉంటావు. మినీ రేడియో స్టేషన్ అనుకో! కుర్చీలో స్పీకరు బిగించి ఉండవచ్చు. పక్క గదిలోంచి

రహస్యంగా నిన్ను గమనిస్తూ, నీ మాటలు వింటూ ట్రాన్స్మిటర్ ద్వారా నీకు బదులిస్తూంటే—విజయవాడ రేడియో స్టేషన్లోని సినిమా పాటలు—నీ యింట్లో రేడియోలో వినబడినట్లే—పక్క గదిలోని మాటలు ఆ కుర్చీలోంచీ వస్తాయి. కావాలంటే నీకది చూపించగలను కూడా—..." అన్నాడు.

"ఇలాంటిదేదో జరిగి ఉండవచ్చనని నేనూ ఊహించాను. ఓసారి నా కళ్ళతో నేను చూస్తాను... చూపించు..." అన్నాడు ముత్యాల్రావు.

వాసు అతడి యెదురుగా ఉన్న కుర్చీలో ఓ రేడియో ఉంచాడు. దాన్ని ఆన్ చేసి ఓ ఫ్రీక్వెన్సీకి ట్యూన్ చేశాడు. అప్పుడు ముత్యాల్రావుకు ట్రాన్స్మిటర్ చూపించాడు. అది ఒక చిన్న మైక్రోఫోన్లాగున్నది. అప్పుడతడు పక్క గదిలోకి వెళ్ళాడు.

కొద్ది క్షణాల్లో రేడియోనుంచి వాసు గొంతు వినబడింది.

"అలా కూర్చోండి పోయావేం? లేచి నిలబడు... నేను నీ స్నేహితుణ్ని కదా—నా కాలిలో ముల్లు దిగితే తీయడానికి కాస్త సాయం చేయవచ్చుగా..."

ముత్యాల్రావుకి అంతా అర్థమయింది. అతడు వాసుకు ధన్యవాదాలు చెప్పుకుని తిన్నగా ఇంటికి వెళ్ళిపోయాడు.

"ఏరా—ఈ రోజు ఆలస్యమైంది?" అనడిగింది తల్లి. ముత్యాల్రావు బదులివ్వలేదు. అతడు వేదవతి గురించే ఆలోచిస్తున్నాడు.

వేదవతి ఏమైంది? బ్రతికి ఉందా, లేదా? ఆమె తనను కలుసుకుంటానంది. ఎప్పుడు, ఎక్కడ, ఎలా కలుసుకుంటుంది? కలుసుకుని ఏం మాట్లాడుతుంది?

రాత్రి భోజనాలు కాగానే అతడి తల్లి—"ఏమిటోరా- ఈ రోజు కళ్ళు తెలియని నిద్ర వచ్చేస్తోంది—" అని వెళ్ళి నిద్రపోయింది.

ముత్యాల్రావుకు చాలా ఆశ్చర్యం కలిగింది. తల్లి ఎప్పుడూ అలా చేయలేదు. సాధారణంగా తను నిద్ర పోయినాకనే ఆమె నిద్రపోతుంది.

ఓ పట్టాన అతడికి నిద్ర రాలేదు. రాత్రి పదిన్నరకు కాబోలు యెవరో అతడి ఇంటి తలుపు తట్టారు. వెళ్ళి తలుపు తీశాడు ముత్యాల్రావు.

వేదవతి!

లేత నీలం రంగు షిఫాన్ చీర, అదే రంగు బ్లవుజు, గులాబి రంగు శరీర ఛాయ, చెవులకు వ్రేలాడుతున్న పెద్ద పెద్ద రింగులు...

ఆమె వేదవతి మాత్రమే కాదు...పూర్తిగా మోహన్ వర్ణించిన విధంగానే ఉన్నది. ముత్యాల్రావుకు కొద్ది క్షణాలు నోట మాట రాలేదు.

"నీకోసం వచ్చాను ముత్యం. సాయంత్రం మోహన్ ఎదురుగా నీతో యెక్కువగా మాట్లాడ్డం ఇష్టంలేక పోయింది. అందుకే మీ యింటికే స్వయంగా వచ్చాను. అత్తయ్య నిద్రపోతున్నారా?" అంది వేదవతి.

"ఊఁ" అంటూ ఆమెకు దారి ఇచ్చాడు ముత్యాల్రావు.

వేదవతి తనే తలుపులు వేసింది తిన్నగా. అతడి పడకగదిలోకి దారితీసింది. ముత్యాల్రావు ఆమెను అనుస రించాడు. అతడి మెదడంతా అయోమయంగా ఉన్నది.

ఇద్దరూ గదిలో కూర్చున్నారు. వేదవతి మంచంమీద కూర్చున్నది. ముత్యాల్రావు ఆమెకు ఎదురుగా ఓ స్టూలు మీద కూర్చున్నాడు.

"ఇప్పుడు చెప్పు ముత్యం...ఆ రోజు నువ్వు మన ప్రోగ్రాం ఎందుకు పాడు చేశావు?"

"ఏ రోజు?"

"అదే...పెళ్ళికి ముందే నువ్వు నన్ను నీ దాన్ని చేసుకోవాలనుకున్న రోజు...."

"ఆ రోజా?....ఆ రోజు....ఆ రోజు...." ముత్యాలరావు కొద్ది క్షణాలు తడబడి — "ఆ రోజు నేను వచ్చాను. నీ శవాన్ని చూశాను...." అన్నాడు.

వేదవతి కిలకిలా నవ్వి—"అంతా మోహన్ చెప్పినట్లే చేశావు...." అంది.

"అంటే?"

"మోహన్ నన్ను ప్రేమిస్తున్నాడు. నేను నిన్ను ప్రేమిస్తున్నాను. అతడికది ఇష్టంలేకపోవడం సహజమే కదా! నీ గురించి ఎన్నో అన్నాడు. తనైతే నన్ను పువ్వుల్లో పెట్టి చూసుకుంటాట్ట. నువ్వేమో పిరికివాడివట స్వార్థపరుడివట. నన్ను మోసం చేయాలనుకుంటున్నావుట. నేను అన్నింటినీ ఖండిస్తే తనన్నాడూ—ఓసారి ఆశపెట్టి అతడిని నీ గదికి ఆహ్వానించు. అక్కడ నువ్వు హత్యచేయబడినదానిలా పడివుండు. అప్పుడతడు నీ చావుకు విలపిస్తాడో, హత్యా నేరానికి భయపడి పారిపోతాడో చూడు. పారిపోయినవాడు స్వార్థపరుడు. లేనిపక్షంలో అసలైన ప్రేమికుడు!

ఈ మాటల్ని నేనో సవాలుగా తీసుకుని నిన్ను పరీక్షించాను. ఆ రోజు నువ్వు నా దగ్గరకు వచ్చి నాలో ఇంకా కాస ప్రాణం ఉన్నదేమోనని పరీక్షిస్తావను కున్నాను. అలా చేస్తే అప్పుడే నీ వశం కావాలను కున్నాను. కానీ అలా జరుగలేదు. నువ్వు పారిపోయావు"

అని నిట్టూర్చింది వేదవతి.

ముత్యాల్రావు కాస్త సిగ్గుపడ్డాడు. వేదవతి తనను కున్నంత సామాన్యురాలు కాదనీ ఆమె తననుకున్నంత సులభంగా శీలాన్ని నిర్లక్ష్యం చేయదనీ అతడు గ్రహించాడు. తనామెను మోసం చేయాలని అనుకుంటే ఆమె తన స్వార్థాన్ని బయటపెట్టే పథకం వేసింది.

ఆ రోజు తనకేమయింది? తన్ను తాను అర్పించుకొనడానికి సిద్ధపడిన వేదవతి అక్కడ నిర్జీవంగా పడివుంటే ఆమె గురించి ఆలోచించకుండా, వ్యధపడకుండా అక్కణ్నించి పారిపోయి ఆమె దృష్టిలో చులకన అయిపోయాడు.

"ఆ రోజు నా ప్రవర్తన విషయమై చాలా సిగ్గుపడుతున్నాను వేదా! ఏమిటో ఆ క్షణంలో అంతులేని భయం నన్నావహించింది...." అన్నాడు ముత్యాల్రావు.

"ఆ రోజు సంగతి సరే....ఆ తర్వాత మాత్రం నువ్వేం చేశావు? క్షణం కూడా నా గురించి దిగులుపడలేదు. పైగా నా చావుని ఉపయోగించుకుని మోహన్ని బ్లాక్ మెయిల్ చేయాలనుకున్నావు! డబ్బు సంపాదించాలనుకున్నావు ..."

"నువ్వు పొరపాటు పడుతున్నావు...." అన్నాడు ముత్యాల్రావు తడబడుతూ.

"ఇన్నాళ్ళూ నేను మోహన్ ఇంట్లోనే ఉన్నాను. నువ్వు మాట్లాడిన ప్రతి మాటా అక్షరం పొల్లుపోకుండా విన్నాను. నువ్వు చాలా సామాన్యుడివి. మోహన్ ఇలాంటి విషయాల్లో అఖండుడు. ఉత్తరం రాగానే అది నీ నుంచేనని గ్రహించాడు. వెంటనే అక్కడ డబ్బు

పాతిపెట్టించాడు. ఆ తర్వాత నీకూ ఉత్తరం వచ్చిందంటూ తనవద్దకు రాగానే నీ పథకం సులభంగా తెలుసుకోగలిగాడు. నువ్వు చాలా చచ్చు పథకం వేశావు. మోహన్‌లాంటి వాళ్ళతో నువ్వలాంటి పథకాలు వేయకూడదు. నా గురించి కానీ లేకపోతే అతడు నిన్ను పులుసులోకి ఎముకలేకుండా తన్నించేవాడు.

ఈ రోజు నేను నిన్ను కలుసుకుని మాట్లాడుతానంటే మీ అమ్మకు త్వరగా నిద్ర వచ్చే ఏర్పాటు చేశాడు. భోజనానికి ముందు ఆమె వేసుకునే మాత్రల సీసాలో నిద్రమాత్రలు మార్చాడు. రెండు మాత్రలూ ఒకే రకంగా ఉండడంవల్ల ఆమెకు తేడా తెలిసి ఉండదు" అంటూ ఆమె అతడి చేతికి ఓ పొట్లం అందించి—"ఆ మాత్రల సీసాలో నిద్రమాత్రలు తీసేసి మళ్ళీ ఇవి పోసేయ్...." అంది.

ముత్యాల్రావు ఆశ్చర్యంగా ఆమె చెప్పేది వింటున్నాడు. మాట్లాడుదామంటే అతడికి నోట మాట రావడం లేదు.

"మోహన్ గురించి విన్నావు కదా....అతడు నన్ను ప్రేమిస్తున్నాడు. నేను లేనిదే బ్రతకలేనంటున్నాడు.." అంది వేదవతి మళ్ళీ.

"ఇదంతా నాకెందుకు చెబుతున్నావ్?" అన్నాడు ముత్యాల్రావు.

"ఎందుకో ఊహించుకో!" అంది వేదవతి.

"ఏమో—నాకు తెలియదు...." అన్నాడు ముత్యాల్రావు.

వేదవతి కిలకిలా నవ్వింది — "సాయంత్రం కూడా నువ్విలాగే ముఖం పెట్టావు మోహన్ ఇంట్లో. అప్పుడూ

నాకు చాలా నవ్వొచ్చింది. అసలు నువ్వేమీ ఊహించ లేవు...." అంది.

"అక్కడ మోహన్ ఏం చేశాడో నేనూహించాను" అంటూ వాసు తనకు చెప్పింది అతడామెకు చెప్పాడు.

"చాలా గొప్ప విశేషం అనుకున్నావు. తెలివైన వాడివే....అది సరే....మరి మోహన్ అలాంటి నాటక మెందుకాడాడో ఊహించగలిగేవా?"

"లేదు...."

"వేదవతి చచ్చిపోయిందన్న భావం అతడు నీలో ప్రవేశ పెట్టదల్చుకున్నాడు...."

"అందుకు నువ్వు అతడికి సహకరిస్తున్నావు...." అన్నాడు ముత్యాల్రావు కోపంగా.

"కానీ నాకంటే ఎక్కువగా నువ్వే అతడికి సహకరిస్తున్నావు...." అంది వేదవతి.

"అంటే?"

"నేను నీ గొప్పతనం గురించి మోహన్‌కు ఋజువు చేయాలనుకుంటూంటే నువ్వు నాకు కాక మోహన్‌కే సహకరిస్తున్నావు...."

"నేను నీ కెందుకు సహకరించాలి?" అన్నాడు ముత్యాల్రావు.

"ఎందుకా? నేను నిన్ను ప్రేమిస్తున్నాను కాబట్టి" అంది వేదవతి.

"ఇంకానా?" అన్నాడు ముత్యాల్రావు అప్రయత్నంగా.

వేదవతి — నవ్వి — "ఇంకానా అనేశావు అనుకోకుండా! అంటే నువ్వు నా ప్రేమకు అర్హుడివి కాదని నీ మనసు నీకు చెబుతుంది. కానీ ముత్యం....ఈ ప్రపం

చంలో మగాడు ఆడదాన్ని అర్థం చేసుకోవడమన్నది యుగాంతానికి కూడా జరుగదు. నువ్వు గొప్పవాడివని నేను నిన్ను ప్రేమించడం లేదు. నేను ప్రేమించాను కాబట్టి నువ్వు నాకు గొప్పవాడివి. ఆ విషయం నీకూ అర్థంకాదు. మోహన్‌కూ అర్థంకాదు. అందుకే తన గొప్పతనం ఋజువు చేసుకోవాలని అతడు ప్రయత్నిస్తున్నాడు. నువ్వు తక్కువేమోనని నువ్వనుకుంటున్నావు. మోహన్ ఈ ప్రపంచానికే ఏలిక అయినప్పటికీ నేనతణ్ని పెళ్ళి చేసుకోలేను. ప్రేమించలేను. నువ్వెంకా ఘోరంగా ప్రవర్తించినా నేను నిన్ను ప్రేమిస్తూనే ఉంటాను. అది నా బలహీనత...." అంది.

ముత్యాలరావు ఆలోచిస్తున్నాడు. తన తప్పుల్ని కూడా మన్నించి ఆమె తనను ప్రేమిస్తున్నది. అలాంటి వనిత తనకు భార్య అయితే జీవితం ఎంతో సుఖంగా ఉంటుంది. ఆమెను తను వదులుకోరాదు. కానీ....

"మోహన్ నా గురించి సవాలుచేస్తే నువ్వతనికే సహకరించి నన్నో వెర్రి వెధవను చేసి ఆడించావు. నువ్వు నన్ను ప్రేమిస్తున్నట్లు ఎలా నమ్మేది?" అన్నాడు ముత్యాలరావు.

"నేను మోహన్‌కు సహకరించడానికి బలమైన కారణముంది. నేను నీకు మోహన్ శక్తిసామర్థ్యాలు ఋజువు చేయదల్చాను. అలాంటి మోహన్‌ని కాదని నిన్ను చేసుకోబోతున్నానన్న విషయం నీకు స్పష్టంగా చేసి నా ప్రేమ బలాన్ని నిరూపించుకోవాలని తాపత్రయ పడ్డాను. అందుకే అతడికి సహకరించాను...." అంది వేదవతి.

ముత్యాలరావు ఆమె ముఖం వంక చూశాడు. ఆమె

కళ్ళలో నిజాయితీ కనబడుతోంది. అప్పుడతడు నెమ్మదిగా "నీ ప్రేమ బలాన్ని నువ్వు నిరూపించుకున్నావు. కానీ నా ప్రేమ బలాన్ని నేనూ నిరూపించుకుంటే తప్ప నాకు తృప్తిగా ఉండదు. అందుకు నువ్వే నాకో అవకాశ మివ్వాలి...." అన్నాడు.

"ఏమిటది?"

"సాధారణంగా పురుషుడు ఏం చేస్తాడు? ఆడదాన్ని అనుభవించేక-నువ్వెవరో నాకు తెలియదు పొమ్మంటాడు. లేదా నువ్విలా ఎందరితో తిరిగావో అంటాడు. నువ్వు నాకు అలా అనే అవకాశం ఒకటివ్వు. అప్పుడు నేను నిన్ను భార్యగా స్వీకరించి నా ప్రేమ బలాన్ని ఋజువు చేసుకుంటాను...."

కథ మళ్ళీ మొదటికి వచ్చింది. అతడామెతో పెళ్ళికి ముందే అనుభవాన్ని కోరుతున్నాడు. దానికి ప్రేమ బలాన్ని పరీక్షించుకోవడం అనే ముసుగు వేస్తున్నాడు. వేదవతి అదే అతడికి చెప్పి—"పరీక్ష పేరుతో మరోసారి నీ స్వార్థాన్ని బయట పెట్టావు. అయినప్పటికీ నీకు సహాక రించి నా ప్రేమ బలాన్ని ఋజువు చేసుకుంటాను...." అంది.

ముత్యాల్రావు వళ్ళు పులకరించింది—"ఇప్పుడే?" అన్నాడు ఉత్సాహంగా.

"ఇప్పుడూ కాదు, ఇక్కడా కాదు...." అంది వేదవతి.

"మరి?"

"నాకు కొన్ని ఆదర్శాలున్నాయి. ఆశయాలున్నాయి. పెళ్ళికి ముందు మగవాడికి శరీరం అర్పించడం నాకిష్టం లేదు. అందుకని ఓ పని చేయి. ఓ తాళిబొట్టు కొని

తీసుకునిరా! నా ఇంట్లో నేను పెళ్ళి మంత్రాల టేపు సిద్ధంగా ఉంచుతాను. ఏకాంతంలో మనిద్దరం ఉండగా ఆ మంత్రాలు వస్తూండగా నా మెడలో తాళిబొట్టు కట్టు. మన పెళ్ళి జరిగిపోయిందన్న తృప్తి నాకు ఉంటుంది. రహస్యం ఎవరికీ తెలియదు కాబట్టి—నన్ను ఆవుననడానికీ కాదనడానికీ నీకు అవకాశమూ ఉంటుంది. అప్పుడు నువ్వు నీ ప్రేమ బలాన్ని ఋజువు చేసుకోనవచ్చును...." అంది వేదవతి.

ముత్యాలరావుకు మనసు చివుక్కుమంది. ఏదో తప్పు చేస్తున్నానన్న భావం అతడికి కలిగింది. అతడింకేమీ మాట్లాడలేదు.

"నీ జాతకం చెప్పు. ముహూర్తం పెట్టించి కబురు చేస్తాను...." అంది వేదవతి.

ముత్యాలరావామెకు తను పుట్టిన తేదీ, సమయం చెప్పాడు. వేదవతి వెళ్ళిపోయింది. ఆ తర్వాత కూడా అతడికి నిద్రపట్టలేదు.

# 8

"ఇంత రాత్రివేళ యెక్కడికిరా బయల్దేరావ్?" అంది మాలతమ్మ కొడుకు వంక ఆశ్చర్యంగా చూస్తూ—"సెకండ్ షో సినిమాకా?"

"కాదమ్మా—" అన్నాడు ముత్యాలరావు—"మా ఆఫీసులో ఒకతనికి ట్రాన్స్ఫరై వెళ్ళిపోతున్నాడు. రాత్రి మేమంతా స్పెషల్ పార్టీ చేసుకుంటున్నాం. నేనింక ఉదయమే ఇంటికి వస్తాను...."

"స్పెషల్ పార్టీ అంటేఁ?" అంది మాలతమ్మ.

ముత్యాలరావు కళ్ళముందు తను, వేదవతి ఒకరి కౌగిలిలో ఒకరు ఐక్యమైపోతున్న దృశ్యం కనబడు

తున్నది.

"స్పెషల్ పార్టీ అంటే స్పెషల్ పార్టీయే...." అని ఇంట్లోంచి బయటపడి — టైము చూసుకున్నాడు. తొమ్మిదిన్నరయింది. వేదవతి ఇల్లు చేరుకోనడానికి అర గంట కంటె పట్టదు.

ముత్యాలరావు జేబులు తడుముకున్నాడు. తాళిబొట్టు తగిలింది.

ఇందులో ఏమీ మోసం లేదు కదా!

తను తాళి కడుతూండగా ఎవరైనా రహస్యంగా ఫోటో తీస్తే....

తను జాగ్రత్తగా పరిసరాలు గమనించాలి. గదిలో అన్ని తలుపులూ, కిటికీలతో సహా మూసేయాలి. ఆపైన గదిలో ఎక్కడా కెమెరా అమర్చబడలేదని ధృవపర్చుకోవాలి. గదిలో దీపం ఆర్పేసి ఆ చీకట్లో ఆమె మెడలో తాళి కట్టాలి. చీకట్లో తాళి కడుతూండగా ఎవరైనా ఫోటో తీసే మాటైతే ఫ్లాష్ తళుక్కుమంటుంది. అదీకాక చీకట్లో తామెక్కడ ఉంటారో కెమేరా పట్టుకున్నవాడికి ఎలా తెలుస్తుంది?

పదిగంటలకల్లా వేదవతి ఇల్లు చేరాడు ముత్యాలరావు.

అంతా తన అదృష్టం! ఇంటివాళ్ళు అనుకోకుండా ఊరికి వెళ్ళారు. వేదవతి ఈ రోజుకు ముహూర్తం పెట్టింది. ఇంత త్వరగా తనకిలాంటి అవకాశం వస్తుందని ముత్యాలరావు అనుకోలేదు. ఎటొచ్చీ అవకాశం ఉపయోగించుకున్నాక ఏం చేయాలా అని ఆలోచిస్తున్నాడతడు. వేదవతిని మోసం చేయవచ్చునా—కూడదా?

తలుపులు ఓరవాకిలిగా వేసి వున్నాయి. గదిలో దీపం వెలుగుతున్నట్లు తెలుస్తున్నది. ముత్యాలరావు

తలుపులు తీసి ఆశ్చర్యంగా ఆగిపోయాడు.

గదిలో మంచం. మంచంమీద వేదవతి. ఆమె చేయి ఒకటి క్రిందకూ వేలాడుతున్నది. వంటిమీద బట్టలు అస్తవ్యస్తంగా ఉన్నాయి. సూటిగా గుండెల్లోకి దిగిన కత్తి పిడి పైకి కనబడుతున్నది. రక్తం ధారగా ప్రవహించిన సూచనలున్నాయి.

సుమారు నెలరోజుల క్రితం తను చూసిన దృశ్యానికీ ఈ దృశ్యానికీ పెద్దగా తేడా లేదు.

ముందు ఆశ్చర్యపోయినా ధైర్యం తెచ్చుకున్నాడు ముత్యాల్రావు.

ఒకసారి వేదవతి ఇలాగే తనను పరీక్షించింది. మోహన్ వంటి అఖండుడామెను ప్రేమిస్తూండగా ఎవరూ ఆమెను హత్యచేయలేరు. అయినా ఎవరైనా ఆమెను హత్య చేయాలని ఎందుకనుకుంటారు?

సందేహం లేదు—ఆమె మళ్ళీ తనతో నాటకమాడుతున్నది.

ముత్యాల్రావు నాలుగడుగులు ముందుకువేసి ఆమెను సమీపించి—గుండెలవద్దనున్న రక్తాన్ని తాకాడు. రక్తం జిగురుగా వున్నదనిపించింది.

"ఏమి రంగు వాడిందో—నిజం రక్తంగానే ఉన్నది" అని మనసులో అనుకుని—"వేదవతీ—ఇంకా నీ నాటకం కట్టిపెట్టి—లే!" అన్నాడు.

ఆమె కదలలేదు.

అతడామెను పట్టుకుని కుదిపాడు.

అప్పుడు కదిలింది వేదవతి—అతను కుదపడంవల్ల. మోకాళ్ళమీద వంగి కుదపడంవల్లనేమో—ఆమె అతడిమీద పడింది.

ముత్యాల్రావు వెల్లకితలా పడ్డాడు. అతడి మీద వేదవతి పడింది.

తనమీద మనిషి కాక శవమే పడినట్లు అనిపించింది ముత్యాల్రావుకు.

వేదవతి శవం బిగుసుకుని ఉన్నది. శరీరం కాస్త చల్లబడినట్లున్నది.

ముత్యాల్రావు కెవ్వుమని కేక వేసి వేదవతిని తనమీద నుంచి తొలగించాడు. అతడిలో కంగారు ప్రారంభ మయింది. అతడామె గుండెల్లో దిగిన కత్తి పిడిని తాకాడు. అతడి బట్టలు రక్తసిక్తాలయ్యాయి. అక్కడ మడుగు కట్టిన రక్తంలో అతడి పాదముద్రలు పడ్డాయి.

అతడి కేక వినడం వల్లనో ఏమో కొంతమంది జనం ఆ యింటిముందుకు వచ్చారు. వారిలో ఒకడు లోపలకు తొంగిచూసి — "హత్య....హంతకుడు...." అంటూ పెద్దగా కేకలు పెట్టాడు.

అది విని ముత్యాల్రావు ఉలిక్కిపడి అటు చూసి— "నో....నో.... నేను హంతకుణ్ని కాదు...." అంటూ అరిచాడు.

# 9

"నువ్వామెను బలవంతాన పెళ్ళాడాలనుకున్నట్లు నీ జేబులోని తాళిజోట్టు చెబుతోంది. ఆమె నీ కోరికను కాదన్నందుకు ఆవేశపడి ఆమెను చంపేశావు. కత్తిపిడి మీద నీ వేలిముద్రలున్నాయి. అన్నింటికీ మించి రెడ్ హ్యాండెడ్‌గా పట్టుబడ్డావు. మర్యాదగా నేరం ఒప్పుకో.... లేనిపక్షంలో నీచేత ఒప్పించాల్సి ఉం టుంది...." అన్నాడు పోలీసు ఇన్‌స్పెక్టర్.

"నాకేం తెలియదు. నేను నిర్దోషిని—" అరిచాడు

ముత్యాలరావు.

"హత్య చేసిన ప్రతివాడూ నీకులాగే అంటాడు తప్పితే నేరం ఒప్పుకోడు. నేరం ఒప్పించడానికి మేమెలాంటి పద్ధతులవలంభిస్తామో నీకు తెలియదు. ఆ పద్ధతులవల్ల నేరం చెయ్యనివాడు కూడా చేశాననే పరిస్థితి ఏర్పడుతూంటుంది. బాగా ఆలోచించుకో—నీకు మరొక్క గంట వ్యవధి ఇస్తున్నాను—ఆ తర్వాత నేను మనిషిని కాను...."

ముత్యాలరావు భయం భయంగా ఇన్‌స్పెక్టర్ వంక చూశాడు—"సార్! ఎలా మిమ్మల్ని నమ్మించాలో నాకు తెలియడంలేదు. నిజంగా నేను నిర్దోషిని. మీరు నన్ను ఉరికంబమెక్కిస్తే—అసలు హంతకుడు దర్జాగా సమాజంలో తిరుగుతూ మరి కొన్ని హత్యలు చేస్తాడు....ప్లీజ్ ఇన్‌స్పెక్టర్.... నేను హంతకుణ్ని కాను...."

"అలా అంటూండు. సరిగ్గా ఓ గంట తర్వాత అసలు నిజం నీ చేత చెప్పిస్తాను...." అన్నాడు ఇన్‌స్పెక్టర్ కసిగా.

"అతడు నిజమే చెబుతున్నాడు ఇన్‌స్పెక్టర్!" అన్న గొంతు వినిపించి ఇన్‌స్పెక్టర్, ముత్యాలరావు కూడా అటు తిరిగారు.

అక్కడ మోహన్ నిలబడి ఉన్నాడు.

"మీరెవరు?" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"వేదవతిని చంపినవాడిని...." అన్నాడు మోహన్—"మీరు నన్ను ప్రశ్నించాలని రెండ్రోజులుగా ప్రయత్నిస్తున్నారు. నేను దొరకలేదు. ఈ రోజు నేనే మీ దగ్గరకు వచ్చేశాను. అడక్కుండా నే అన్నీ చెప్పేస్తాను. నా వాఙ్మూలం తీసుకోండి...."

ఇన్‌స్పెక్టర్‌కంతా ఆశ్చర్యంగా వుంది. మోహన్ వాఙ్మూలం తీసుకునేందుకు అప్పటికప్పుడు ఏర్పాట్లు జరిగాయి.

"నేను వేదవతిని ప్రేమించాను. కానీ ఆమె ముత్యాలరావును ప్రేమించింది. పెళ్ళికి ముందే తన్ను తానర్పించుకునేందుకామె సిద్ధపడింది. దాపరికం లేకుండా ఉన్నదున్నట్లు ఎప్పటికప్పుడు నాకు చెప్పేది. నాలో కసి బయల్దేరింది. నాకు దక్కని వేదవతి ముత్యాలరావుకీ దక్కకూడదని ఓ పథకం వేశాను. ఓ రోజామెను చనిపోయినట్టు నటించమన్నాను. ఆ తర్వాత అది నటన అని ముత్యాలరావుకు తెలిసేలా చేయమన్నాను.

ఆ తర్వాత వాళ్ళిద్దరూ ఒకరిలో ఒకరు ఐక్యం కావాలని నిర్ణయించుకున్న రోజున ఆమెను చంపేశాను. అంతకు మునుపులాగే వేదవతి నటన అని నమ్మి ముత్యాలరావు అక్కడ రక్తం ముట్టుకున్నాడు. వేలిముద్రలు వదిలాడు. పోలీసులకు పట్టుబడ్డాడు. నా తెలివితేటలలో వేదవతినీ, ముత్యాలరావునూ పరలోకానికి పంపే ఏర్పాట్లు చేశాను. కానీ ఈ రెండ్రోజుల్లోనూ నాకో విషయం తెలిసింది...."

"ఏమిటిది?"

"వేదవతి లేని ఈ ప్రపంచం నాకు శూన్యంగా తోస్తున్నది. మరో లోకమంటూ వుంటే అక్కడ వేదవతి, ముత్యాలరావు కలుసుకుని ఒకటవుతారన్న అసూయభావం నన్ను దహించి వేస్తున్నది. నా నేరం ఒప్పేసుకుని నేనే సరాసరి వేదవతి వద్దకు వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నాను...."

ఇన్‌స్పెక్టర్ అతడిని చాలా ప్రశ్నలు వేశాడు.

అన్నింటికీ మోహన్ సమాధానాలు చెప్పాడు. తనే ఆ హత్య చేసినట్లు నమ్మడానికి అవసరమైన సాక్ష్యాధారాలన్నీ సూచించాడు. ఇన్‌స్పెక్టర్‌కి అతడే హంతకుడని నమ్మకం కుదిరింది.

# 10

ముత్యాల్రావుకి అంతా కలలా వున్నది. అతడు తనకు ఉరిశిక్ష ఖాయమనీ ప్రాణాలు పోయినవనే అనుకున్నాడు. కానీ చిత్రంగా మోహన్ తనకు తానే వచ్చి తన ప్రాణాలు రక్షించాడు.

విడుదలై ఇంటికి వచ్చిన కొడుకును కౌగలించుకొని భోరున ఏడ్చింది మాలతమ్మ.

ముత్యాల్రావు ఆదోకలాగున్నాడు. వేదవతి ప్రేమ ఎంత గొప్పది? ఆమెకోసం మోహన్ ప్రాణాలు వదలడానికి నిర్ణయించుకున్నాడు. అనవసరంగా ఆ అమర ప్రేమికుల మధ్య తను ప్రవేశించి-ఇద్దర్నీ ఈ లోకంలో లేకుండా చేశాడు.

వేదవతి తనను ప్రేమించకుండా ఉండాల్సింది....

ముత్యాల్రావు రాత్రి ఒక్కడూ తన గదిలో కూర్చున్నాడు. నిద్రవచ్చేలా లేదతడికి...

ఉన్నట్లుండి అతడి కనులముందు వేదవతి ఉన్నది.

అతడు ఉలిక్కిపడి—"ఎలా వచ్చావ్?" అన్నాడు.

"నా ప్రేమ బలాన్ని ఋజువు చేసుకుంటున్నాను. మోహన్‌ని నా వైపు ఆకర్షించుకుని తన నేరాన్ని ఒప్పుకునేలా చేసి—చనిపోయాక కూడా నీకు సాయపడ్డాను. ఇంతకంటే ఏ విధంగానూ నా ప్రేమ బలాన్ని ఋజువు చేసుకోలేను...." అంది వేదవతి.

"వేదవతీ....నువ్వు బ్రతికే వున్నావు. జరిగిందంతా

నాటకం. అవునా?" అని అరిచాడు ముత్యాలరావు.

అతడి ఎదురుగా వేదవతి నవ్వుతున్నది.

వెనుకనుంచి అతడి భుజంమీద ఎవరిదో చేయిపడింది. చటుక్కున వెనక్కు తిరిగాడు.

మాలతమ్మ...."నాకెవ్వరూ కనబడ్డం లేదు. ఎవరితో మాట్లాడుతున్నావురా?" అన్నదామె.

"ఇదీ గతంలోలాగే నాటకమైతే బాగుండును—" అనుకున్నాడు ముత్యాలరావు. కానీ అది నాటకం కాదు.

—: అయిపోయింది :—

# పెళ్ళికాని పిల్ల

టెంపోరావ్

రోడ్డు లైట్లు వెల్గుతున్నాయి. శ్రీనివాసు ఫియట్ కారాపి, జిగి వైన్ షాపులోకి దూరాడు. అనేక కస్టమర్స్‌తో వైన్ షాపు కిటకిటలాడ్తోంది.

కౌంటర్ కటువైపున్న రాజు నవ్వుతూ శ్రీనివాస్ వంక చూశాడు.

"ఇటువైపొచ్చి చాలా రోజులైంది, సార్" అన్నాడు రాజు.

"ఢిల్లీ వెళ్ళాను. ఫుల్ బాటిల్ నాగా రమ్" అన్నాడు శ్రీనివాస్.

అతడు టైమ్ చూశాడు. ఏడు దాటింది. సరిగ్గా ఎనిమిదింటికి సుబ్బారావు గదిలో డ్రింక్ పార్టీ! నలుగురు మిత్రులూ వారానికొకసారి సుబ్బారావు గదిలో కల్సుకొని హాట్ డ్రింక్స్ సేవించడం అలవాటై పోయింది.

సుబ్బారావు ఫుల్ బాటిల్ కొంటాడు. అది చాలక

పోతే ఉపయోగపడ్తుందని శ్రీనివాస్ మరో ఫుల్ బాటిల్ కొన్నాడు.

పాడుగాటి కవర్లో పెట్టి యిచ్చిన రమ్ బాటిల్ని తీసుకొని, డబ్బిచ్చి, అతడు వుషారుగా బయటకు నడిచాడు. పేవ్ మెంట్ మీద నుంచుని అతడు సిగరెట్ వెలిగించాడు.

సిగరెట్ పాగ పీల్చి వదుల్తూ రోడ్డమ్మట మాసుకు పోయే కార్లవైపు చూస్తూ ఉండిపోయాడు.

సుబ్బారావు గదిలో డ్రింక్ పార్టీ పెట్టడానికి చాలా కారణాలున్నాయి. అక్కడ ఎంతో వుషారుగా వుంటుంది.

సుబ్బారావు బ్రహ్మచారి. అతడి గది, యటాచ్‌డ్ బాత్ రూమ్ మేడమీదున్నాయి. పక్క ఫ్లాట్‌లో బిమల్ చటర్జీ అనే బెంగాలీ ఉంటున్నాడు. అతడు నెలకు యిరవై రోజులు పైగా టూర్‌లోనే ఉంటాడు. అతడికి నలుగురు కూతుళ్ళు. అందరూ చదువుకుంటున్నారు. కీళ్ళ నొప్పుల వలన తల్లి ఎక్కువగా కదలదు. అందువలన అన్ని పనులూ ఆ పిల్లలే చూస్తూ వుంటారు.

చదువుకుంటూన్న అమ్మాయిలు అవడంవలన నవ్వుతూ సుబ్బారావు గదిలోకి వచ్చి తాగుతున్న వాళ్ళతో మాట్లాడుతూ ఉంటారు. డ్రింక్స్ ప్రారంభించగానే నలుగురు మిత్రులూ వాళ్ళ రాకకోసం ఎదురు చూస్తూ ఉంటారు. గది తలుపును దగ్గరగా మూసి వుంచుతారు.

అతడి చూపు వాచ్ వైపు వెళ్ళింది. ఏడున్నర అయింది. తొందరగా వెళ్ళి లాభంలేదు. సుబ్బారావు ఈపాటికి స్నానంచేస్తూ ఉంటాడు. కాస్సేపు అలా బీచ్‌కి వెళ్ళి తర్వాత సుబ్బారావు గదికి వెళ్ళడం మంచి

దేమో!

ఆలోచిస్తూ శ్రీనివాస్ తన కారువైపు నడిచాడు. కారు పక్కనే నిలబడిన యువతిని చూసి తృళ్ళిపడ్డాడు. ఎవరామె? తన కారు పక్కనే నిలబడి ఏం చేస్తోంది?

అతడామె వంక చూశాడు. తెల్లటి చీర అదే రంగు జాకెట్. అందమైన మొహం. అతడిని చూసి ఆమె తియ్యగా నవ్వింది.

"ఎక్కడికేనా వెళ్ళాలా?" ప్రశ్నించాడతను.

మళ్ళా నవ్వి ఆమె తలాడించింది. మరోసారి ఆమెను పరీక్షగా చూసి, కారు ముందు తలుపు తెరిచి కూర్చోమన్నాడు. సంశయించకుండా ఆమె కూర్చుంది. అతడు తలుపు మూశాడు. కారు వెనకనుంచి వెళ్ళి డ్రయివర్ సీటులో కూర్చుని తలుపు మూశాడు. స్టార్టుచేసి, కారును బీచ్ వైపు మెల్లిగా పోనిచ్చాడు.

ఓరగా ఆమెవైపు చూశాడు. ఆమె వయసు ఇరవై రెండు దాటి ఉండదు. భుజానికి పచ్చటి సంచి వేళ్ళాడుతోంది.

"మీరు ఎక్కడికెళ్ళాలి?"

"ఎక్కడికైనా సరే!" అందామె క్లుప్తంగా.

ఆశ్చర్యంగా ఆమెవంక చూశాడతను.

"నేను బీచ్‌కి వెళ్తున్నాను."

"అక్కడికే పదండి."

కొంతసేపు అతను మాట్లాడలేదు. పక్కన కూర్చున్న యువతి విచిత్రంగా ప్రవర్తిస్తోంది. ఆమెది యీ పట్నం కాదేమో! తలిదండ్రులతో పోట్లాడి ఆమె మద్రాసు వచ్చిందేమో!

"మీదీ వూరు కాదా?" ప్రశ్నించాడతను.

ఆమె విచారవదనంతో అతడి వైపు చూసింది.

"కాదు."

"ఎక్కడుంటున్నారు?"

"తెలియదింకా!"

"ఎందుకిలా వచ్చారు?"

"ప్లీస్, నన్ను పోలీసులకు అప్పగించనని హామీ యివ్వండి!" అందామె.

"భయపడకండి. అటువంటిదేమీ జరగదు. మీకోసం పోలీసులు వెతుకుతున్నారా?"

"నాకు తలిదండ్రులు లేరు. బాబాయి యింట్లో పెరిగాను. డబ్బు కాశించి నన్ను ఒక ధనవంతుడి కొడుక్కిచ్చి పెళ్ళిచేయాలని బాబాయి ఆశ. ఆ సంబంధం నాకిష్టంలేదు. అక్కడుంటే బలాత్కారంగా పెళ్ళి సాగిపోతుంది. ఆ పరిస్థితులో తెగించి యిలా వచ్చేశాను" అందామె.

"మంచి పని చేశారు! ధైర్యంగా యిలా వచ్చేసినందుకు మిమ్మల్ని మెచ్చుకుంటున్నాను. మీకు అన్ని విధాలా నేను సహాయపడతాను" అన్నాడతను వుషారుగా.

"చాలా థాంక్స్" అందామె.

బీచ్ రోడ్డమ్మట కారు వెళ్తోంది. చల్లటి గాలి వీస్తోంది. దూరంలో సముద్రపు హోరు వినబడుతోంది.

"మీరు ఏమన్నా తిన్నారా?"

"ఫరవాలేదు లెండి" అందామె నిర్లిప్తంగా.

అతడు మౌనంగా కారును పోనిచ్చాడు. మెరినా హోటల్ కాంపౌండులో అతడు కారాపి, దిగి ఆమె వైపున్న తలుపు తెర్చాడు.

"రండి, టిఫిన్ తిందురుగాని!"

"మీకు శ్రమ కల్గిస్తున్నాను" అంటూ ఆమె కిందకు దిగింది.

మెట్లెక్కి యిద్దరూ పైకి వెళ్లారు. కుర్చీల్లో కూర్చున్నారు. బేరర్ రాగానే ఆమెను ఏం కావాలని అడిగాడతను.

"మీ యిష్టం!" అందామె.

శ్రీనివాస్ ఆర్డరిచ్చాడు. బేరర్ వెళ్లాక నవ్వుతూ ఆమెవైపు చూశాడు.

"నా పేరు శ్రీనివాస్. మీ పేరు?"

"నాగమణి."

అతడు టైమ్ చూశాడు. ఎనిమిది దాటింది. తన మిత్రులు తనకోసం ఎదురుచూసి, యీపాటికి మొదటి రౌండులో వుంటారు. టైముకు రానందుకు తన్ను తిట్టుకుంటూ వుంటారు.

నాగమణిని యిలా వదిలేసి పార్టీకి వెళ్ళిపోవడం అతడి కిష్టంలేదు. నిజం చెప్పాలంటే చటర్జీ కూతుళ్ళ కంటె నాగమణి చాలా అందమైంది.

చటర్జీ కూతుళ్ళు యిలా వచ్చి అలా వెళ్ళిపోతూ ఉంటారు. నాగమణి తనముందే ఉంది! తను వదలనంత కాలం తనముందే ఉంటుంది!

అనేక ప్లేట్లు తెచ్చి బేరర్ టేబుల్ మీద పెట్టాడు. గ్లాసులో ఐస్ వాటర్ యిచ్చాడు.

"మీ హృదయంలా మీ చెయ్యి పెద్దది. ఇన్ని తినగలనా?" అందామె.

"మీరు యెప్పుడు తిన్నారో? తినండి, ఫరవాలేదు. ఎక్కువైతే రాత్రి భోజనం మానేయొచ్చు!" అన్నా

డతను.

ఆకలితో ఆమె తినసాగింది. ఐసు నీళ్ళున్న గ్లాసు వైపు చూసిన అతడి మెదడులో ఏదో మెదిలింది. అతడు నలువైపులా చూశాడు. వాళ్ళ టేబుల్ మూలగా ఉంది. కొంచెం దూరంలో ఉన్న టేబుల్ దగ్గర నల్గురు కూర్చుని ఏవో జోక్స్ చెప్పుకుని నవ్వుతున్నారు.

అతడు రహస్యంగా తను కొన్న ఫుల్ బాటిల్ రమ్ సీలు మూత తిప్పాడు. గ్లాసులోని ఐస్‌వాటర్ని సగంవరకూ ఆమె గ్లాసులో పోసాడు.

ఐస్‌వాటర్ పైదాకా రమ్ పోశాడు. నీళ్ళ రంగు మారింది. ఆమెవైపు చూశాడు.

"నేను రమ్ తాగితే మీకు అబ్జెక్షన్ లేదుగా?" అడిగాడు.

ఆమె కిలకిలా నవ్వింది."

"రమ్మేగా, తాగండి" అందామె.

గ్లాసులోని రమ్‌ని అతడు ఒక్క గుక్కలో తాగేశాడు. సిగరెట్ వెలిగించాడు. మళ్ళా గ్లాసులో రమ్ పోసి ఆమె గ్లాసులోని నీళ్ళు కలిపాడు.

బేరర్ వచ్చాడు. నాలుగు గ్లాసులు ఐస్‌వాటర్ తెమ్మన్నాడు. సిగరెట్ పొగ వదుల్తూ దూరంలో ఉన్న సముద్రంవైపు చూశాడు. ఆకాశంలో చంద్రుడు ప్రకాశిస్తున్నాడు.

ఐస్‌వాటర్ గ్లాసులను టేబుల్‌మీద పెట్టి నేల మీదున్న రమ్ బాటిల్ వైపు బేరర్ చూశాడు.

"ఏంటి సార్, యిక్కడ రమ్ తాగకూడదు!" అన్నాడు బేరర్.

శ్రీనివాస్ అతడికి రెండు రూపాయిల నోటు

యిచ్చాడు.

"ఇంకా ఐస్ వాటర్ కావలిస్తే చెప్పండి. మీకు డబుల్ 7 కావల్సినా తెస్తాను" అన్నాడు బేరర్ ఉత్సాహంగా.

"ఏదేనా కావలిస్తే చెప్తాను. ప్రస్తుతం ఏమీ వద్దు" అన్నాడు శ్రీనివాస్.

బేరర్ వెళ్ళిపోయాడు. ఆమె కాఫీ తాగుతోంది. మూడు రౌండ్లు పూర్తిచేసి నాలుగో రౌండ్‌లో ఉన్నాడు శ్రీనివాస్. రమ్ తాగాక అతడికి చాలా ఉషారుగా ఉంది. కాఫీ తాగడం పూర్తిచేసి ఆమె అతడివంక చూసింది.

"మీతో కూర్చుంటే మోహన్‌తో ఉన్నట్లు ఉంది. ఐయామ్ హేపీ!" అందామె.

"మోహన్ ఎవరు?" ప్రశ్నించాడతను.

ఆమె వెంటనే జవాబివ్వలేదు. దూరంలో వున్న సముద్రంవైపు చూసింది.

"మోహన్ అంటే నాకెంతో ప్రేమ. అతడికి నేనంటే ప్రాణం. కాని విధి మా ప్రేమకు అడ్డొచ్చింది. బొంబాయినుంచి మద్రాస్ వస్తూ మోహన్ ప్లేన్ యాక్సిడెంట్‌లో మరణించాడు. ఆ మోహన్ నా జీవితం లోంచి శాశ్వతంగా వెళ్ళిపోయాడనుకున్నాను. కాని అదే మోహన్ మీలో సజీవంగా కనిపిస్తున్నాడు!" అందామె ఉద్రేకంతో.

అతడు ఆమె చెయ్యి పట్టుకుని మెల్లిగా నిమిరాడు.

"నా కోసమే మీరు మద్రాసు వచ్చారేమో!" అన్నాడతను.

"విధి మనల్ని విచిత్రంగా కలిపింది" అందామె.

బేరర్ తెచ్చిన బిల్ చెల్లించాడు. కొంత డబ్బు టిప్ గా ప్లేట్ లో పడేశాడు.

బేరర్ సంతోషంగా వెళ్ళిపోయాడు.

ఆమె కాలు అతడి కాలుకు తగిలింది. అతడు అలాగే ఉంచాడు. టేబుల్ కిందున్న కాలును ఆమె వెనక్కి తీసుకోలేదు.

అతడు టైమ్ చూశాడు. పది కావస్తోంది. ఈపాటికి సుబ్బారావు గదిలో వాళ్ళు తూల్తూ వుంటారు. నాగమణి గురించి తను చెప్పాక వాళ్ళు తనని మెచ్చుకుంటారు.

"లక్కీ ఫెలో!" అంటారు వాళ్ళు.

ఆలోచిస్తూ శ్రీనివాస్ మరో సిగరెట్ వెలిగించాడు. ఇంట్లో తనకోసం వేచివుండే భార్య అతడికి గుర్తొచ్చింది. అతడి పెళ్ళయి ఏడేళ్ళయింది. ఇద్దరు పిల్లలు కూడా ఉన్నారు. భార్యకు ట్యూబెక్టమీ చేయించేశాడతను.

భార్య అంటే అతడికంత యిష్టంలేదు. మేనత్త కూతురు. మేనరికం. ఆమె పొట్టిగా సిలిండర్ లా వుంటుంది. ఎప్పుడూ మూల్గుతూ వుంటుంది. కడుపు నొప్పో, తల నొప్పో ఆమె నెప్పుడూ పీడుస్తూనే ఉంటుంది.

ఇంట్లో వుంటే నరకంలో ఉన్నట్లు వుంటుంది. తనకు తండ్రి యిచ్చిన ఆస్తి వుంది. మంచి ఉద్యోగం వుంది. కాని తనకు సరైన భార్య దొరకలేదు!

నాగమణిని చూస్తూంటే అతడికెంతో ఆనందంగా ఉంది. భార్య తనకివ్వలేని ఆనందాన్ని తనకివ్వడం కోసం నాగమణిని విధి పంపిందేమో!

"పోదాం, పదండి" అన్నాడతను.

ఇద్దరూ కిందకు నడిచారు. కారులో కూర్చున్నారు.

"ఇదుగో మీ రమ్ బాటిల్! అక్కడ మర్చిపోయారు" అందామె.

అతడామె చెయ్యి పట్టుకున్నాడు. ప్రేమతో ఆమె చెయ్యి నిమిరాడు.

"మిమ్మల్ని చూశాక ఎన్నో మర్చిపోయాను" అన్నాడతను.

క్షణకాలం యిద్దరూ మౌనంగా ఉండిపోయారు.

"ఎలియట్స్ బీచ్‌కి వెళ్దామా?" అడిగాడతను.

"పదండి" అందామె.

ఆమె అతడి చెయ్యిని నిమిరింది.

"మీతో ఎక్కడికైనా వస్తాను. మీరే నా మోహన్! మీకేం కావలసినా యిస్తాను" అందామె.

"యూ ఆర్ గ్రేట్!" అన్నాడతను.

"అక్కడ చంద్రకాంతిలో మీకు రమ్ తాగాలని అనిపించవచ్చు. కూల్ డ్రింక్స్ ఒక గ్లాసు కారులో పెట్టుకోండి" అందామె.

"గ్లాసులు కార్లోనే ఉన్నాయి. కూల్ డ్రింక్స్ తెస్తాను" అని అతడు హోటల్ వైపు వెళ్ళాడు.

ఆమె తీక్షణంగా అతడివైపే చూస్తోంది. అతడు తూలుతూ నడుస్తున్నాడు. కారు నడపగలడో లేడో!

కాస్సేపట్లో అతడు తిరిగొచ్చాడు. నాలుగు బాటిల్స్‌ను కార్లో పెట్టి, కూర్చుని, తలుపు మూశాడు. అతడు కారును వేగంగా పోనిచ్చాడు.

ఎలియట్స్ బీచ్! కారులోంచి యిద్దరూ దిగారు. కూల్ డ్రింక్ బాటిల్స్‌ను తీసుకుని అతను సముద్రంవైపు నడిచాడు. వెనకనే ఆమె వెళ్ళింది.

ఇసుకలో యిద్దరూ కూర్చున్నారు. చంద్రుడు పైన

ప్రకాశిస్తున్నాడు. సముద్రపు ఘోష వినిపిస్తోంది.

అతను ఆమెను కౌగలించుకొని పెదిమలమీద ముద్దెట్టుకున్నాడు. ఆమె చేతులు అతడిని చుట్టేశాయి. శ్రీనివాస్ ఆనందంగా ఆమె కళ్ళల్లోకి చూశాడు.

"నాగమణీ, ఐ లవ్ యూ!" అన్నాడతను.

"ఐ లవ్ యూ" అందామె.

చంద్రకాంతిలో ఆమెను చూస్తూ వుండిపోయాడతను.

ఆమె ధరించిన జాకెట్ విడిపోయింది. చంద్రకాంతిలో మెరుస్తూన్న ఆమె స్తనాలవైపు చూశాడతను. తృళ్ళి ఆమె మీద పడ్డాడు.

"రమ్ తాగండి!" అందామె.

గ్లాసులో కూల్ డ్రింక్ పోసి, రమ్ కలిపి అతడికిచ్చిందామె. అతడు గడగడ తాగేశాడు.

"నాగమణీ, నువ్వంటే నాకెంతో ప్రేమ! ఈ జీవితంలో నిన్ను విడువను" అన్నాడతను.

ఆమెవైపు చూస్తున్నాడతను. ఆమె కళ్ళు ఎర్రబడ్డాయి. ఆమె చేతులు వణుకుతున్నాయి. ఆమె మొహంలో నవ్వు లేదు! ఆమెవైపు చూస్తూంటే ఏదో భయం అతడిని ఆవహించింది.

బాగ్‌లోకి ఆమె చెయ్యి వెళ్ళింది. మరుక్షణంలో పదునైన కత్తి పైకి లేచింది.

"నాగమణీ, ఏమిటది?" అన్నాడతను.

అతడి ప్రశ్నను ఆమె వినుపించుకోలేదు. కత్తి కొన అతడి కడుపులోకి దిగింది. కత్తిని ఆమె యిటూ, అటూ కదిపింది. అతడి పేగులు బయటకొచ్చాయి!

ఆమె ఒంటినిండా చెమట! నిమిషాలు గడుస్తున్నాయి. అతడి జేబుల్ని ఆమె వెతికింది. పర్సును తన బాగ్‌లో

పడేసుకుంది. కత్తిని గుడ్డలకు తుడిచి బాగ్‌లో వేసుకుంది. నలువైపులా చూసింది. ఎక్కడా ఎవ్వరూ లేరు. సముద్రపు హోరు వినిపిస్తోంది. చంద్రుడు ప్రకాశిస్తున్నాడు.

ఆమె లేచి నిలబడింది. అతడి వంక హేళనగా చూసింది. ఇసుకలో నడిచి పట్నంవైపు వెళ్ళిపోయింది.

## 2

పైజామా, లక్నో జుబ్బాలో వున్నాడు సుబ్బారావు. ఎదురుగా ఉన్న మిత్రులవైపు చూశాడు.

రామన్, గోవింద్!

"శ్రీనివాస్ రాకపోవడం విచిత్రంగా ఉంది! మన పార్టీకి అతను యెప్పుడూ మిస్ కాడు!" అన్నాడు సుబ్బారావు.

"భార్య వెళ్ళొద్దందేమో!" అన్నాడు రామన్.

"నాన్ సెన్స్, అతడు భార్య మాటను లెక్క చేయడు" అన్నాడు సుబ్బారావు.

తలుపు తెర్చిన చప్పుడైంది. చటర్జీ పెద్ద కూతురు లలిత లోపలకొచ్చింది.

"హలో సుబ్బారావు!" అందామె.

"హలో!" అన్నారందరూ.

రామన్, గోవింద్‌లకు పెళ్ళయిందని ఆమెకు తెలుసు. సుబ్బారావు మీదే ఆమె దృష్టి!

సుబ్బారావు కుర్చీ పక్కనే ఆమె నిలబడింది. అతడివైపు ఆమె నవ్వుతూ చూసింది.

"ఇవాళ ముగ్గురే ఉన్నారు. శ్రీనివాస్ యెందుకు రాలేదు?" అడిగిందామె.

"శ్రీనివాస్ తిరుపతి వెళ్ళుంటాడు" అన్నాడు

సుబ్బారావు.

"రాస్కెల్, మన్ని డిసెపోయింటే చేశాడు" అన్నాడు రామన్.

"ఏదో కష్టంలో యిరుక్కొని ఉంటాడు" అన్నాడు గోవింద్.

తలుపు తోసుకొని విమల లోపలకొచ్చింది. చటర్జీ రెండో కూతురామె.

"హలో, డ్రింకర్స్, ఎలా ఉన్నారు?" అందామె.

"హేపీగా ఉన్నాం" అన్నాడు సుబ్బారావు.

ఆమె సుబ్బారావు దగ్గరకు వెళ్ళింది. అతడు మంచి ఉద్యోగంలో ఉన్నాడు. కాని ఎందువలనో యింకా పెళ్ళి చేసుకోలేదు.

సుబ్బారావు ముందున్న గ్లాసును విమల అందుకుంది.

"మీరు ఎందుకు తాగుతారు? తాగితే ఏమి వస్తుంది?" అందామె.

"కిక్!" అన్నాడు సుబ్బారావు.

ఆమె సుబ్బారావువైపు వంగింది.

"మై డియర్ సుబ్బారావు, తాగడం మానేయండి! కిక్ కోసం తాగనవసరంలేదు. తాగకుండా మీరు కోరే కిక్ మీకు రాగలదు!" అందామె.

"ఎలా?" అర్చాడు గోవింద్.

"ఇంట్లో మీ పెళ్లాం వుందిగా! ఈ డ్రింక్ కంటె పెద్ద కిక్కు ఆమె మీకు యివ్వగలదు" అందామె.

అందరూ ఫక్కున నవ్వారు. గదిలోకి రాగిణి, రజని జొరబడ్డారు. గదిలో నలుగురు అమ్మాయిలు ఉన్నారు. తాగిన వాళ్ళు ముగ్గురు!

"మా సుబ్బారావుకి పెళ్లాం లేదే!" అన్నాడు

గోవింద్.

"చేసుకుంటే పెళ్ళవుతుంది. ఇలా తాగుతూ కూర్చుంటే ఎలా పెళ్ళి కుదుర్తుంది?" అంది విమల.

సుబ్బారావు నవ్వుతూ ఆమె వంక చూశాడు.

"ఎప్పుడు పెళ్ళి చేసుకోవాలో నాకు తెలుసు! నేను పెళ్ళి చేసుకోకపోతే మన దేశం జనాభా తగ్గిపోదు" అన్నాడు సుబ్బారావు.

"గోల్డెన్ వర్డ్స్!" అన్నాడు రామన్.

తల్లి పిలుపు విని అందరూ పరుగెత్తారు వాళ్ళ ఫ్లాట్ లోకి.

టైమ్ పది దాటింది. రామన్ కుర్చీలో వెనక్కి వాలి పడుకున్నాడు. గోవింద్ తివాసీమీద పడున్నాడు. సుబ్బారావు సిగరెట్ పీలుస్తూ ఆలోచిస్తున్నాడు. శ్రీనివాస్ ఎందుకు రాలేదు? యెక్కడకు వెళ్ళుంటాడు?

మెల్లిగా చటర్జీ పెద్ద కూతురు లలిత గదిలోకొచ్చింది. సుబ్బారావు వైపు నవ్వుతూ చూసింది.

"ఇంకా సాగుతోందా మీ సెషన్!" అడిగింది.

సుబ్బారావు నవ్వాడు.

"వాళ్ళిద్దరూ స్లీపింగ్ సెషన్‌లో వున్నారు! ఇద్దర్కీ ఆశ ఎక్కువ కాని తాగి కూలిపోతారు!"

"శ్రీనివాస్ భార్య ఫోన్ చేసింది. అతడు యిక్కడ లేడని చెప్పాను" అందామె.

ఆమె గుమ్మంవైపు వెళ్ళింది.

"లలితా!" పిల్చాడతను.

వెనక్కి తిరిగి ఆమె చూసింది. నవ్వుతూ అతడి కుర్చీ పక్కకు వెళ్ళింది. అతడామె చెయ్యి పట్టుకున్నాడు. ఆమె కళ్ళలోకి చూశాడు.

చటర్జీ కూతుళ్ళలో పెద్దదైన లలిత అందంగా ఉంటుంది. ఎమ్మే చదువుతోంది.

"లలితా, ఐ లవ్ యు! మనం పెళ్ళి చేసుకుందాం! ఏమంటావు?"

పరిహాసంగా అతడివంక ఆమె చూసింది.

"నిషా పోయాక ఆ విషయం మాట్లాడుదాం" అందామె.

"లలితా, వాళ్ళతో నన్ను పోల్చకు! నేను ఎంత తాగినా మామూలుగా ఉండగలను. నాకు ఎక్కువగా నిషా రాదు. నేను ఏం చేస్తున్నానో నాకు తెలుసు!"

"పదిన్నర దాటింది. భోజనం చేయకూడదూ?" అంది లలిత.

"కేరీయర్ వచ్చిందిగా, తింటాను."

"నేను పెడ్తాను, తినండి" అందామె.

"థాంక్స్" అన్నాడతను.

టేబుల్ను ఖాళీ చేసిందామె. ప్లేటులో అన్నంపెట్టి, కూర, పచ్చడి వగైరా వడ్డించింది. ఆమెవైపు ప్రేమతో చూస్తూ అతడు తినసాగాడు.

"మీవాళ్ళు ఏం చేస్తున్నారు?"

"నిద్ర మాత్ర మింగి అమ్మ పడుకుంది. తతిమ్మా వాళ్ళు కూడా పడుకున్నారు" అందామె.

"మన పెళ్ళి గురించి ఏమంటావు?"

"అదంతా పెద్దలు నిశ్చయించాలి. మనం కాదు!" అందామె నవ్వుతూ.

అతడు భోజనం పూర్తిచేసి చెయ్యి కడుక్కున్నాడు. ప్లేటుతీసి ఆమె బాత్‌రూంలో పెట్టింది. నవ్వుతూ అతడివైపు చూసింది.

"ఇవా వెళ్ళనా?"

"అప్పుడే?"

దగ్గరగా వచ్చి అతడి జుత్తును వేళ్ళతో నిమిరింది.

"పదకొండు దాటింది. ఈ పాటికి పట్నంలో మర్యాదగా బతికే వాళ్ళందరూ నిద్రపోతూ ఉంటారు!" అందామె.

"లలితా, నిన్ను చూస్తుంటే రాత్రి జాగారం చేయాలనిపిస్తోంది."

"చేద్దురుగాని, పెళ్ళయ్యాక" అని ఆమె వెనక్కు జరిగింది.

అతడు అమాంతంగా లేచాడు. తూలుతూ ఆమె మీద పడ్డాడు. అతడి చేతులు ఆమెను చుట్టేశాయి. ఆత్రంగా ఆమె కళ్ళలోకి చూస్తూ ఉండిపోయాడతను.

"నన్ను వదిలి వెళ్ళిపోకు! నేను పడుకుంటాను. నాకు నిద్రపట్టాక వెళ్ళు" అన్నాడతను.

అతడిని తీసుకెళ్ళి పరుపుమీద పడుకోబెట్టిందామె. మంచం పక్కనే నిలబడింది.

"పడుకోండి!"

"ష్యూర్!"

"ఇక్కడే ఉంటాను. పడుకోండి" అందామె.

మరుక్షణంలో అతడు కళ్ళు మూశాడు. ఆమె మెల్లిగా తన ఫ్లాట్‌కు వెళ్ళిపోయింది.

# 3

నిద్రలోంచి లేచి టెలిఫోన్ రిసీవర్ని అందుకున్నాను. బెడ్‌రూమ్‌లో వున్న జీరోవాట్ బల్బు డిమ్‌గా వెల్గుతోంది.

పక్కన పడుకున్న పార్వతిని ఓసారి చూసి "హలో,

పరశురామ్!" అన్నాను.

"బ్రదర్ నేను" అందో బొంగురు కంఠం అటువైపు నుంచి.

ఇన్‌స్పెక్టర్ నాయర్!

"నాయర్ భాయ్, ఏమైంది?"

"నేను ఎలియట్స్ బీచ్‌లో ఉన్నాను. ఒక యువకుడు యిక్కడ ఘోరంగా హత్యచేయబడ్డాడు. హారిబుల్ మర్డర్!"

"రానా?"

"వెంటనే రా బ్రదర్."

వస్తున్నానని చెప్పి రిసీవర్ పెట్టేశాను. పార్వతి హాయిగా నిద్రపోతోంది. గదిలో పిడుగుపడ్డా ఆమె మేలుకోదు!

పరుపు మీదనుంచి కిందకు దిగి టైమ్ చూశాను. ఒంటి గంట కావస్తోంది. వేగంగా ఉలెన్ సూటు ధరించాను. ఇండియా కింగ్స్ సిగరెట్ వెలిగించి బయటకు నడిచాను.

మెట్లు దిగుతూన్న నా బూట్ల చప్పుడు విని వంటతను క్రిష్ణయ్య లేచాడు. తలుపులు వేసుకోమని అతడితో చెప్పి కారు షెడ్ వైపు నడిచాను.

కునికిపాట్లు పడ్తూ అతడు తలుపును మూసుకున్నాడు. గేటుముందు గూర్ఖా తలుపు తెర్చాడు. కారును తటాలున రోడ్డుమీదకు పోనిచ్చాను.

కారు దూసుకుపోతోంది. చల్లగాలి వీస్తోంది. పది నిమిషాల్లో ఎలియట్స్ బీచ్ చేరుకున్నాను. పోలీసు జీప్ వెనకనే కారాపి, దిగాను. కొంచెం దూరంలో ఒక ఫియట్ కారుంది. ఎవరిదో?

ఇన్‌స్పెక్టర్ నాయర్ నా వైపు గబగబా వచ్చాడు.

ఇద్దరం యిసుకలో నడిచి వెళ్ళాం. దూరంలో పెట్రో మాక్స్ లైట్ కాంతిలో పోలీసు కానిస్టేబుల్సు రూపాలు కనబడుతున్నాయి.

"బ్రదర్, అతడి పేరు శ్రీనివాస్. కారు సిపి బుక్కులో పేరూ, అడ్రెసూ ఉన్నాయి. ఆ అడ్రెస్‌కు మా కానిస్టేబుల్ వెళ్ళాడు. కాస్సేపట్లో ఎవరేనా రావచ్చు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

సిగరెట్ పీలుస్తూ అతడు చెప్పింది వింటూ నడుస్తున్నాను.

హాత్యా స్థలానికి చేరుకున్నాం. యువకుడు సూటులో ఉన్నాడు. వెల్లకిలా యిసుకలో పడున్నాడు. చొక్కా నిండా రక్తం మరకలు. తెగిన చొక్కాలోంచి పేగులు బయటకు వేళ్ళాడుతున్నాయి. ఇసుకలో థమ్సు అప్ బాటిల్సు నాలుగున్నాయి. ఒక గ్లాసులో కొద్దిగా రమ్ ఉంది. పక్కనే నాగా రమ్ ఫుల్ బాటిల్.

బాటిల్లో సగం వరకు ఉంది రమ్. అంటే అరబాటిల్ పైన అతడు తాగేసి ఉండాలి. చొక్కాను పైకి లాగి చూశాను. అతడి కడుపులోకి దిగిన కత్తి యిటూ అటూ తిరిగుండాలి! చొక్కా లోపల శరీరంమీద రక్తం గడ్డ కట్టింది.

"ఎవరో ఘోరంగా చంపారు" అని కొంచెం దూరంగా జరిగాను.

"నాయర్ భాయ్, ఇంత రాత్రివేళ ఈ హాత్య గురించి నీకెవరు రిపోర్టిచ్చారు?" అడిగాను.

"ఆ కుర్రాడు" అని దూరంలో ఉన్న ఒక కుర్రాడి వైపు చెయ్యి చూపించాడు.

అతడి దగ్గరగా వెళ్ళాను. అతడి వయస్సు పది

పోం నేళ్ళు వుండొచ్చు. బ్లూ నిక్కర్, చిరిగిన షర్టులో ఉన్నాడు.

"నువ్వు యిక్కడ ఏం చేస్తున్నావు?" ప్రశ్నించాను.

"కార్లూ, స్కూటర్లూ అక్కడ ఆపి వాళ్ళు యిలా బీచ్ లోపలకు పోతారు, సార్. వాళ్ళు వచ్చినదాకా నేను అక్కడ కాపలా ఉంటాను. వెళ్ళేటప్పుడు నాకింతో కొంత వాళ్ళు ఇస్తారు. ఆ రాబడితో నేనూ, అమ్మా బతుకుతున్నాం" అన్నాడతను.

"నువ్వు యిక్కడికెలా వచ్చావు?"

"అన్ని స్కూటర్లూ వెళ్ళిపోయాయి. మూడు కార్లు కూడా పోయాయి. అక్కడ ఒకే కారుంది. ఆ కారు వాళ్ళు ఎంతకీ రాలేదు. నేను ఇంటికి పోవాలి. వెతుకుతూ యిక్కడికొచ్చి చూశాను. చంద్రకాంతిలో ఆయన్ని చూశాను. ఎంత పిల్చినా ఆయన లేవలేదు. ఏదో జరిగిందని భయపడ్తూ వెళ్ళి పోలీసు రిపోర్టు యిచ్చాను."

"ఈ కారులో ఎంతమంది వచ్చారు?"

"ఈయనా, ఒక స్త్రీ వచ్చారు సార్."

"ఆమె వెళ్ళడం నువ్వు చూశావా?"

"లేదు సార్. అనేకమంది నడిచి వచ్చి నడిచి వెళ్ళి పోతారు. కారు దగ్గరకో, స్కూటర్ దగ్గరకో వస్తే గాని వాళ్ళను నేను అంతగా చూడను."

"ఈ కారులో వచ్చినామెను నువ్వు బాగా చూశావా?"

"లేదు, సార్. కారును నడుపుతూ ఈయన వచ్చారు. ఈయన్ని చూసాను. కార్లోంచి ఒకామె దిగింది. ఆమె మొహం నాకు అంతగా గుర్తు లేదు" అన్నాడతను.

"నాయర్ ఖాయ్, యితడి అడ్రెసు తీసుకో!" అని

సముద్రంవైపు చూశాను.

కెరటాలు హోరుమంటూ ముందుకొచ్చి, నురగలు కక్కుతూ పగిలి వెనక్కు పోతున్నాయి. బసంత్ నగర్ యిళ్ళు చంద్రకాంతిలో అఖండంగా అగుపిస్తున్నాయి.

దూరంలో ఏదో కారొచ్చి ఆగింది. కారు వెనకనే మోటర్ బైక్.

"ఎవరో వచ్చుంటారు" అని ఇన్‌స్పెక్టర్ నాయర్ అటువైపు నడిచాడు.

ఆలోచిస్తూ సముద్రపు ఒడ్డుకు వెళ్ళాను. పెద్ద కెరటం ముందుకొస్తోంది. గబగబా వెనక్కు జరిగాను.

గంభీరమైన శబ్దంచేస్తూ కెరటం దూసుకొచ్చింది. అదే సమయంలో యెవరో వెనకనుంచి ఏడ్వసాగారు.

వెనక్కు తిరిగి యిసుకలో వేగంగా నడిచాను.

ఒక స్త్రీ అతడి శవంమీద పడి పిచ్చిదానిలా ఏడుస్తోంది.

"శ్రీనివాస్ భార్య. ఆమె పేరు రాధ" అన్నాడు ఇన్‌స్పెక్టర్ తగ్గుస్వరంలో.

మౌనంగా నిలబడ్డాను. ఆమె వయస్సు యిరవై ఉంటుందేమో! ఊహాతీతమైన పరిస్థితుల్లో భర్త బీచ్‌లో చంపబడ్డాడు. ఆమె దుఃఖము వర్ణించలేనిది.

ఆమె దగ్గరకెళ్ళాను.

"రాధగారూ, లేచి యిలా రండి!" అన్నాను.

ఆమె వెను దిరిగి నా వైపు చూసింది.

"నా భర్తనింత క్రూరంగా ఎవరు చంపారు? ఆయన చేసిన పాపం ఏమిటి?" అర్చిందామె.

"అదంతా కనుక్కోవాలనే నేను తాపత్రయ పడుతున్నాను. మీరు మాతో సహకరించాలి" అన్నాడు.

ఆమె లేచి నిలబడింది. ఇసుకలో కొంచెం దూరం ఆమెను తీసుకెళ్లాను. నిలబడలేక ఆమె కూర్చుండి పోయింది. ఎదురుగా కూర్చున్నాను.

"మీ భర్త బాగా తాగుతారా?"

"ప్రతి రోజూ తాగరు. వారానికోసారి శనివారం రాత్రి తాగుతారు."

"ఇవాళ శనివారం!" అన్నాను.

"ప్రతి శనివారం సుబ్బారావు గదిలో మిత్రులతో ఆయన తాగుతారు. ఎంతకీ యింటికి రాకపోతే సుబ్బారావుకి ఫోన్ చేశాను. ఆయన అక్కడకు రాలేదని జవాబొచ్చింది."

"ఆ మిత్రులందరూ యివాళ ఈ బీచ్‌లో తాగేరేమో?" ప్రశ్నించాను.

"వాళ్లు సుబ్బారావు గదిలోనే ఉన్నారు. లలిత చెప్పింది. ముగ్గురూ డోసులో ఉన్నారంది. ఎందుకలనో నా భర్త రాలేదంది"

"లలిత ఎవరు?"

"సుబ్బారావు పక్క ఫ్లాట్‌లో వుంటోందామె. అక్కడే ఫోనుంది. సుబ్బారావు, రామన్, గోవింద్ గదిలో వున్నారని లలిత చెప్పింది."

"లలిత మీ భర్తకు తెలుసా?"

"ఆమె బెంగాలీ యువతి. చదువుకుంటోంది. ఆమెకు ముగ్గురు చెల్లెళ్ళు కూడా వున్నారు. ఇదంతా నా భర్త నాతో చెప్పారు."

నలుగురు అక్కచెల్లెళ్ళు! వాళ్ళతో శ్రీనివాస్‌కి పరిచయం వుంది. వాళ్ళల్లో ఎవరితోనైనా శ్రీనివాస్

యీ బీచ్‌కి ఒంటిరిగా వచ్చాడా?

క్షణకాలం మౌనంగా వుండిపోయాను.

"మీ భర్త ఏం చేస్తున్నారు?"

"తండ్రి వదిలిన ఆస్తి చాలా వుంది. బాంకిలో వుద్యోగం చేస్తున్నారు. ఆయన మిత్రులు కూడా అదే బాంకిలో వుద్యోగాలు చేస్తున్నారు."

"మీ దాంపత్య జీవితం సుఖంగా సాగుతోందా?"

"పెళ్ళయి పదేళ్ళు కావస్తోంది. ఇద్దరు పిల్లలు. జీవితం సాగిపోతోంది, సుఖంగా అనలేను లెండి."

"మీ భర్త ఎటువంటి వారు?"

"మంచివారే! కాని ఆడపిల్లలంటే ఆయనకు బాగా పిచ్చి."

"ఇవాళ రాత్రి మీ భర్తతో ఒక యువతి ఇక్కడకు వచ్చిందని తెలిసింది. ఆమె ఎవరో మీరు చెప్పగలరా?"

"నాకు తెలియదు."

"ఆయన ఏ యువతితోనైనా సంబంధం పెట్టుకున్నారా?"

"నాతో చెప్పలేదు."

"మీ భర్త జేబులో ఎంత డబ్బు వుండాలి?"

"సాధారణంగా ఆయన పర్సులో వెయ్యి పైన వుంటుంది. వంద రూపాయిల నోట్లు పది ఆయన ఎప్పుడూ వుంచుకుంటారు. ఆపైనున్న నోట్లనే ఖర్చుపెడ్తారు."

"మీ భర్త జేబులో పర్సు లేదు. ఎవరో దాన్ని కొట్టేశారు" అన్నాను.

ఆమె భయంతో నా వైపు చూసింది.

"డబ్బుకోసం ఈ హత్య జరిగిందేమో!" అందామె.

"పర్సు లేదు కాని వాచ్, మెళ్ళో బంగారం గొలుసు

వున్నాయి. పర్సు తీసుకుపోయిన వ్యక్తి వాటిని ఎందుకు వదిలేయవలసి వచ్చిందో ఆశ్చర్యంగా వుంది."

లేచి నిలబడ్డాను. ఆమె కూడా లేచింది. ఇన్‌స్పెక్టర్ నాయర్ మా దగ్గరకొచ్చి ఆమెతో ఏదో రహస్యంగా మాట్లాడాడు.

"మీరు టాక్సీలో వచ్చారుగా! మా జీప్‌లో ఇంటికి వెళ్ళొచ్చు" నాయర్ అన్న మాటలు నాకు వినపడ్డాయి.

"మిమ్మల్ని నేను మీ యింటిముందు దింపుతాను" అన్నాను.

"గుడ్, మీరు పరశురామ్ గారితో వెళ్ళండి" అన్నాడు నాయర్.

ఇన్‌స్పెక్టర్ నాయర్ వైపు చూశాను.

"నాయర్ భాయ్, మరేదైనా తెలిస్తే నాకు ఫోన్ చేసి చెప్పు" అని ఆమెతో మార్గంలో వున్న కారువైపు నడిచాను.

"అలాగే బ్రదర్" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ఫియట్ కారు పక్కనే రాధ ఆగింది. ఆ కారును చూడగానే ఆమె మళ్ళా ఏడ్వసాగింది. మెల్లిగా తీసుకెళ్ళి ఆమెను డ్రాజి కారులో కూర్చోబెట్టి తలుపు మూశాను.

పెట్రోమాక్స్ లైట్ కాంతిలో పోలీసు ఆకారాలు కనిపిస్తున్నాయి. డ్రయివర్ సీటులో కూర్చుని కారును పోనిచ్చాను.

"ప్రఖ్యాత డిటెక్టివ్ పరశురామ్‌గారు మీరేనన్న నన్నమాట!" అందామె.

"పరశురామ్ నేనే" అన్నాను నవ్వుతూ. పక్క కూర్చున్న ఆమెవైపు ఓరగా చూశాను.

"పరశురామ్‌గారూ, ఆయనలో లోపాలున్నా ఆయన నా భర్త. నా తరఫున దర్యాప్తు చేసి ఆయన్ని ఎవరిలా హతమార్చారో దయిచేసి కనుక్కోండి. మీకు ఎంత డబ్బు కావలసినా నేను యిచ్చుకుంటాను."

"ప్రస్తుతం ఆ పనిలోనే వున్నాను. త్వరలో మనకు అంతా తెలుస్తుంది."

ఆలోచిస్తూ కారును పోనిచ్చాను. ఇసుకలో వున్న రమ్ బాటిల్ గుర్తుకొచ్చింది.

"మీ భర్త రమ్ బాటిల్స్ యెక్కడ కొంటూ వుంటారు?"

"ఒకరోజున నేనూ పిల్లలూ కార్లో వుండగా ఆయన రాజా వైన్స్ షాపులోకెళ్ళి బాటిల్ కొని తెచ్చారు. ఆయన అక్కడే కొంటూ వుంటారేమో!" అందామె.

సిగరెట్ వెలిగించాను. పొగ వదుల్తూ ఆలోచించసాగాను. రమ్ బాటిల్ని అతడు సాయంత్రం కొని వుండొచ్చు. అతడు బాటిల్ కొనేసరికి కారులో ఏ యువతేనా వుందేమో దర్యాప్తు చెయ్యాలి.

"కుడివైపు రోడ్డు తిరిగితే రెండోది మా యిల్లు" అందామె.

రైట్‌కి తిప్పి కారును పోనిచ్చి రెండో ఇంటిముందు ఆపాను. గేటు మూసి వుంది.

"నే వెళ్తాను. థాంక్స్" అందామె.

ఆమె గేటు తెర్చుకుని లోపలకు వెళ్ళింది. ఆమె ఇంటిముందుకు చేరుకున్నాక కారును పోనిచ్చాను.

## 4

సూర్యుడు ప్రకాశిస్తున్నాడు కాని కిరణాల్లో అంతగా వేడి లేదు.

పదింటికి కారును లజ్ లోని పేవ్ మెంట్ పక్కగా ఆపి దిగాను. ఎదురుగా రాజా వైన్స్ బోర్డు కనిపించింది.

షాపులోకి వెళ్ళాను. కౌంటరు కటువైపున్న మనిషి ఏం కావాలని అడిగాడు. జవాబివ్వకుండా రాక్స్ లో వున్న బుడ్డీలవైపు చూస్తూ నిలబడ్డాను.

నాగా రమ్ ఫుల్ బాటిల్సు చాలా వున్నాయి. అటు వైపున్న మనిషి వంక చూశాను.

"శ్రీనివాస్ తెలుసా?" అడిగాను.

"ఎవరు సార్?" అన్నాడతను.

"నాగా రమ్ ఫుల్ బాటిల్ కొన్నాడు నిన్న!"

"ఆయనా, తెలుసు సార్. నిన్న ఏడు ప్రాంతంలో వచ్చి రమ్ బాటిల్ కొని వెళ్ళిపోయారు" అన్నాడతను.

"నీ పేరు?"

"రాజా సార్."

"అతడి కారు మీ షాపు ఎదురుగా ఆగిందా?"

"అవును, సార్. యెప్పుడూ ఫియట్ కార్ను అక్కడే ఆపుతారు."

"ఆ కారులో ఎవరేనా వున్నారా?"

రాజా వెంటనే జవాబివ్వలేదు. నా వైపు విచిత్రంగా చూశాడు.

"ఎందుకు సార్ యిదంతా?"

"శ్రీనివాస్ ని ఎవరో చంపారు! నిన్న రాత్రి!" అన్నాను.

అతడు ఉలిక్కిపడ్డాడు.

"ఆయన దిగినప్పుడు ఎవ్వరూ లేరు. వెళ్లేటప్పుడు ఒక యువతి కారులో ఎక్కింది."

"ఎవరామె?"

"ఆమె ఎవరో నాకు తెలియదు సార్. ఆమె కారు పక్క నిలబడి వుంది. ఆయన ఆమెతో ఏదో మాట్లాడారు. ఆయన తలుపు తెరిచి, ఆమె కూర్చున్నాక మూశారు. కారు వెళ్ళిపోయింది."

"ఆమె ఏ డ్రెస్‌లో వుంది?"

"తెల్ల చీర, అదే రంగు జాకెట్. అంతకంటె ఎక్కువ చెప్పలేను. నేను యిక్కడ నిలబడి చూశాను. ఆమె భుజానికి పచ్చటి సంచి వేళ్ళాడుతోంది."

"ఆమె మొహం నీకు స్పష్టంగా కనపడలేదా?"

"లేదు, సార్."

అతడికి థాంక్స్ చెప్పి బయటకు నడిచాను. డాడ్జి కారును పోలీసు హెడ్‌క్వార్టర్స్ వైపు వేగంగా పోనిచ్చాను.

ఇన్‌స్పెక్టర్ నాయర్ నన్ను చూడగానే వుషారుగా కుర్చీలోంచి లేచి కరచాలనంచేసి కూర్చున్నాడు.

"బ్రదర్, ఏదేనా తెలిసిందా?" అడిగాడతను.

"నిన్న ఏడు గంటలకు శ్రీనివాస్ రాజా వైన్స్‌లో రమ్ బాటిల్ కొన్నాడు. అతడి కారు పక్కనే ఒక యువతి వుంది. ఆమెను కారులో ఎక్కించుకుని అతడు వెళ్ళిపోయాడు. ఆ యువతితోటే అతను ఎలియట్స్ బీచ్‌కి వెళ్ళుంటాడు" అన్నాను.

"పాత స్నేహితురాలై వుంటుంది" అన్నాడు నాయర్.

సిగరెట్ వెలిగించి టేబుల్ మీదున్న ఫోటోవైపు చూశాను.

"ఎవరిదా ఫోటో?" అడిగాను.

"ఇవాళ ప్రొద్దుటే పిచ్చాసుపత్రి సూపర్ యిన్

టెండెంట్ పంపారు. ఈమెకోసం పోలీసులు వెతుకు తున్నారు" అన్నాడు నాయర్.

"ఏమైంది?"

"మొన్న మధ్యాహ్నం యీమె పిచ్చాసుపత్రినుంచి పారిపోయిందట. ఈమె మూలంగా ప్రజలకు ప్రమాదం రావచ్చని హెచ్చరిస్తూ ఈమెకోసం వెతకమని సూపర్ యిన్ టెండెంట్ మాకు రాశారు."

ఫోటోను తీసుకొని పరీక్షగా చూశాను. చిరిగిన గుడ్డల్లో వుందామె. కాని మొహం అందంగా వుంది. ఫోటోలో ఆమె వెకిలిగా నవ్వుతోంది. చింపిరి జుత్తు. ఆమె పేరు మాధురి. ఆమె గురించి మరికొన్ని వివరాలు ఫోటో వెనక యివ్వబడ్డాయి.

ఆ ఫోటోను చూస్తూంటే నా మెదడులో ఏదో మెరిసింది.

"నాయర్ భాయ్, శ్రీనివాస్ కారులో వెళ్ళిన యువతి యీమే నేమో?" అన్నాను.

ఇన్‌స్పెక్టర్ నాయర్ హేళనగా నవ్వాడు.

"బ్రదర్, ఈమె మొహం, దుస్తులు చూస్తే పిచ్చిదని తెలుస్తోంది. ఇటువంటి దాన్ని ఎవరూ కార్లో యెక్క మనరు" అన్నాడు నాయర్.

సిగరెట్ పొగవదుల్తూ ఫోటోవంకే పదేపదే చూస్తూ వుండిపోయాను.

"నాయర్ భాయ్, పిచ్చాసుపత్రి సూపర్ యిన్ టెండెంట్ నీకు తెలుసా?"

"తెలుసు. ఆయన పేరు రామచంద్రం."

"అతడికి ఫోన్ చేయి, నేను మాట్లాడతాను."

డైరెక్టరీలో నంబర్ చూసి నాయర్ డైల్ చేశాడు.

అటువైపు రామచంద్రం రాగానే రిసీవర్ని నాకిచ్చాడు.

“పరశురామ్ స్పీకింగ్!” అన్నాను.

“మీతో మాట్లాడుతున్నందుకు సంతోషంగా వుంది. చెప్పండి ఏం కావాలో!”

“మొన్న మధ్యాహ్నం మాధురి అనే యువతి మీ హాస్పిటల్ నుంచి పారిపోయిందని తెలిసింది. ఆమె ఫోటో చూశాను. ఆమె మూలంగా ప్రజలకు ఎలా ప్రమాదం రావచ్చు?” ప్రశ్నించాను.

“మాధుర్ని మేం ఎప్పుడూ ఒంటరిగా తాళం వేసిన గదిలో వుంచేవాళ్ళం. మొన్న మధ్యాహ్నం ఆమె గదిలోకి రాజీ భోజనం తీసుకు వెళ్ళింది. అమాంతంగా ఆమె రాజీ తలమీద గ్లాసుతో కొట్టింది. రాజీ స్పృహ తప్పి పడిపోయింది. పచ్చటి బాగ్ ను భుజానికి తగిలించుకుని మాధురి వెంటనే బయటకు వెళ్ళిపోయింది. ఆమెను ఎవ్వరూ ఆపలేదు.”

“తర్వాత ఏమైంది?”

“రెండు దాటాక యీ వార్త నాకు రిపోర్టు చేయబడింది. వెంటనే నలువైపులా ఆమెకోసం మా మనుషులు వెతికారు. తర్వాత నేను పోలీసు రిపోర్టు యిచ్చాను.”

“ఆమె గత చరిత్ర గురించి చెప్పగలరా?”

“అదంతా మా రికార్డుల్లో వుంటుంది. మీరు యిక్కడకు దయచేస్తే అంతా చూడొచ్చు. మరో విషయం. ఆమె తల్లి రాజమ్మ పట్నంలోనే వుంది. ఆమెను కల్సుకుంటే మీకంతా తెలుస్తుంది.”

“రాజమ్మ అడ్రెసు చెప్పండి!”

అతడు చెప్పిన అడ్రెసు గుర్తుంచుకున్నాను.

అతడికి థాంక్స్ చెప్పి రిసీవర్ని పెట్టేశాను. మాధురి

ఫోటోను జేబులో పడేసుకుని నాయర్ ఆఫీసులోంచి బయటకు నడిచాను.

## 5

భారతీ నగర్‌లోని చిన్న బంగళాముందు కారాపి దిగాను. గేటు తెర్చుకొని ముందు వరండా మీదకు వెళ్ళాను.

సిగరెట్ పీలుస్తూ నలువైపులా చూశాను. చిన్న యిల్లు — ఇంటి చుట్టూ మల్లెతీగలు అమర్చబడ్డాయి. సిగరెట్‌ను దూరంగా విసిరి, తలుపుమీద తట్టాను.

"ఎవరు?" అందో కంఠం అటువైపు నుంచి.

"పరశురామ్" అన్నాను.

తలుపు తెర్చి అరవై ఏళ్ళ స్త్రీ నావైపు చూసింది. ఆమె చేతులు వణుకుతున్నాయి పార్కింగ్‌సన్స్ డిసీజ్ వలన. మొహం మాస్కు ధరించినట్లు వుంది.

"కూర్చోండి" అందామె.

ఆమె నావైపు తోయడానికి ప్రయత్నించిన తొట్టెను బయటకు లాగి కూర్చున్నాను.

ముందు హాల్లో గుమ్మం కటువైపున కుర్చీలో కూర్చున్న ఆమెవైపు చూశాను. ఆమె మొహంలో సంతోషం లేదు. మృత్యువు కోసం నిరీక్షిస్తూ జీవిస్తోంది.

"ఏం కావాలి బాబూ?" అందామె.

"మీ మాధురి గురించి వినడానికి వచ్చాను."

"ఇంకెక్కడ మాధురి? జీవితాన్ని పాడుచేసుకుంది" అందామె.

"ఆమెకు ఏమైంది? ఆమెకు ఎందుకు పిచ్చి పట్టింది?"

"ఖర్మ బాబూ" అందామె.

"కారణాలను సృష్టించి ఖర్మ సంభవిస్తుంది."

"బాబూ, అమ్మాయి మా ఒక్కగా నొక్క కూతురు. అది బి.ఎ. చదువుతూండగా ఆయిన పోయారు. ప్రాణంగా భావిస్తూ దాన్ని పెంచుతూ వచ్చాను. మోహన్ వలలో అది పడింది. అతడు ఇంటికొచ్చేవాడు. వర్రాడు మంచివాడనుకున్నాను. అతడిని పెళ్ళాడి ఆమె సుఖంగా జీవిస్తుందని అనుకునే దాన్ని."

ఆమె ఆగింది. బరువుగా ఊపిరి పీల్చింది.

"మోహన్ మోసగాడు. దుర్మార్గుడు. ఆమె సర్వ స్వాన్నీ దోచుకొని వదిలేశాడు. అతడు పరారయ్యాడు. ఎంగిలి విస్తరిలా నా బిడ్డ మిగిలింది!"

"దురదృష్టం" అన్నాను.

"ఆమె కడుపుతో వుంది. పెళ్ళికాని పిల్ల! అప్పుడు కూడా దాన్ని నేను ఏమీ అనలేదు. ఆది యింట్లో నే పడివుండేది. దుఃఖముతో కుమిలిపోతూ వుండేది. రహస్యంగా ఆమెను నర్సింగ్ హోమ్‌లో చేర్చాను. మాధురి కొడుకును కన్నది. నేను తల్లినీ, బిడ్డనీ చూశాను. కాని నేను ఊహించని విధంగా మాధురి తన జీవితాన్ని నాశనం చేసుకుంది."

"అప్పుడేమైంది" అడిగాను ఆత్రంగా.

"తన బిడ్డను ఆమె ఘోరంగా హత్య చేసింది. కత్తితో కడుపులో పొడిచేసింది. పేగులు బయటకు చొచ్చుకొచ్చాయి. ఆ దృశ్యాన్ని నేను చూడలేక పోయాను. అంత పాపం అది చేస్తుందని నేనెన్నడూ అనుకోలేదు."

"తర్వాత?"

"పోలీసులు ఆమెను అరస్టు చేసి తీసుకెళ్ళారు. ఆమె పిచ్చిదని డాక్టర్లు అన్నారు. పిచ్చాసుపత్రిలో ఆమెను

చేర్చారు."

"మీరు పిచ్చాసుపత్రికి వెళ్ళి ఆమెను చూసేవారా?"

"చూసేదాన్ని. కాని ఏం లాభం. నన్నది గుర్తు పట్టేది కాదు. మొహం పక్కకు తిప్పుకొని కూర్చునేది. దాన్ని జాగ్రత్తగా చూడమని రాణికి డబ్బు కూడా యిచ్చేదాన్ని."

ఆమెవైపు సూటిగా చూశాను.

"రాజమ్మగారూ, మాధురి పిచ్చాసుపత్రి నుంచి మొన్న పారిపోయింది. ఇటువైపు రావచ్చు!"

"వస్తే రానీ బాబూ! ఇక్కడుంటే దాని పిచ్చి కుదురుందేమో!" అందామె.

"ఆమె యిక్కడికొస్తే నా నంబరుకి ఎవరైనా ఫోన్ చేసి ఆ వార్త నాకు చెప్పమనండి" అని నా విజిటింగ్ కార్డు ఆమె చేతికిచ్చాను.

"బాబూ, దాని పిచ్చి కుదురుందా?"

"పిచ్చాసుపత్రిలో వున్న డాక్టర్ రామచంద్రం చాలా అనుభవం గలవాడు. ఎలక్ట్రిక్ షాకులు యిచ్చి, మందులు యిచ్చి పిచ్చి పట్టిన మెదడును బాగు చేయడానికి అతడు ప్రయత్నిస్తాడు. ఇంట్లోకంటె హాస్పిటల్లో వుండడమే మాధురికి మంచిది" అని బయటకు నడిచాను.

## 6

రోడ్డు దీపాలు వెలుగుతున్నాయి. పేవ్ మెంట్ పక్కనే లారీ ఆగివుంది. లారీ డ్రయివర్, క్లీనర్ టిఫిన్ సేవిస్తున్నారు.

డ్రయివర్ ఖాదర్ వయసు యాభై దాటివుంటుంది. క్లీనర్ పదహారేళ్ళ యువకుడు.

లారీ డ్రయివర్ మూడో భార్య యీ మధ్యనే చని

పోయింది. ఖాదర్ యుడాకిలో నడుస్తూన్నట్లు తన జీవితాన్ని సాగిస్తున్నాడు.

ఖాదర్ టైము చూశాడు. ఏడైంది. మరో పదిహేను నిమిషాల్లో తను బయల్దేరాలి!

లారీ పక్కకు వచ్చిన యువతివైపు ఖాదర్ సూటిగా చూశాడు. అందంగా వుంది. రెడ్ సారీ, అదే రంగు జాకెట్. భుజానికి పచ్చటి సంచి వేళ్ళాడుతోంది.

కాఫీ తేడానికి క్లీనర్ హోటల్లోకి వెళ్ళాడు. ఆ సమయంలో ఖాదర్ ఆమె దగ్గరగా జరిగాడు.

“ఏ వూరేనా వెళ్ళాలా?” అడిగాడు.

ఆమె తలాడించింది.

“నా లారీ చిత్తూరు వెళ్తోంది. కావలిస్తే రావచ్చు” అన్నాడతను.

“వస్తాను” అందామె.

ఖాదర్ మొహం నూరు వాట్ల బల్బులా వెల్గింది. ముందు సీటుమీద ఆమెను కూర్చోమన్నాడు. ఆమె కూర్చుంది.

క్లీనర్ కాఫీ తెచ్చాడు. ఖాదర్ కాఫీని తీసుకెళ్ళి ఆమెకిచ్చాడు. నవ్వుతూ అందుకుందామె. లారీ డ్రయివర్ బయటనున్న క్లీనర్తో దోసెలు పాక్ చేయించి పట్రామని చెప్పాడు. క్లీనర్ తలాడించాడు.

“ఒరేయ్, ఒక పిట్ట మన లారీలో వస్తోంది. నువ్వు వెనక సర్దుకొని కూర్చోవాలి” అన్నాడు ఖాదర్. క్లీనర్ విచిత్రంగా నవ్వాడు.

“ఒరేయి, ఒక అరక్ బాటిల్ కొని పట్రా” అని ఖాదర్ డబ్బిచ్చాడు.

“మటన్ బిర్యానీ వద్దా?” అడిగాడు క్లీనర్.

"అదీపట్రా" అన్నాడు ఖాదర్ మరికొంత డబ్బిస్తూ.

క్లీనర్ వెళ్ళిపోయాడు. కలలు కంటూ లారీ పక్కనే నిలబడ్డాడు ఖాదర్.

సరిగ్గా ఏడున్నరకు ఖాదర్ డ్రయివింగ్ సీటులో కూర్చుని లారీని పోనిచ్చాడు.

క్లీనర్ వెనుక బస్తాల మధ్య సర్దుకుని కూర్చున్నాడు.

లారీ వేగంగా వెళ్తోంది. ఆమె వైపు ఓరగా చూస్తూ అతడు లారీని పోనిస్తున్నాడు.

"పిల్లా, నీ పేరు?" అడిగాడతను.

"మధుమతి."

"చక్కటి పేరు. ఆ సినిమా కూడా చూశాను."

ఆమె మాట్లాడలేదు.

"తోవలో ఆకలేస్తుంది. మటన్ బిర్యానీ, దోసెలు పాక్ చేయించి తెచ్చాను."

"మంచిది. నాకు ఆకలి ఎక్కువ!" అందామె.

"నాకూ అంతే" అన్నాడతను నవ్వుతూ.

పట్నానికి యిరవై కిలోమీటర్ల దూరంలో అతడు రోడ్డు వారగా లారీని ఆపాడు. టైమ్ ఎనిమిది దాటింది. వెనక్కి వెళ్ళి క్లీనర్ వైపు చూశాడు.

"ఒరేయ్ పడుకో! కిందకు రాకు! నిన్ను చూస్తే పిట్ట బెదురుతుంది" అన్నాడు ఖాదర్.

"దుక్కిన పేనులా పడుకుంటాను" అన్నాడు క్లీనర్.

చెట్టుకింద ఖాదర్, ఆమె కూర్చున్నారు. చంద్రకాంతి హాయినిస్తోంది. టిఫిన్ పాకెట్లు ఆమె ముందు పెట్టి, అతడు అరక్ సీసా తెర్చాడు.

"అరక్ తాగనా?" అడిగాడతను.

"హాయిగా తాగు!" అందామె.

నీళ్ళు కలుపుకుని అతడు అరక్ తాగడం మొదలెట్టాడు. ఆమె దోసెలు తింటోంది.

చుట్టుపక్కల ఎవ్వరూ లేరు. మూడు రౌండ్లు అయ్యాక అతడామె చెయ్యి పట్టుకున్నాడు. ఆమె కిలకిలా నవ్వింది.

“చంద్రకాంతిలో స్వర్గం చూశావా?” అడిగాడతను.

“చూడాలి!” అందామె.

గ్లాసులో అరక్ పోసి అతడికిచ్చింది. అతను గబగబ తాగేశాడు. అతడికి నిషా ఎక్కువైంది. అంతా లీలగా కనిపిస్తోంది.

ఆమెను తనవైపు లాగాడు. ఆమె అతడిమీద పడింది.

“పిల్లా, నన్నొదలకు!” అన్నాడతను.

“వదలను” అందామె.

మరుక్షణంలో కత్తి అతడి కడుపులోకి దిగి యిటూ, అటూ కదిలింది. అరస్తూ అతడు వెనక్కు పడ్డాడు. కత్తిని అతడి గుడ్డలకు తుడిచి ఆమె సంచిలో పడేసుకుంది. అతడి జేబులో వున్న నోట్లను తీసుకొని, బిర్యాని పాకెట్ తీసుకొని ఆమె రోడ్డువైపు కదిలింది.

క్లీనర్ కేక విని ఉలిక్కిపడ్డాడు. ఏం జరిగింది? అతడు కిందకు చూశాడు. చెట్టు కిందకు మెల్లిగా వెళ్లాడు. గడ్డి నేలమీద పడున్న ఖాదర్ వైపు చూశాడు. పిట్ట ఎగిరి పోయింది. అతడు యింకా దగ్గర కెళ్ళాడు.

## 7

రిసీవర్ ఎత్తి “హలో” అన్నాడు.

“బ్రదర్, మరో హత్య! పట్నానికి 20 కిలోమీటర్ల దూరంలో, చిత్తూరుకు వెళ్ళే ట్రంకు రోడ్డుమీద లారీ డ్రయివర్ని యెవరో చంపారు” అన్నాడు నాయర్.

"నువ్వు వెళ్తున్నావా?"

"ఆ ప్రదేశం నా జూరిస్‌డిక్షన్‌లో లేదు. అయినా వెళ్తున్నాను. ఈ హత్యకీ, శ్రీనివాస్ హత్యకీ బాగా పోలికలున్నాయి."

"ఏ విధంగా?"

"లారీలో ఒక యువతి యెక్కింది. లారీ డ్రయివర్ బాగా అరక్ సేవించాడు. డ్రయివర్ పేగులు బయటకు చొచ్చుకొచ్చాయి."

"నేనూ వస్తున్నా. అక్కడ కలుసుకుందాం" అని రిసీవర్ పెట్టేశాను.

డాడ్జి కారును శరవేగంగా చిత్తూరు వైపు పోనిచ్చాను. ఇరవై నిమిషాల్లో లారీ వెనక నా కారాపి దిగాను.

సబ్ ఇన్‌స్పెక్టర్ కేశవరామ్ నా దగ్గరకొచ్చాడు. వినయంగా నమస్కరించాడు.

"మీరు వస్తారని ఇన్‌స్పెక్టర్ నాయర్ చెప్పారు, మిస్టర్ పరశురామ్" అన్నాడతను.

"నాయర్ జీప్ యీపాటికి వస్తూ వుండాలి" అని శవం దగ్గరకు నడిచాను.

సబ్ ఇన్‌స్పెక్టర్ వేసిన టార్చి కాంతిలో శవాన్ని చూశాను. భయంకరంగా పేగులు కనిపిస్తున్నాయి. నేలమీద గ్లాసు, అరక్ బాటిలు వున్నాయి. పక్కనే ఎంగిలి ఆకులు!

"మీకు యెవరు రిపోర్టు యిచ్చారు?"

"లారీ క్లీనర్, అతను!" అన్నాడు సబ్ ఇన్‌స్పెక్టర్.

"ఏం జరిగింది?"

అతడు నా వైపు భయంతో చూశాడు.

"మద్రాసులో ఒకమ్మాయి లారీలో ఎక్కింది. లారీ

యిక్కడ ఆగింది. నన్ను దిగొద్దన్నాడు ఖాదర్. ఆళ్ళు ఏదో మాట్లాడుకుంటున్నారు. ఇంతలో ఖాదర్ అరుపు విని నేను భయపడ్డాను. కొంతసేపయ్యాక నేను దిగి చూశాను. పిచ్చిగా పరుగెత్తాను. మోటర్ బైక్ మీద వస్తున్న యీ ఇన్‌స్పెక్టర్ గారికి చెప్పాను. ఆయన శవాన్ని చూసి, నన్ను కాపలా వుంచి వెళ్ళిపోయారు. తర్వాత ఆయన ఒక కాన్‌స్టేబుల్‌తో వచ్చారు."

ఆ యువతి ఎటు వెళ్ళిందని అడగలేదు. వేగంగా వెళ్ళి కార్లో కూర్చుని తలుపు మూశాను. కారును ముందుకు వేగంగా పోనిచ్చాను.

హెడ్ లైట్ల కాంతిలో నా కళ్ళు వెతుకుతున్నాయి. ఆమె పట్నంవైపు వెళ్ళిందేమో! అలా వెళ్ళుంటే నేను వచ్చేటప్పుడు నాకు కనబడేది. ఆమె యిటే తప్పక వెళ్ళుండాలి!

స్పీడు తగ్గించాను. రోడ్డు వారగా ఒక యువతి నడుస్తోంది. ఆమె పక్కనే కారు ఆపాను. ఆమె ఆగి నా వైపు చూసింది.

"చిత్తూరు వెళ్తున్నా వస్తావా?" అన్నాను.

ఆమె నవ్వుతూ తలాడించింది. తలుపు తెర్చాను. ఆమె ఎక్కి కూర్చుంది!

కారు లోపల లైట్ కాంతిలో ఆమె వైపు పరీక్షగా చూశాను.

"లారీ నుంచి చాలా దూరం నడిచావు!" అన్నాను గంభీరంగా.

ఆమె అమాంతంగా దిగబోయింది. చెయ్యి పట్టుకుని వెనక్కి లాగాను. ఆమె సీటుమీద వెల్లకిలా పడింది.

భుజానికున్న సంచిలోని వస్తువులను కింద పడేశాను.

చిరిగిన గుడ్డలు! రక్తం మరకలు వున్న తెల్లచీర! వాటి మధ్య కత్తి మెరుస్తోంది!

కోపంగా చూస్తూ ఆమె చేతికి బేడీలు వేశాను. తలుపు మూసి కారును వెనక్కి తిప్పి పోనిచ్చాను.

ఆమె నా వైపు జరిగి నన్ను పళ్ళతో కొరకబో యింది. ఎడంచేత్తో చెంపమీద కొట్టాను. ఆమె సీటు మీద కుప్పలా పడింది.

కాస్సేపట్లో లారీ పక్కనే కారాపి దిగాను. ఇన్ స్పెక్టర్ నాయర్ జీప్ అప్పుడే వచ్చి ఆగింది.

ఇన్ స్పెక్టర్ నాయర్ నా వైపు పరుగెత్తుకొచ్చాడు.

"నాయర్ భాయ్, పిచ్చాసుపత్రినుంచి పారిపోయిన మాధురి నా కారులో వుంది. శ్రీనివాస్ నీ, లారీ డ్రయివర్ ఖాదర్ నీ ఆమే చంపింది. హత్యకు ఉపయో గించిన కత్తి కారు కార్పెట్ మీద పడుంది" అన్నాను.

ఇన్ స్పెక్టర్ నాయర్ నా కారు వైపు వెళ్ళాడు. తలుపు తెరిచాడు. లోపల లైటు వెలిగింది. ఆమెను బయ టకు లాగి, కార్పెట్ మీదున్న కత్తివైపు చూశాడు.

ఆమె చేతులకు వేసిన బేడీలు తీసేసి కోటుజేబులో పడేసుకున్నాను. ఒక కానిస్టేబుల్ గుడ్డల్నీ, కత్తినీ సంచిలో పడేసి ఆమె భుజానికి తగిలించాడు.

శూన్యంలోకి చూస్తున్న మాధురి చేతులకు ఇన్ స్పెక్టర్ నాయర్ బేడీలు వేశాడు.

"బ్రదర్, ఈమె యిదంతా ఎందుకు చేసింది?"

"నాయర్ భాయ్, ఆమె పిచ్చిది. మాడ్ కిల్లర్!" అని కారును స్టార్ట్ చేశాను.

—:అయిపోయింది:—

# పాపపు చరిత్ర

## బొమ్మిడి అచ్చారావు

"ఏక్సిడెంట్ ఎలా అయింది?" అడిగాడు డిటెక్టివ్ కిరణ్ అతన్ని. అతని కాళ్ళకు, కుడిచేతికి బేండేజి వుంది. ఇంకా అక్కడక్కడ చిన్న చిన్న గాయాలకు టింక్చర్ దూది అంటించి వుంది.

డిటెక్టివ్ కిరణ్, ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్ అతని మంచం పక్కన కుర్చీల్లో కూచుని వున్నారు. శ్రీనివాస్ కాగితం పాడ్ తీసుకొని పాయింట్స్ నోట్ చేసుకుంటున్నాడు.

అతను నాలికతో పెదాలు తడి చేసుకుని చెప్పటం మొదలెట్టాడు.

"నా పేరు శశిధర్ సార్! నా ఫ్రెండు పేరు రవి. ఈ సాయంత్రం ఇద్దరం యాదగిరి గుట్టనుంచి నరసింహా స్వామిని దర్శించుకుని హైదరాబాదు వస్తున్నాం. సిటీ లిమిట్సులోకి వచ్చేస్తున్నాం. ఇంతలో ఎక్కడినుంచో భూతంలాంటి లారీ దూసుకు వచ్చేసింది. బుల్లెట్ రవి

నడుపుతున్నాడు. వెనక నే కూచున్నాను.

అప్పటికీ రవి చాలా కాషస్ గా నే నడుపుతున్నాడు. కాని ఆ లారీ కావాల నే మామీదికి దూసుకువచ్చినట్టు నాకర్థమయింది. రవి పక్కకు తీశాడు. లారీ కూడా ఆ పక్కకే వచ్చింది. మళ్ళీ ఎడమపక్కకు కోశాడు బుల్లెట్. లారీ కూడా ఎడమపక్కకే వచ్చింది. మాకు యింకా పక్కకి వెళ్ళటానికి స్కోప్ కనిపించలేదు. పక్కన లోయ. కింద పెద్ద పెద్ద బండరాళ్ళు. బ్రేక్ కొట్టి ఆగి పోయాడు రవి. లారీ నిర్దాక్షిణ్యంగా మీదికి వచ్చేసింది. నేను కుడిపక్కకి గెంతి దూకేశాను. లారీ బుల్లెట్ ని తొక్కేసి శరవేగంతో వెళ్ళిపోయింది. చేతులమీద అనుకున్నాను. కుడిచెయ్యి విరిగినట్టనిపించింది.

"ఇంతలో మా వెనక ఓ మెటడార్ వాన్ వచ్చి ఆగింది. వాళ్ళు నా పరిస్థితి చూసి వెంటనే వాన్ లో వేసుకువచ్చి ఉస్మానియా హాస్పిటల్లో చేర్చారు. నాకు రెండు కాళ్ళకి స్వల్ప గాయాలు తగిలాయి. కాని కుడి చేయి ఫ్రాక్చరయిందని చెప్పారు" అన్నాడు శశిధర్.

"లారీ నంబరు చూశారా?" అడిగాడు శ్రీనివాస్.

"ఆ విపత్కర స్థితిలో ఆ ఆలోచనే రాలేదండి. రవి అక్కడికక్కడే మరణించిన విషయం నాకు దిగ్భ్రాంతి కలిగించింది. వాడికి భార్య, రెండేళ్ళ బాబు వున్నారు. వాళ్ళ పరిస్థితి తలుచుకుంటే నా కడుపు తరుక్కుపో యింది" శశిధర్ గొంతు బొంగురుపోయింది.

"అయితే యిది ఏక్సిడెంట్ కాదు, హత్య అంటారా?" అడిగాడు శ్రీనివాస్.

"నాకలాగే అనిపిస్తోంది సార్! నిజంగా యాక్సిడెంటల్ గా జరిగితే లారీ బ్రేక్ వేసి వుండేవాడు. అలా

చెయ్యలేదు. కుడిపక్కగా లారీ తప్పుకు పోవటానికి కావలసిన దారికన్న ఎక్కువే జాగా వుంది. అయినా లారీవాడు మేము యెడమ పక్కకి తిప్పితే వాడూ ఎడమపక్కకే లారీ తిప్పాడు. మాకు కుడివైపు తిరగ టానికి టైం లేదు. వాడికి తిరగటానికి చోటూ వుంది, టైమూ వుంది. అయినా మామీదికే లారీ నడుపుకు వచ్చాడంటే ప్రయత్నపూర్వకంగానే మమ్మల్ని హత్య చెయ్యటానికే అలా చేశాడనీ నాకనిపిస్తోంది" అన్నాడు శశిధర్.

"అంటే ఆ లారీ డ్రయివర్ మీ శత్రువయి వుం డొచ్చు" అన్నాడు శ్రీనివాస్.

"అవును సార్! నాకూ అదే అనిపిస్తోంది."

"అయితే ఆ లారీ డ్రయివరు ఎవరో కూడా మీకే సరికి గ్రహింపుకొచ్చి వుంటుంది" అన్నాడు కిరణ్.

శశిధర్ వెంటనే, "అదే అర్ధంకావటంలేదు సార్! లారీ డ్రయివర్సు యెవరూ, నాకు తెలిసి, శత్రువులెవరూ లేరు" అన్నాడు.

"పోనీ మీ ఫ్రెండు రవికి....?"

"మాకిద్దరికీ కామన్‌గానే వున్నారు మిత్రులు, శత్రు వులు కూడా! అందులో డ్రయివర్ ఎవరూ లేరు."

"డ్రయివర్ అంటే వృత్తిరీత్యా డ్రయివర్ కాకి పోవచ్చు. ఆ సమయానికి మీ శత్రువెవడో ఆ లారీ నడుపుతూ డ్రయివర్ స్థానంలో వుండవచ్చు కదా!" అన్నాడు కిరణ్.

శశిధర్ తలూపి, "అవకాశముంది సార్!" అన్నాడు.

"ఆ అవకాశం ఎవరికుంది?"

"అదే ఆలోచిస్తున్నాను సార్! ఓ మెకానిక్

వున్నాడు మలక్ పేటలో. ఆటో మొబైల్ షాపు నడుపుతాడు. అతను యిలా చేయుటానికవకాశముంది. మోటారు ఫీల్డులోనే వున్నాడు కాబట్టి లాగీ ఏదోకటి అందుబాటులో వుంటుంది కూడా" అన్నాడు శశిధర్.

"అతని పేరు?"

"యల్లమంద."

"అతనితో మీ కెందుకు విరోధం వచ్చింది?"

"ఓసారి రవి మోటార్ బైక్ అతనికి సర్వీసింగ్ కిచ్చాడు. అతను మంచి పార్ట్స్ తీసేసి అవన్నీ రిపేరు కొచ్చాయని చెప్పి రవి దగ్గర పెద్ద మొత్తంలో ఛార్జి చేశాడు. ఆ విషయంలో వాళ్ళిద్దరు ఘర్షణపడ్డారు. బుల్లెట్ అతని దగ్గరే వదిలేసి నాకు ఫోన్ చేశాడు ఆఫీసుకి. ఇద్దరం వెళ్ళి అలా ఎందుకు చేశావని అడిగాం. తక్కిన మెకానిక్స్ కూడా యల్లమందకే వత్తాసు వచ్చారు. పెద్ద గొడవయ్యింది. యల్లమంద యిష్టమొచ్చినట్లు మాట్లాడాడు.

చివరికి నేనే అతనడిగినంత యిచ్చి పడేసి బయట పడమని మా వాడికి చెప్పాను. ఇద్దరం బయటికొస్తూంటే యల్లమంద ఏదో తిట్టడం మాకు వినిపించింది. రవి దుడుకుగా వెనక్కి వెళ్ళబోతే నేనే వారించి బయటికి తీసుకొచ్చాను. రవి కూడా నోటికొచ్చినట్టు తిట్టాడు. ఆ కసితో వాడు పగబట్టి యిలా చేసి వుండవచ్చును" అన్నాడు శశిధర్.

శ్రీనివాస్ రికార్డు చేసుకుంటున్నాడు.

డిటెక్టివ్ కిరణ్ శశిధర్ చెప్పినది శ్రద్ధగా విన్నాడు.

"ఇది జరిగి ఎన్నాళ్ళయింది?"

"ఓ నెల కావచ్చును."

"నెల తర్వాత చిన్న విషయానికి మీమీద కత్తికట్టి ఏక్సిడెంట్ చేస్తాడంటారా?" అన్నాడు కిరణ్.

"వాడి తత్వం చూడబోతే బాగా గూండాలా వున్నాడు సార్! వాళ్ళంతా దొంగలు. మోసంచేసి సంపాదిస్తున్నారు. మేము సాధారణంగా అక్కడ రిపేరుకివ్వం. కాని, ఆ రోజు సడన్‌గా రవి బుల్లెట్ ఆ షాపు దగ్గర్లో ట్రబులివ్వటంవల్ల తప్పనిసరిగా వాడికి చూపించాడు."

"అంతకుముందు యల్లమందతో పరిచయం లేదా?"

"లేదు సార్! రవి, నేను కూడా వుంటున్నది కాలి వాహన నగర్లో. మలక్ పేటలో స్నేహితుల్ని చూడ టానికి రవి ఆ రోజు ఒక్కడే వెళ్ళాడు. అతనికి ఆ రోజు వీక్లీ ఆఫ్. నాకు ఆఫీసుండడంవల్ల నేను వెళ్ళలేదు. సాధారణంగా మేమిద్దరం కలిసే వెళుతుంటాం. చెప్పాను కదండీ, మా యిద్దరి స్నేహితులు కామన్ గానే వుంటారని!"

"అయితే యల్లమంద నెలరోజుల తర్వాత నిన్న మీమీద కత్తితో చంపటానికి లారీ నడుపుకుని వచ్చి ఏక్సిడెంట్ చేసివుంటాడని మీ అనుమానం. అవునా?" అన్నాడు శ్రీనివాస్.

"అవును సార్! అవకాశముందంటున్నాను,"

"ఓ.కే. మేము దర్యాప్తు చేస్తాం. ఇంకా మీ దృష్టిలో ఎవరిమీదనైనా అనుమానముంటే చెప్పండి" అన్నాడు కిరణ్.

శశిధర్ ఏదో ఆలోచించి, "నా పర్సనల్ శత్రువు ఒకతను ఉన్నాడు సార్! అతని పేరు చైతన్య. సంజీవ రెడ్డి నగర్ లో వుంటాడు" అన్నాడు.

"అతనే విధంగా శత్రువు?"

"చైతన్య ఓ విధంగా మా దూరపు బంధువు. అతనికో చెల్లెలుంది. ఆమెని నేను చేసుకోవటానికి ప్రపోజ్ చేశాడు. నేను తిరస్కరించాను."

"అంతమాత్రాన...."

"అంతేకాదు సార్! చైతన్య మేనమామ మా ఆఫీసులో మేనేజర్ గా వున్నాడు. నేను అతని చెల్లెల్ని చేసుకోలేదని కక్షపూని మేనేజర్ బంధువును నియోగించి నన్ను ఉద్యోగ బాధ్యతల్లో ట్రీజ్ చేసి, నాచేత కమిట్ మెంట్సు చేయించి నన్ను డిస్మిస్ చేయించాలని చాలా విధాల ప్రయత్నించాడు కాని, చాలా మెలకువగా ఆ గండాలన్నీ తప్పించుకున్నాను. ఓసారి ముఖాముఖి కలిసి, అతని దురాలోచనల్ని బయటపెట్టి బాగా మందలించాను. బాగా ఘర్షణపడ్డాం. నా అంతు చూస్తానని బెదిరించాడు. నేనూ ఊరుకోలేదు. బాగా తిట్టాను. బుస కొట్టి వెళ్ళిపోయాడు. సమయం చూసి ఇలా చేశాడేమోననిపిస్తోంది.

"అలా అయితే మీ ఒక్కర్నే చంపాలని ప్రయత్నిస్తాడు. రవిని కూడా ఎందుకు అంత మొందించాలనుకుంటాడు?"

"విడిగా అవకాశం దొరికి వుండదు. నిన్న తను కూడా యాదగిరి గుట్టలో మాకు కనిపించాడు. మధ్యాహ్నం తిరిగొచ్చేసరికి కనపడలేదు. ఈలోపల లారీ ఏర్పాటు చేసుకుని మామీద దాడిచేసి వుండొచ్చు."

కిరణ్ తల పంకించాడు. శ్రీనివాస్ నోట్ చేసుకుంటున్నాడు.

"చైతన్య ఏం చేస్తుంటాడు?"

"సనత్ నగర్‌లోని పెద్ద, మోటార్ విడి భాగాలు తయారుచేసే కంపెనీలో పర్సనల్ అసిస్టెంటుగా పని చేస్తాడు. నివాసం కూడా అక్కడే దగ్గర్లోవున్న స్వామి థియేటర్ వెనక సందులో వుంటాడు."

శ్రీనివాస్ రాసుకున్నాడు.

"ఇంకా ఎవరిమీదనైనా అనుమానముంటే చెప్పండి" అన్నాడు.

"మా వీధిలో వుంటున్న జేమ్స్ అనే అతనితో ఓసారి నేను బాగా గొడవపడ్డాను. అతని చెల్లెలు లూసీ ఒకప్పుడు నా కోసం వల విసిరింది. నేను బ్రహ్మచారినని తెలిసి నన్ను వల్లో వేసుకోవటానికి ప్రయత్నించింది. ఆమె అంటేనే నాకు ఎలర్జీ. ఎన్నడూ ఆమె మొహం వంక దీక్షగా చూసి ఎరగను.

"ఓ, రోజు వీధి చివర్లో వున్న కమ్యూనిటీ హాలుదగ్గిర రాత్రి ఎనిమిది గంటల ప్రాంతంలో దారికాసి నా మీద పడింది. నేనంటే తన కెంతో యిష్టమనీ నన్ను పెళ్ళి చేసుకోమనీ ఇంకా ఏవేవో ప్రేమ పురాణాలు విప్పింది. నేను చిరాకుపడ్డాను. చెయ్యి పట్టుకుంది. విడిపించుకో బోతే మీదపడి గట్టిగా కావలించుకుంది. నేను అసహ్యించుకుని, వదిలించుకుని నా రూం కొచ్చి పడ్డాను. నా మీద పగబట్టిందామె.

ఆ మర్నాడు జేమ్స్ ఓ కత్తిపుచ్చుకుని నా గదికొచ్చి తలుపు తట్టాడు. నేను వాడి చెల్లెల్ని పాడుచేయటానికి ప్రయత్నించాననీ, నా లాంటివాడు ఆ వీధిలో వుంటే ఎన్నో సంసారాలు నాశనమయి పోతాయనీ అందుకని నన్ని భూమ్మీద వుంచటం తన కిష్టంలేదనీ కత్తి పై కెత్తాడు. సమయానికి రవి, చుట్టుపక్కల వాళ్ళు వచ్చి

అతన్ని పట్టుకోకపోతే అతను నన్ను చంపేసేవాడే!"
అన్నాడు శశిధర్.

"అంటే లూసీ లేనిపోనివి చెప్పి అన్నను మీపై పురి కొల్పిందంటారా?" అడిగాడు శ్రీనివాస్.

"అవును సార్! ఆమె వట్టి తిరుగుబోతు. మా వీధిలో అందరికీ తెలుసు ఆమె సంగతి. అందుకని తప్పు నాది కాదని అందరూ అభిప్రాయాని కొచ్చారు. జేమ్స్‌ని మందలించి పంపేశారు. ఆ సమయంలో జేమ్స్ బాగా తప్ప తాగున్నాడు. తప్పంతా అతనిదేనని మందలించి పంపేశారు. మరోసారి ఇలా కత్తులూ కటారులూ తెచ్చి మనుషులమీద పడితే ఊరుకునేదిలేదని వార్నింగిచ్చారు. జేమ్స్ వాళ్ళింట్లోకి పోతూ చూసిన విషపు చూపు యిప్ప టికీ మరచిపోలేదు నేను" అన్నాడు శశిధర్.

"జేమ్స్ ఏంచేస్తుంటాడు?"

"అతని తత్వానికి సరిపోయినదే! మాలాలీలో ఓ లిక్కర్ కంపెనీలో పని నిస్తాడు. ఎప్పుడూ లోడ్‌లో వుంటాడు. మామూలుగా అతన్ని చూడం" అన్నాడు శశిధర్.

"మీ ఫ్రెండు రవి ఎక్కడ పని చేసేవారు?"

"అతను ఎలక్ట్రానిక్స్ కార్పొరేషన్‌లో టెక్నికల్ అసిస్టెంటుగా చేసేవాడు. బి.యి. మెకానికల్. మంచి భవిష్యత్తున్నవాడు. ఈ లోపల విధి చిన్న చూపు చూసింది" అన్నాడు శశిధర్.

కిరణ్ శ్రీనివాస్ వంక చూసి, "ఏక్సిడెంట్ స్పాట్ చూద్దామా?" అనడిగాడు.

"అలాగే! నేను చూశాను. బుల్లెట్ తుక్కయి

పోయింది! లారీ టైరు గుర్తులు తప్ప అక్కడేం కనిపించ లేదు. మెటడార్ వాన్ డ్రయివర్ కూడా యీాయన్ని హాస్పిటల్లో చేర్చి అర్జంటుగా వెళ్ళిపోయాడు. విట్నెస్ గా ఉండాల్సి వస్తుందని అభిప్రాయపడి వుంటాడు" అన్నాడు శ్రీనివాస్.

కిరణ్ శశిధర్ వంక చూసి, "మీ బంధువు లెవరూ లేరా యిక్కడ? యెవరూ వచ్చిన జాడ లేదు...." అన్నాడు.

"మా వూరు కడపజిల్లా మైదుకూరు సార్! అక్కడ మా తల్లి, తమ్ముడు వున్నారు. తమ్ముడుకి చదువంటలేదు. అక్కడే ఓ ఫ్యాన్సీషాపు నడుపుతున్నాడు. అక్కలూ, చెల్లెళ్ళూ, అన్నలూ యెవరూ లేరు...." అన్నాడు శశిధర్.

"మీరింకా పెళ్ళి చేసుకోలేదా?"

"ఈ సంవత్సరం ప్రపోజల్ వుంది సార్! ఉద్యోగం యింకా పర్మనెంట్ కాలేదని యిన్నాళ్ళు ఆగాను. గత జనవరిలోనే ప్రొబేషన్ డిక్లరేషన్ అయింది" అన్నాడు శశిధర్.

"ఓకే! మంచి విషయాలు చెప్పారు. మీ రింకా హాస్పిటల్లో ఎన్నాళ్ళుండాలన్నారు?"

"ఓ పదిరోజులదాకా పేషెంట్ కదలటానికి వీల్లేదండి! చేయికి ఫ్రాక్చరయింది. మరో పదిహేనురోజుల తర్వాత సిమెంటు కట్టు విప్పి వేరే కట్టు వేయాలి" చెప్పాడు అప్పుడే అక్కడికి వచ్చిన డాక్టరు.

"ఆల్ రైట్! అవసరమయితే మళ్ళీ కలుస్తాం" అని లేచాడు డిటెక్టివ్ కిరణ్. శ్రీనివాస్ అనుసరించాడు.

# 2

"రవి మిసెస్‌ని కలుసుకుంటే మనకి కొన్ని ముఖ్యమయిన విషయాలు తెలుస్తాయి" అన్నాడు డిటెక్టివ్ కిరణ్.

కిరణ్, శ్రీనివాస్ పోలీసు స్టేషన్‌లో కూచుని వున్నారు.

"ఆ అవకాశం యిప్పట్లో లేదు...." అన్నాడు శ్రీనివాస్. భర్త మరణం ఆమెకి షాకిచ్చినట్టుంది. ఎవరితోనూ మాట్లాడటం లేదు. వెర్రిచూపులు చూస్తోంది. బహుశా కొన్నాళ్ళవరకూ కుదుటపడదనుకొంటాను."

"అలాగా! ఇప్పుడామె ఎక్కడుంది?"

"ఆమె తండ్రి వాళ్ళ వూరు తీసుకుపోయాడీ రోజు. మళ్ళీ దినకార్యాలకు యిక్కడికే వస్తారనుకుంటానంతే!"

"నువ్వు ఏక్సిడెంట్ స్పాట్ చూశావు కదా? వివరాలు చెప్పు! శశిధర్ చెప్పినదానికీ, నువ్వు చెప్పినదానికీ ఏదయినా తేడా వుందా?"

"ఏం లేదు! బుల్లెట్ యెడమవైపుగా దొర్లిపోయి వుంది. రోడ్‌కి యెడమపక్క ఓ పెద్ద లోయ వుంది. ఎడమవైపు రోడ్ మార్జిన్‌లో లారీ టైర్ల గుర్తులు కనిపించాయి. అక్కడ రోడ్ మట్టి పోసివుంది—ఎర్రటి మట్టి. కుడివైపుగా రోడ్ చాలా ఉంది. అయినా లారీ ఎడమవైగా వెళ్ళాల్సిన అవసరం లారీవాడికెందుకొచ్చింది? దీన్నిబట్టి ఆ లారీ డ్రయివర్ కావాలనే వాళ్ళమీదకు లారీ తోలినట్టు స్పష్టంగా తెలుస్తోంది!"

"చైతన్య, యల్లమంద, జేమ్స్‌ల ఎలిబీలు గురించి

ఎంక్వయిరీ చేయించు. వాళ్ళు ముగ్గురూ ఏక్సిడెంట్ జరిగిన సమయంలో యెక్కడెక్కడున్నారో కనుక్కో" అన్నాడు డిటెక్టివ్ కిరణ్.

## 3

ఫోన్ గణగణ మోగింది.

"హల్లో, డిటెక్టివ్ కిరణ్ హియర్!"

"వెంటనే స్టేషన్‌కి రా బ్రదర్! చైతన్య ఏక్సిడెంట్‌లో చనిపోయాడు."

"చైతన్యా? ఏక్సిడెంట్లోనా?"

"అవును! లారీ ఏక్సిడెంట్! సనత్‌నగర్ మెయిన్ రోడ్‌న లారీ అతని స్కూటర్‌ని డాష్ యిచ్చిందట. స్పాట్ డెత్!"

"వాటే ట్రాజడీ!? లారీవాడు పారిపోయాడా?"

"ఆఁ! ట్రాఫిక్ కాన్‌స్టేబులు నంబరు నోట్ చేశాడు. నువ్వు వెంటనే రావాలి!"

"ఇప్పుడే వస్తున్నా!"

కిరణ్ డ్రస్ చేసుకుని చకచక బయటికి వచ్చి పోర్టికోలో నుంచి టయోటా బయటికి తీశాడు.

పదినిమిషాల్లో స్టేషన్ ముందున్నాడు కిరణ్.

"నీ టయోటా యిక్కడ వదిలెయ్యి. ఇద్దరం మా బలగంతో జీపులో పోదాం" అన్నాడు శ్రీనివాస్.

మరో యిరవై నిమిషాల్లో పోలీసు జీపు సనత్‌నగర్లో ఏక్సిడెంట్ స్పాట్‌లో వుంది.

స్కూటర్ ముందు చక్రం వంపు తిరిగిపోయింది. వెనక చక్రం అణగిపోయింది.

స్కూటర్‌కి రెండు గజాల అవతల తలభాగం నుజ్జునుజ్జయిపోయిన శవం. చూసే వాళ్ళకి భీతికొలిపేలా

వుంది.

సార్జంట్ శివం యిన్‌స్పెక్టర్‌కి శాల్యూట్ చేసి "రెప్పపాటులో లారీ మాయమయి పోయింది సార్! ఎర్ర రంగు బెంజి మెర్సిడెస్ బండి. నంబర్ ట్రాఫిక్ కాన్‌స్టేబిలు నోట్ చేశాడు; ఎ. డి. వై. 3631" అన్నాడు.

అప్పటికే బాగా గుంపు చేరింది. పోలీసులు కంట్రోలు చేయలేక సతమతమవుతున్నా.

కిరణ్ ఆ ప్రదేశాన్నంతా పరీక్షగా చూస్తున్నాడు. సాయంత్రం అయిదున్నర కావస్తోంది. ఈ సమయంలో పబ్లిగ్గా ఏక్సిడెంట్ చేసి అందరి కళ్ళు కప్పిపోయిన ఆ లారీడ్రయివర్ చాకచక్యానికి, గుండె నిబ్బరానికి ఆశ్చర్య పోతున్నాడతను.

"కావాలని చేసిన ఏక్సిడెంటు. రవి విషయంలోను యిలాగే జరిగింది కదా! బహుశా హంతకుడు కూడా ఒకడే అయ్యుండాలి" అన్నాడు శ్రీనివాస్.

కిరణ్ తల పంకించాడు.

"ఇతను చైతన్య అని ఎవరు గుర్తుపట్టారు?" అడిగాడు కిరణ్.

"ఇదిగో సార్, యీాయన డైరీ. స్కూటరు ఎటాచీ లోంచి యెగిరిపడింది. ఈయన పనిచేస్తోన్న ఫ్యాక్టరీ యిక్కడే కదా! అతని కొలీగ్స్, వర్కర్సు గుర్తుపట్టి చెప్పారు. అంత క్రితమే యితని వివరాలు డైరీవల్ల తెలి శాయి. అందుకే సార్‌కి ఫోన్ చేసి పేరుతో సహా వివ రాలు చెప్పాను" అన్నాడు సార్జంట్ శివం.

"ఏక్సిడెంట్ చూసిన ప్రత్యక్ష సాక్షు లెవరయినా వున్నారా?" అడిగాడు కిరణ్.

"ఇదిగో, యీాయన చూశాడు సార్!" అన్నాడు శివం ఓ నడివయసు మనిషిని చూపించి.

అతను ముందుకొచ్చి "నా పేరు నరసింహం సార్! యీా పాన్ షాప్ నాదే! సాయంత్రం నాలుగు గంటల ప్రాంతాన యీాయన యిటునుంచి స్కూటర్ మీాద వస్తున్నాడు. అటు నుంచి లారీ వస్తోంది. సడన్ గా పెద్ద శబ్దమయింది. అటు చూసేసరికి లారీ స్కూటర్ ని కొట్టేసి స్కూటర్ మీాదుగా మనిషిని తొక్కేసి యమ స్పీడుగా వెళ్ళిపోయింది" అన్నాడు.

"లారీ నా ముందునుంచే పరుగెత్తింది. నేను విజల్ వేసి ఆపటానికి ప్రయత్నించాను. కాని ఆగలేదు. వెంటనే నంబరు నోట్ చేసి సార్జంటుకి తెలియచేశాను" అన్నాడు ట్రాఫిక్ కానిస్టేబిల్.

చైతన్య బంధువులు శోకాలు పెడుతూ వచ్చి చేరారక్కడికి. ఓ ముసలామె, యిరవై యేళ్ళ యువతి, ఓ పదహారేళ్ళ కుర్రాడు వచ్చారు.

ముసలామె చైతన్య తల్లిగాను, ఆ యువతి చెల్లెలుగాను, కుర్రాడు తమ్ముడిగాను ఊహించాడు కిరణ్. శశిధర్ చెప్పిన అమ్మాయి ఆమే అయివుండాలి. ఆమెవంక పరిశీలనగా చూశాడు కిరణ్. దుఃఖంతో ఆమె ముఖం బాగా కమిలిపోయి ఎర్రగా వుంది. ఓ విధంగా ఆమె అందగత్తె అనే చెప్పాలి. శశిధర్ ఆమెను ఎందుకు చేసుకోనన్నాడో అర్థంకాదు.

పోలీసులు వాళ్ళని శవం దగ్గరికి వెళ్ళనివ్వలేదు.

ఫోటోగ్రాఫరు, వేలిముద్రల నిపుణుడు తమ పనుల్లో మునిగి వున్నారు.

డాక్టరు పరీక్ష ముగించి లేచి కిరణ్ శ్రీనివాస్ లని

సమీపించి, "హెడ్ ఇంజరీ. ఇమ్మిడియేట్ డెత్. లారీ దెబ్బ, రోడ్ దెబ్బ కూడా తగిలాయి. వెంటనే ప్రాణం పోయింది" అన్నాడు.

ముసలామె దుఃఖంనించి కొంత తేరుకొన్నాక కిరణ్ ఆమెని పలకరించాడు.

"ఇతను మీ అబ్బాయి చైతన్యనా?" అని.

ఆమె పొంగిపొరలే దుఃఖాన్ని నిగ్రహించుకుంటూ "అవును బాబూ! మధ్యాహ్నం అన్నం తిని వెళ్ళాడు బిడ్డ. ఇప్పుడు యింకా యింటికి చేరకుండానే దారిలోనే దేవుడెత్తుకుపోయాడు" భోరున ఏడ్చేసింది.

"ఈ అమ్మాయి ఎవరు?"

"నా కూతురు విమల బాబూ! వీడు నా రెండో కొడుకు శేఖరం. టెన్త్ రాశాడు. వీళ్ళిద్దరి భవిష్యత్తు గాలికొదిలేసి తన దారి తను చూసుకున్నాడు."

"ఇలా అడుగుతున్నందుకు అన్యథా భావించకండి! మీకు శశిధర్ అనబడే బంధువు వున్నాడా?"

"ఉన్నాడండి! అసలు అతనికిచ్చి చెయ్యాలనుకున్నాం విమలని."

"మరెందుకు చెయ్యలేదు?"

"కట్నం ఆశ బాబూ! పదిహేనువేలు కట్నమడిగాడు. ఎక్కడనించి తెచ్చేది? మా వాడికి కంపెనీవాళ్ళు యిచ్చే జీతం మా కుటుంబ పోషణకే చాలదు. ఈ స్కూటర్ కూడా కంపెనీ వాళ్ళిచ్చినదే! ఇప్పుడు వున్న యీ ఒక్క ఆధారమూ పోయింది. మేమంతా వీధిన పడాల్సిందే!" ముసలామె కంఠం మళ్ళీ పూడుకు పోయింది.

ఆమెని యింకా కదిలించటానికి మనస్కరించ లేదు

కిరణ్‌కి.

శ్రీనివాస్ ఆమెకి శవాన్ని మార్చ్యురీవద్ద అప్పగిస్తానని చెప్పి పంపేశాడు. చైతన్య చెల్లెలు, తమ్ముడు తల్లి వెంట దుఃఖిస్తూ వెళ్ళిపోయారు.

శవాన్ని మార్చ్యురీకి తరలించాక స్టేషన్‌కి తిరిగొచ్చారు కిరణ్, శ్రీనివాస్‌లు.

4

యల్లమంద, జేమ్స్‌ల ఎలిబీలు ఎంక్వయిరీ చేశావా!?" అడిగాడు కిరణ్.

"ఆఁ, చెప్పటం మరిచాను. యల్లమంద రెండు రోజాలుగా షాపు తెరవటంలేదు. జేమ్స్ నిన్నమధ్యాహ్నం రెండు గంటలనుంచి రాత్రి పది గంటలవరకూ మాలాలీ లిక్కర్ ఫ్యాక్టరీలో వున్నాడని ఫ్యాక్టరీవాళ్ళు నిర్ధారణగా చెప్పారు."

"మరి యీ రోజు కలిశావా?"

"లేదు. ఈ రోజు కూడా ఫ్యాక్టరీకి పోయాడు. రాత్రి పదిగంటల కొస్తాడని వాళ్ళ చెల్లెలు లూసీ చెప్పింది."

"లూసీ ఎలాంటి పిల్ల? వెకిలిగా వుందా? శశిధర్ చెప్పిన లక్షణాలేమయినా...."

"నేను మాట్లాడిన పది నిమిషాల్లోనూ బాగా నే ప్రవర్తించింది మరి! ఆ సేపట్లో ఆమె గురించి యేం తెలుస్తుంది?"

"ఎంక్వయిరీ చేయకపోయావా?"

"మన పని జేమ్స్‌తోగాని ఆమెతో కాదుగదా అని చెయ్యలేదు."

"అదే పొరపాటు. శశిధర్ చెప్పిన విషయాలని

దృష్టిలో పెట్టుకుని అన్ని కోణాలనించి మన దర్యాప్తు చేస్తూండాలి. ఆ వీధిలోని వాళ్ళని కదిపి చూడాల్సింది. ఒకప్పుడు లూసీ శశిధర్‌ని అల్లరిపెట్టడం, జేమ్స్ కత్తి దూసి అతని యింటిమీద పడటం — ఇవన్నీ మనకి కావలసిన యిన్ఫర్మేషన్‌లో భాగమే కదా!"

శ్రీనివాస్ బుర్ర గోక్కున్నాడు.

"సరే, అనుమానితుల లిస్టులో మొదటివాడు యల్లమంద దొరకలేదు. ఇంటిదగ్గర ఎంక్వయరీ చేయించావా?"

"ఆఁ! వాళ్ళకీ తెలీదుట. మొన్న సాయంత్రం నించి యింటికొక్కడా రాలేదుట. షాపు కూడా తెరవటం లేదు."

"గుడ్! రెండో అనుమానితుడు చైతన్య శవంగా మారిపోయాడు. మూడోవాడు జేమ్స్‌ని ఫ్యాక్టరీ దగ్గర కలిసి ఎంక్వయిరీ చేసి వుండాల్సింది!"

"రాత్రి పదిగంటలకొస్తాడుగా! వెళ్దామా అప్పుడు?"

కిరణ్ అందుకు సమాధానం చెప్పకుండా "ఎర్ర రంగు బెంజిలారీ యెవరిదో వివరాలు సేకరించావా?" అన్నాడు.

"ఇంకా లేదు. యెవరిదో తెలియదు. నంబరు తప్పుగా రాసి వుండొచ్చు కదా!" అన్నాడు శ్రీనివాస్.

"ముందు మెసేజ్ పంపించు. లారీ సిటీ లిమిట్సులోంకి వెళ్ళిపోయి వుండదు. నా అనుమానం నిజమయితే దాన్ని ఏదో గరాజ్‌లో రహస్యంగా దాచి వుంచవచ్చు" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ సార్జంటు శివాన్ని పిలిచి చెప్పాడు.
ఇంతలో ఫోన్ గణగణ మోగింది.

శ్రీ ని వా స్ ఎత్తి "హల్లో క్రైం బ్రాంచ్" అన్నాడు.

మెసేజ్ వింటున్న శ్రీనివాస్ ముఖం గంభీరంగా అయింది. దవడ కండరాలు బిగుసుకున్నాయి.

ఫోన్ పెట్టేసి, "మరో యాక్సిడెంట్. లారీ ఆటోని కొట్టింది. ఆటో డ్రైవరు, ప్రయాణం చేస్తున్న ఓ యువకుడు చనిపోయారు స్పాట్ లోనే. లారీ దొరక్కుండా తప్పించుకుపోయిందట. ఎర్ర రంగు బెంజిలారీ. కానీ నంబరు మారిపోయింది. ఎ.ఎస్.వై. 4226. సార్జంటు రాజు ఫోన్ చేశాడు" అన్నాడు శ్రీనివాస్.

కిరణ్ కుర్చీలో నిటారుగా కూచున్నాడు.

"లారీ అదే. నంబరు ప్లేటు మా రి పో యిం ది" అన్నాడు కిరణ్. శ్రీనివాస్ తలపంకించాడు.

"కొంపదీసి హంతుడు జేమ్స్ కాదు గదా!" అన్నాడు శ్రీనివాస్ లేచి హేట్ సరిచేసుకుంటూ.

"స్పాట్ ఎక్కడా?" అడిగాడు కిరణ్.

"బేగం పేట రైల్వే క్రాసింగ్ దగ్గరగా" అన్నాడు శ్రీనివాస్ జీప్ లో కూచుంటూ.

కిరణ్ కూచున్నాక జీప్ కదిలింది.

జీప్ ని చూశాక గుంపు చెదిరింది.

ఆ దృశ్యం చూడగానే అర్థమయిపోయింది కిరణ్ కి యాక్సిడెంట్ చేసినది ప్రయత్నపూర్వకంగా నేనని.

ఆటో ముందు భాగం చిత్తయిపోయింది. డ్రయివర్ లోపలి ప్రయాణీకుడు ఆటో లోపలే నొక్కుకుపోయి రక్తం కక్కుకుని చచ్చిపోయారు. లారీ ఆటో వెనుక భాగాన్ని తొక్కేసి వెళ్ళిపోయింది. యాక్సిడెంటల్ గా జరిగివుంటే ముందు భాగం పాడయి వుండేది.

సార్జంటు రాజు శ్రీనివాస్ కి కాల్యూలేట్ చేసి, "హంతకుడి నెవరూ గుర్తించలేదు సార్! ఆటో డ్రయివర్ ఖాసిం అనే పేరుగల వ్యక్తి అని యిక్కడ చేరిన ఒక రిద్దరు ఆటో డ్రయివర్స్ చెప్పారు. ప్రయాణం చేస్తున్న వ్యక్తినే ఎవరూ గుర్తించలేదు" అన్నాడు.

మెడికల్ స్టోర్స్ యజమాని తను చూసిన విషయం చెప్పుకొచ్చాడు. "బేగంపేట మీదుగా సికిందరాబాదు వెళ్తోంది లారీ. సికింద్రాబాద్ నుండి బేగంపేట్ వైపుగా ఆటో వస్తోంది. యెవరూ ఊహించని రీతిగా చాలా అకస్మాత్తుగా ఏక్సిడెంటయిపోయింది సార్! ఆటో చివరి క్షణంలో సైడుకి తీయబోయాడు గాని, లారీ అందుకు స్కోప్ ఇవ్వలేదు" అన్నాడతను.

కిరణ్ అతనకి ధన్యవాదాలు చెప్పాడు.

శ్రీనివాస్ సిబ్బందికి సూచనలిస్తున్నాడు.

## 5

"హంతుడ్ని గుర్తుపట్టారు. అతడి పేరు రాఘవులు. జూనియర్ అసిస్టెంటుగా ఉద్యోగం" అన్నాడు శ్రీనివాస్.

"ఎక్కడా?" అడిగాడు కిరణ్.

శ్రీనివాస్ చెప్పాడు.

"హంతుడి పేరు కొత్తగా వుంది. శశిధర్ చెప్పిన లిస్టులో లేవట్టుందే!" అన్నాడు కిరణ్.

"హంతకుడు మాత్రం ఒకడే, అనుమానం లేదు. మైగాడ్, ఒక్కరోజు వ్యవధిలో మూడు హత్యలా? పైగా అలావాటు ప్రకారం చేసుకుపోతున్నట్టు ఒకదాని తర్వాత మరొకటి అన్నీ లారీ ఏక్సిడెంట్సే! వీటికి అంతూ దరీ వుందా అనిపిస్తోంది" అన్నాడు శ్రీనివాస్ శూన్యం

లోకి చూస్తూ.

"లారీ విషయం తొందరగా ఎంక్వాయిరీ చెయ్యి. బహుశా మూడు ఏక్సిడెంట్సుకీ ఒకే లారీ ఉపయోగించి వుండొచ్చునని నా అనుమానం" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ సార్జంట్స్‌ని పిలిచాడు.

కిరణ్ వాచ్ చూసుకుని, "పదిన్నరయింది. జేమ్స్ వచ్చివుంటాడు, పోదామా?" అన్నాడు.

శ్రీనివాస్ లేచాడు.

## 6

జేమ్స్ వుండే శాలివాహన నగర్ చేరారు కిరణ్, శ్రీనివాసులు.

జేమ్స్ అప్పుడే ఫ్యాక్టరీ నుంచి వచ్చాడు. పోలీసుల్ని చూసి వినయంగా ఆహ్వానించాడు.

కిరణ్ అతను తాగివున్నట్టు గ్రహించాడు.

"రవి చనిపోయాడు, ఆ విషయంలో మీతో కొన్ని విషయాలు మాట్లాడాలని వచ్చాం" అన్నాడు కిరణ్.

"అడగండి సార్!" అన్నాడు జేమ్స్.

"రవి యెలాంటివాడు? ఐమీన్, వ్యక్తిగతంగా! అతనికి గిట్టనివాళ్ళెవరున్నారు?"

జేమ్స్ వెంటనే, "రవి చాలా మంచిమనిషి సార్! అతని గురించి ఈ వీధిలో యెవర్నడిగినా చెపుతారు. తన పనేదో, తనేదో అన్నట్టుంటాడు. నాకు తెలిసి అతనంటే గిట్టనివాళ్ళు లేరు" అన్నాడు.

"అతన్ని ఎవరో యేక్సిడెంట్ చేశారని నిర్ధారణగా తెలిసింది. అతనితోబాటు శశిధర్ అనే అతని స్నేహితుడు కూడా బుల్లెట్ వెనక కూచుని వున్నాడు" అన్నాడు శ్రీనివాస్.

శశిధర్ పేరు వినగానే జేమ్స్‌లో వచ్చిన మార్పు గమనించాడు కిరణ్.

"అసలు శశిధర్ నే చంపటానికి చేసివుంటాడు సార్ యెవడో యేక్సిడెంటు! దురదృష్టవశాత్తు ఆ దెబ్బ మంచి వాడైన రవిని కొట్టేసింది."

"శశిధర్ నే చంపటానికి చేశాడని యెలా చెప్ప గలరు?"

"శశిధర్ వ్యక్తిగతంగా మంచివాడు కాదు సార్! రవికి స్నేహితుడిగా తగినవాడు కాదు."

"మంచివాడు కాదంటే....?"

"చెప్పకూడదు గాని, ఓసారి నా చెల్లెలిమీద చెయ్యి వేశాడు సార్! చాలా దుర్మార్గుడు."

"అప్పట్లో మీరతన్ని చంపబోయారని..."

"నో, నో, సార్! నేనలాంటి దుడుకు మనిషినికాదు. నా చెల్లెల్ని అలా చెయ్యొచ్చా అని అడగటానికి అతని గదికి వెళ్తే తనని చంపటాని కొచ్చానని పెద్ద రగడ చేశాడు సార్ శశిధర్!"

"అయితే మీరు కత్తి చూపించి బెదిరించిన విషయం నిజం కాదంటారా!?"

"కత్తి చూపించిన మాట నిజమే గాని, చంపాలని నా ఉద్దేశంకాదు సార్! మందలించాలనే అలా చేశాను" అన్నాడు జేమ్స్.

"మీ చెల్లాయి వున్నారా లోపల?"

"ఉన్నది సార్, పిలుస్తాను" అని లోపలికి చూసి "లూసీ!" అన్నాడు జేమ్స్.

ఇరవై రెండేళ్ళ యువతి బయటికొచ్చింది. చామన ఛాయల్లో నిండుగా వుంది. మెడలో శిలువతో వున్న

బంగారు ఛైయినుంది.

"మిమ్మల్ని ఓ విషయం అడగాలి. ఇదివరలో శశిధర్‌తో మీరు అసభ్యంగా ప్రవర్తించినట్టు, అతను మిమ్మల్ని మందలించినట్టు, తర్వాత మీ అన్నయ్య శశిధర్ మీద బలప్రయోగం చేయబోయినట్టు తెలిసింది. దానికి మీ సంజాయిషీ ఏమిటి?" అన్నాడు శ్రీనివాస్.

లూసీ ఏడుపు మొహం పెట్టింది.

"అంతా ఉత్తది సార్! అతనే నా వెంటబడి వేధించాడు. మా అన్నతో అతని గురించి చెప్పాను—అన్న బెదిరించాలని అతని గదికి వెళ్ళాడు. అంతే! దానికే అతను జనాన్ని పిలిచి పెద్ద యాగీ చేశాడు" అన్నదామె.

కిరణ్‌కి ఆమె మాటల్లో పూర్తిగా అబద్ధం లేదనిపించింది—మనిషి వెకిలిగా లేదు. మరి శశిధర్ చెప్పినదాన్ని బట్టి చూస్తే తప్పెవరిది?

"నిన్న మధ్యాహ్నంనించి సాయంత్రం ఆరుగంటల వరకూ మీ రెక్కడున్నారు?" అడిగాడు కిరణ్ జేమ్స్‌ని.

"నేను డ్యూటీలో వున్నాను సార్! 'బి' షిఫ్టు. మధ్యాహ్నం రెండు నుంచి రాత్రి పది. ఈ రోజు కూడా బి షిఫ్టే. ఓ అరగంట క్రితమే వచ్చాను" అన్నాడు జేమ్స్.

"శశిధర్ వుండేది యీ వీధిలోనే కదూ!"

"అవును సార్, అదిగో ఆ యిల్లే. పక్క యిల్లు రవిగారిది. ఈ రోజు ఉదయమే అతని భార్యని పుట్టింటివాళ్ళు తీసుకుపోయారు."

కిరణ్ లేచాడు—శ్రీనివాస్‌కి సైగ చేశాడు.

జేమ్స్, లూసీ నమస్కారాలు చేశారు.

కిరణ్ బయటికొచ్చాక, "ఈ చుట్టుపట్ల శశిధర్ గురించి కొంత యిన్ఫర్మేషన్ సేకరించాలి" అన్నాడు.

శ్రీనివాస్ కిరణ్ చెప్పిన సూచనలు విన్నాడు.

"శశిధర్ అబద్ధం చెప్పాడంటారా?"

"యేమో, చెప్పలేం. మనిషి నమ్మకస్తుడిలానే వున్నాడు. చైతన్య తల్లి చెప్పినదాన్నిబట్టి మాసే అత నికి డబ్బాశ వున్నట్టు తెలుస్తోంది. జేమ్స్, లూసీ చెప్పిం దాన్నిబట్టి అమ్మాయిల వెంటపడే గుణమున్నట్టు తెలు స్తున్నది. రవిలాంటి మంచి చరిత్ర వున్నవాడు శశిధర్ మంచివాడు కాకుంటే స్నేహం చేస్తాడా?"

జీపు పోలీసుస్టేషను దగ్గర ఆగింది.

కిరణ్ తన టయోటా స్టార్టుచేస్తూ "ఉదయం వస్తాను. నేను చెప్పిన విషయాలు యెంక్వయిరీ చేయించు" అన్నాడు.

## 7

నిద్రమంచంమీద నుండే ఫోన్ అందుకున్నాడు డిటెక్టివ్ కిరణ్. లైన్లో శ్రీనివాస్ వున్నాడు.

"లారీ కనిపించింది బ్రదర్!"

"ఎక్కడ?"

"దిల్‌షుక్‌నగర్ రోడ్‌న దొరికింది. దాంట్లో ఎవరూ లేరు. నంబరు ప్లేటు లేదు."

"లారీ వదిలేసినవాడు నంబరు ప్లేటు విషయంలో ఎందుకు జాగ్రత్త తీసుకున్నాడు?"

"ఏమో, అర్థంకాలేదు. వేలిముద్రల నిపుణుడ్ని పంపిం చాను. నువ్వు వస్తావా, వెళ్దాం."

"అసలు ఆ లారీయే అని యెలా నిర్ధారించావు?"

"బెంజ్ మెర్సిడెస్. ఎర్ర రంగు. మెడికల్ స్టోర్సు ఆసామిని, తీసుకెళ్ళి కన్ఫర్మ్ చేశాను. అంతే కాదు, లారీ టైర్లకు రక్తం నల్లగా అట్ట కట్టి అంటుకుని వుంది...."

"వెరీ గుడ్!"

"మరో ముఖ్యమయిన సమాచారం. యల్లమంద తిరి గొచ్చాడు. ఇప్పుడే అతన్ని స్టేషన్‌కి తీసుకొచ్చాను. ఎంత అడిగినా నిజం చెప్పటంలేదు."

"ఆల్‌రైట్ నే నొస్తున్నాను" అన్నాడు కిరణ్.

అలారం టైంపీస్ ఎనిమిది చూపిస్తోంది.

"అరె, బాగా పొద్దెక్కిందే!...." అనుకున్నాడు కిరణ్.

కిరణ్ టయోటా మరో అరగంటలో పోలీస్ స్టేషన్ ముందు నిలబడింది.

లోపల శ్రీనివాస్ యెవరో వ్యక్తిని నయానా భయానా ఏదో అడుగుతున్నాడు.

కిరణ్‌ని చూడగానే, "రా బ్రదర్! ఇతనే యల్లమంద. ఈ రెండురోజులూ తన అక్కగారింటికి వెళ్ళా నంటున్నాడు" అన్నాడు శ్రీనివాస్.

కిరణ్ ఆ వ్యక్తివంక చూశాడు. అతడికి దాదాపు ముప్పయ్యేళ్ళుంటాయి.

"మలక్‌పేటలోని ఆటోమొబైల్ రిపేరింగ్ షాపు నీదేనా?"

"అవును సార్!"

"గతంలో రవి, శశిధర్ అనే యిద్దరు స్నేహితులతో మోటార్‌బైక్ విషయంలో ఘర్షణ పడ్డావు అవునా?"

"అది ఎప్పటి సంగతో సార్! నేను పార్ట్సు మార్చేసి బిల్లు యెక్కువ చేశానని ఆయన నన్ను దొంగని చేసి మాట్లాడారు. నాకు బాధ తోచి బిల్లు యివ్వక్కర్లేదు, బండి తీసుకుని వెళ్ళమన్నాను సార్! అంతకు మించి ఏం ఘర్షణ లేదు. ఆ తర్వాత ఆ సంగతే పూర్తిగా మర్చి పోయాను సార్!"

"మొన్న, నిన్న నీవు వూళ్ళోనే వున్నావా?"

"లేను సార్! మా అక్కగారి వూరు జడ్చర్ల వెళ్ళి యీ తెల్లవారు ఝామునే తిరిగొచ్చాను. నేనొచ్చేసరికే నా గురించి పోలీసులు తయారుగా వున్నారు. వెంటనే నన్ను పట్టుకుని వచ్చారు."

"నువ్వు నిజంగా జడ్చర్లలోనే వున్నట్లు రుజువు చేసుకోగలవా?"

"చేసుకుంటాను సార్! అక్కడ భూమి తాలూకు కాగితాలు రిజిష్టరు చేయించాను సార్! రిజిష్టరాఫీసులో నేను సంతకాలు కూడా చేశాను. రెండు రోజులు ఆఫీసు చుట్టూ తిరిగాను. అందరూ సాక్ష్యమున్నారు."

"సరే, నువ్వు చెప్పిన విషయాలు అబద్ధమని రుజువయితే నీ సంగతి అంత తేలిగ్గా వదలం. ఆ విషయాలు తేలేవరకు నిన్ను కష్టడీలో వుంచుతాం" అన్నాడు శ్రీనివాస్.

యల్లమంద ఏడుపుముఖం పెట్టాడు.

ఇంతలో ఫోన్ మోగింది.

శ్రీనివాస్ ఎత్తాడు. "హల్లో!" అన్నాడు.

అవతలి నుంచి చెప్పిన విషయాన్ని వింటుంటే అతని భ్రుకుటి ముడిపడింది.

"అలాగా, ఇప్పుడే వస్తున్నాం" అన్నాడు ఫోన్

పెట్టేసి.

"హాస్పిటల్లో వున్న శశిధర్ మీద గతరాత్రి హత్యా ప్రయత్నం జరిగిందట. డ్యూటీ డాక్టరు ఫోన్ చేశాడు" అన్నాడు శ్రీనివాస్ కిరణ్‌తో.

కిరణ్ ఆశ్చర్యంగా చూశాడు.

"ఆ హత్యా ప్రయత్నం చేసిన వ్యక్తిని పట్టుకున్నారా?"

"లేదు. పారిపోయాడట. పోయి వివరాలు సేకరించి వద్దామా?"

"పద, వెళ్దాం."

ఇద్దరూ బయటికొచ్చి జీప్ ఎక్కారు.

ఉస్మానియా హాస్పిటల్ చేరారు.

# 8

శశిధర్ బెడ్ మీద అసహనంగా కదులుతున్నాడు.

పోలీసుల్ని చూడగానే లేచి కూచున్నాడు.

"ఏమిటి శశిధర్ గారూ! డాక్టర్ గారు ఫోన్ చేసి మీమీద హత్యాప్రయత్నం జరిగిందని చెప్పారు!?" అడిగాడు శ్రీనివాస్.

"అవును సార్! హంతకుడు నన్ను వదిలిపెట్టేలా లేడు. రవిని పొట్టనబెట్టుకున్నట్టే నన్నుకూడా మట్టుపెట్టడానికి కంకణం కట్టుకున్నాడు."

"ఏం జరిగింది చెప్పండి."

"నిన్న రాత్రి రెండుగంటల సమయంలో బాత్రూంకి వెళ్ళాల్సి లేచాను. బాత్రూంలో లైటు లేదు. చీకట్లో ఎవరో వ్యక్తి నిల్చుని వున్నాడు. నేను లోపలికివెళ్ళుండగానే కత్తి పుచ్చుకుని మీదపడ్డాడు. నేను కేకలు వేశాను. పక్కన పేషెంట్లు, డ్యూటీ నర్సు, డాక్టరు

పరుగెత్తుకు వచ్చారు. వాడు పారిపోయాడు. అంతటా వెతికారు. చిత్రంగా మిస్సయ్యాడు, అందరు చూస్తూండగానే!" చెప్పాడు.

అతడు చెప్పినదాన్ని తక్కిన పేషెంట్లు, డ్యూటీ నర్సు కూడా బలపరిచారు.

"మీరాగతన్ని గుర్తుపట్టారా?"

"గుర్తుపట్టాను. జేమ్స్."

"జేమ్సా? అంటే మీ వీధిలోని...."

"అవున్సార్, అతనే! అతనెప్పట్నుంచో నా మీద పగబట్టి వున్నాడు. మొన్న లారీ నడిపింది కూడా అతనే అని నా అనుమానం."

"చైతన్య అని అనుమానించారు కదూ!"

"కాదని యిప్పుడనిపిస్తోంది."

"మీ కీ విషయం తెలుసా? చైతన్యని ఎవరో హత్య చేశారు. అదీ లారీ ఏక్సిడెంటే!"

శశిధర్ నిర్ఘాంతపోయి చూశాడు.

"అలాగా? అగౌరే! ఎప్పుడు సార్!"

"నిన్న సాయంత్రం. అతనే కాకుండా రాఘవులు అనే మరో వ్యక్తిని కూడా లారీ ఏక్సిడెంట్లో చంపేశారు." చెప్పాడు శ్రీనివాస్.

శశిధర్ యింకా ఆశ్చర్యం నుంచి తేరుకోలేదు.

"ఇదంతా చూస్తూంటే అంతా ప్లాన్ చేసుకుని చేస్తున్నట్టుగా వుంది సార్! నా మీద జేమ్స్ ఎందుకింత కక్ష పెట్టుకున్నాడో అర్థం కాదు" నిట్టూర్చాడు శశిధర్.

"జేమ్స్ విషయం మేము తేల్చుకుంటాం. మీరు జాగ్రత్తగా వుండండి, ఎందుకయినా మంచిది" అన్నాడు శ్రీనివాస్. శశిధర్ యిద్దరికీ నమస్కరించాడు.

పది నిమిషాల తర్వాత బేగంపేట్‌లో వున్న రాఘవులు యింటికి వెళ్ళారు కిరణ్, శ్రీనివాసులు.

ఇంట్లో స్మశాన నిశ్శబ్దం తాండవిస్తోంది.

"ఈమె రాఘవులి భార్య. ఏమడగాలి?" అన్నాడు శ్రీనివాస్ ఓ పాతికేళ్ళ యువతిని చూపించి.

ఆమె లేచి నమస్కరించింది. భర్త వియోగంతో ఆమె బాగా డీలా పడిపోయింది. ముఖమంతా పీక్కుపోయి వుంది.

"చూడమ్మా. నీ భర్త నెవరో కావాలని హత్య చేశారు. నీ భర్తకు శత్రువు లెవరున్నారో, నువ్వు ఎవర్ని అనుమానిస్తున్నావో చెప్పు."

"నా భర్త యెవరికీ హానిచేసే మనిషి కాదు. ఎవరూ శత్రువులు లేరు. ఎవర్నని అనుమానించను?"అన్నదామె. ఆమె స్వరంలో నిర్లిప్తత, నిరాసక్తత కిరణ్ గమనించాడు.

"మీ యింటికి వీళ్ళలో యెవరయినా యెప్పుడయినా వచ్చారా?" అంటూ జేమ్స్ ఫోటోని, శశిధర్ ఫోటోని, రవి ఫోటోని విడివిడిగా చూపించాడామెకి కిరణ్.

ఆమె తల అడ్డంగా తిప్పింది రాలేదని. వాళ్ళ పేర్లు కూడా ఎప్పుడూ వినలేదని చెప్పింది.

"ఓ.కే! మీ భర్తగారి చావుకి కారకు లెవరో మీ కనుమానం లేదన్నమాట! మేం తెలుసుకుంటాం లెండి" అన్నాడు శ్రీనివాస్.

ఇద్దరూ పోలీస్టేషన్ కొచ్చేసరికి సార్జంటు శివం ఓ కొత్త విషయం చెప్పాడు.

"లారీ ట్రేస్ అయింది సార్! దాని ఓనరు కడియాల అప్పలకొండ అని పెద్ద బిజినెస్ మేన్. మొన్న

సాయంత్రం 4 గంటల సమయంలో లారీ నెవరో దొంగి లించారట. దాని విషయం రిపోర్టు కూడా చేశాడట" అన్నాడు శివం.

"నాకేమీ తలాతోకా అందటం లేదు. ఇప్పటివరకు యీ జరిగిన ఏక్సిడెంటు గురించి ఆలోచిస్తూంటే ప్రమాదవశాత్తు జరిగాయేమో ననిపిస్తోంది. మనమే కావాలని వాటిగురించి డీప్ గా పోయి తలనొప్పి తెచ్చుకుంటున్నామేమో!" అన్నాడు శ్రీనివాస్.

కిరణ్ మందహాసం చేశాడు.

"అంతలోనే నిరాశపడిపోకు మైడియర్ ఇన్ స్పెక్టర్! ఇవి క్లియర్ మర్డర్సు. ఓసారి సింహావలోకనం చేద్దాం. మొదటిది రవి మర్డర్. అవకాశాలున్న అనుమానితులు చైతన్య, యల్లమంద, జేమ్స్. కాని చైతన్యని కూడా యేక్సిడెంట్ కి గురిచేశాడు హంతకుడు. యల్లమందకు రిజిష్టరాఫీసు జడ్ చర్లలో తిరుగులేని ఎలిబీ వుంది.

ఇకపోతే జేమ్స్: అతనికి రవిని చంపాల్సిన అవసరం కనిపించదు. పోనీ శశిధర్ గురించి యేక్సిడెంట్ సృష్టించాడా అనుకుంటే, అసలు శశిధర్ కి హాని కలగలేదు.

అయితే చైతన్యని ఎవరు చంపినట్టు? జేమ్స్ కి, చైతన్యకు ఏమిటి కక్షలు? జేమ్స్ కి రాఘవులుకి ఏం కక్ష? రాఘవులి భార్య జేమ్స్ ని గుర్తుపట్టలేదు. అంటే రాఘవులు ఎవరో జేమ్స్ కి తెలీదు.

అంటే యీ మూడు హత్యలు, నాలుగో హత్యా ప్రయత్నం—ఒకే వ్యక్తి చేసినవి కాదని నిర్ధారించుకోవాల్సి వస్తుంది. కాని హత్యల కుపయోగించిన లారీ ఒకటే కాబట్టి, హంతకుడూ ఒకడేనని అనుకోవాల్సి వస్తోంది. ఏమంటావు?" అన్నాడు.

శ్రీనివాస్ రెండు అరచేతుల మధ్య తల యిరికించి "నాకు ఏమీ పాలుపోవటంలేదు. ఇప్పటిదాకా జరిగిన యీ ఏక్సిడెంట్లు ఏమిటో, వీటికి మోటివ్ ఏమిటో అర్థం కాకుండా వుంది" అన్నాడు.

"ఓసారి రవి భార్యని కలిసి కొన్ని విషయాలు సేకరించాలి. అడ్రసుందా?"

"ఆమె పుట్టింటివాళ్ళదేనా, రాసుకో. నేను రానా లేకుంటే...."

"అక్కర్లేదు. దగ్గరేగా, నే పోయొస్తాను" అన్నాడు కిరణ్.

# 9

"రండి సార్, ఏమైనా ఆమాకీ తెలిసిందా?"

"ఆఁ! జేమ్సుమీద మాకు అనుమానం వచ్చింది. తర్వాత మీమీద హాస్పటల్లో హత్యాప్రయత్నం చేశాడనగానే అనుమానం బలపడింది. అతనికి, చైతన్యకూ ఏమయినా మనస్పర్థలున్నాయా?" అడిగాడు కిరణ్.

శశిధర్ ఓ క్షణం ఆలోచించి, "గతంలో చైతన్యను కూడా ఓసారి నాలాగే ట్రాప్ చెయ్యబోయింది లూసీ. అతను కూడా ఆమెకు వార్నింగిచ్చాడు. జేమ్సుతో చెప్పి అతన్నికూడా కొట్టించబోయింది. ఆమెది చాలా చంచల స్వభావం సార్!" అన్నాడు.

కిరణ్ సాలోచనగా తలూపి, "అలాగా! అయితే ఆ రాఘవులుని ఎందుకు చంపాడో అర్థంకాకుండా వుంది" అన్నాడు.

"రాఘవు లంటే గుర్తొస్తోంది. తాలూకాఫీసులో జూనియర్ అసిస్టెంటుగా చేస్తాడు. అయనేనాండీ?" అన్నాడు శశిధర్ ఏదో గుర్తుకు తెచ్చుకుంటూ.

"అవునండి! మీకు తెలుసా....?" అన్నాడు శ్రీనివాస్.

"ముఖపరిచయముంది."

"ఆయనకు జేమ్స్‌కి ఏమయినా వ్యక్తిగత స్పర్థలున్నాయా?"

"ఉంటే వుండొచ్చునండి! అసలే జేమ్స్ తాగుబోతు. ఎప్పుడెలా ప్రవర్తిస్తాడో ఎవరికి విరోధి అవుతాడో అతనికే తెలీదు."

కిరణ్ శ్రీనివాస్ వంక తిరిగి, "ముందు వెంటనే జేమ్స్‌ని రిమాండ్ లోకి తీసుకో! జరిగిన హత్యలన్నిటికీ అతనే కారకుడని నిరూపించగల ఆధారాలు మన దగ్గరున్నాయి" అన్నాడు.

శ్రీనివాస్ వెంటనే, "ఎస్! ఇప్పుడే అరెస్టు చేయిస్తాను" అన్నాడు బయటికెళ్తూ.

# 10

రాత్రి పదిగంటలయింది.

శశిధర్ హాస్పిటలు బెడ్ మీద లేచి కూచున్నాడు.

మెల్లిగా బయటకి వచ్చాడు.

అయిదు నిమిషాల తర్వాత మెటడార్ వాన్ వచ్చి ఆగింది. ఎక్కి కూచున్నాడు. శరవేగంతో కాలివాహన నగర్ చేరింది వాన్.

జేమ్స్ యింటిముంది ఆగింది.

శశిధర్ వాన్ దిగాడు.

వీధంతా నిర్మానుష్యంగా వుంది. లోనికి అడుగులు వేశాడు. జేమ్స్ యింటి తలుపులు మూసి వున్నాయి. కాలింగ్ బెల్ నొక్కాడు. తలుపులు తెరుచుకున్నాయి.

లూసీ బయటికి తొంగిచూసింది.

"ఎవరూ?" అన్నది.

మెటడార్ వేన్ డ్రైవర్ గుమ్మం ఎక్కాడు. వెనుక నుంచి లూసీ నోరు నొక్కేశాడు. ఆమె గింజుకుంది. శశిధర్ ఆమె కాళ్ళవైపు పట్టుకున్నాడు.

డ్రైవర్, శశిధర్ లూసీని వేన్ లోపల పడేశారు. నోట్లో గుడ్డలు కుక్కారు. చేతులు వెనక్కి విరిచి కట్టారు.

వేన్ కదిలింది. ముందు కురికింది.

లూసీ గింజుకుంటోంది.

శశిధర్ నవ్వాడు. వికటంగా నవ్వాడు.

"ఏం, యిప్పుడు నీకెవడు తోడొస్తాడు? ఆ రోజు నిన్ను నేను కోరినందుకు నా మొహం మీద ఉమ్మేస్తావా? పెద్ద పతివ్రతలా కబుర్లు చెపుతావా? మీ అన్నను నా మీదకు కత్తి నిచ్చి పంపుతావా? నేనేనా అంత చేవ చచ్చినవాడ్ని!

సమయంకోసం కాచుకున్నాను. అవకాశం దొరికింది. మీ అన్నని హత్యకేసుల్లో యిరికించాను. నీకు ఈ రోజు మానభంగం తప్పదు. నేనొక్కడినే కాదు. పక్కన నా ఫ్రెండు వాసు కూడా ఉన్నాడు.

"వాసు ఎవరో నీకు చెప్పలేదు కదూ! ఎలాగూ కొద్ది నిమిషాల తర్వాత చస్తావు కదూ! నీకు చెప్పటంవల్ల ప్రమాదంలేదు. వాసు నాప్లాని విజయవంతంగా చెయ్యటానికి ఉపయోగపడిన బెస్టు ఫ్రెండు.

రవిని పైలోకానికి పంపించటానికి నా పథకాన్ని తు.చ. తప్పకుండా అమలుపరచిన మంచి మిత్రుడు. అయితే నాకు కూడా స్వల్పమైన గాయాలు తగిలాయనుకో! అది కూడా నా ప్లాన్‌లో ఓ భాగమే!

రవిలాగే నా దారికి అడ్డొచ్చిన మరో రాస్కెల్ చైతన్య. కావటానికి దూరపు బంధువే! అయితే, నన్ను చీప్ గా అల్లుడిగా కొట్టేయ్యాలని ప్లాన్ వేశాడు. నేను పదిహేను వేల కట్నం అడగ్గానే ప్లేటు ఫిరాయించేశాడు. వాడి మామ నాకు బాస్. వాడిచేత నన్ను ఆఫీసులో అనుక్షణం వేధింపచేశాడు. నన్ను డిస్మిస్ చేయించాలని చూశాడు. అందుకే వాడినీ పైలోకానికి పంపించేశాను. అప్పుడూ పాపం వాసు సాయపడ్డాడు.

అయితే అనుకోకుండా ఓ అమాయకుడ్ని కూడా పైకి పంపేయాల్సి వచ్చింది. వాడితో బాటు మరో అమాయకుడు కూడా చచ్చాడు. ఒకడు రాఘవులు. మరొకడు ఆటో డ్రైవరు. రాఘవులు చైతన్యకి బెస్టు ఫ్రెండు.

వాళ్ళిద్దరు నేను, రవి యాదగిరిగుట్టకు వెళ్ళిన రోజునే అక్కడికొచ్చారు. వాసు లారీ డ్రయివ్ చెయ్యటం రాఘవులు, చైతన్య చూశారు. రవికి, నాకు డాష్ కొట్టటం కూడా చూశారు. అందుకే ఆ విషయం పోలీసులకి ఎక్కడ చెప్పేస్తారోనని అర్జంటుగా చైతన్యని, రాఘవుల్ని కూడా వాసు అడ్డు తొలగించాడు. నేను హాస్పిటల్లో వున్నాను గాబట్టి, నన్నెవరూ అనుమానించే అవకాశమే లేదు.

ఇక మీ అన్న మిగిలాడు. వాడంటే నాకసహ్యం, ఎలర్జీ కూడా—అందుకే ఈ హత్యలన్నిటికీ మీ అన్నే మూలకారకుడని పోలీసుల్ని, డిటెక్టివ్ కిరణ్‌ని నమ్మించాను. ఈ హాస్పిటల్లో నామీద హత్యాప్రయత్నం చేసింది, జేమ్సు అని చెప్పాను. కాని ఆ అవతారం

ఎ తిండి కూడా వాసే. మీ అన్నను పాపం పోలీసులు అరెస్టు చేశారు. నువ్వు ఒక్కదానివీ యింట్లో మిగిలావు. అవకాశం దొరికింది. ఇద్దరం నిన్ను అనుభవించి ఆనక నీ శవాన్ని హుస్సేన్ సాగర్లో పారేస్తాం" వికటంగా నవ్వాడు శశిధర్.

వేన్ నిర్మానుష్యంగా వున్న ప్రదేశంలో ఆగింది.

"కేరీ ఆన్ వాసూ! వేన్‌లోనే మన పని కానియ్యాలి. ఎంతో కష్టపడ్డవాడివి నువ్వు. ఫస్టు ఛాన్సు నీదే! లూసీ నిజంగా చిలక కొరకని బంగినపల్లి మామిడిపండు. రుచి చూడు" అన్నాడు శశిధర్.

వాసు డ్రయివింగ్ సీట్లోంచి లేచాడు.

లూసీ మీద పడ్డాడు. లూసీ గింజుకుంది అరవబోయింది. నోట్లో గుడ్డలున్నాయి.

వాసు ఆమె చీర కుచ్చెళ్ళమీద చెయ్యి వేశాడు.

"ఫ్రెండ్స్‌వ్!" అని వినిపించిందో గంభీర స్వరం.

ఇద్దరు ఉలిక్కిపడి చూశారు. వేన్ సీటు అడుగు నుంచి బయటికి వచ్చాడు డిటెక్టివ్ కిరణ్.

"నీ పాపపు చరిత్ర నీ నోటితోనే చెప్పుకున్నావు మిష్టర్ శశిధర్! స్నేహమనే పవిత్ర పదానికి కళంకం తెచ్చే నిన్ను ఉప్పు పాతర వేసినా పాపంలేదు. కదలకు, కాల్చేస్తాను" అన్నాడు కిరణ్ రివాల్వర్ సూటిగా వాసు గుండెలకు గురిచేసి, శశిధర్‌ని కూడా కవర్ చేస్తూ.

కాని, ఊహించని రీతిగా వాసు ఒక్కసారిగా కాలితో కిరణ్ చేతిమీద తన్నాడు. రివాల్వర్ ఎగిరి వేన్ కిటికీలోంచి రోడ్ మీద పడింది.

శశిధర్, వాసు యిద్దరు కిరణ్ మీద పడ్డారు.

వాసు కిరణ్ చేతిని మెలితిప్పాడు. నరాలు కరకర

మన్నాయి. శశిధర్ కిరణ్ నెత్తిమీద యినప రాడ్‌తో కొట్టబోయాడు ఎడమ చేతితో. కిరణ్ కాసుకున్నాడు. మరుక్షణం మెరుపులా శశిధర్ మీద లంఘించి అతని కుడిచేతిని మెలితిప్పాడు.

చెయ్యి పూర్తిగా విరిగిపోయింది శశిధర్‌కు. కుయ్యోమని చావుకేక వేసి మొదలు నరికిన చెట్టులా కూలిపోయాడు.

వెనుతిరిగి వాసు పొత్తి కడుపులో గుద్దాడు కిరణ్ — వాసు లుంగచుట్టుకు పడిపోయాడు. అంతలోనే స్ప్రింగులా లేచి పొడవాటి కత్తిని తీసి కిరణ్ పొట్టలో గుచ్చబోయాడు.

కిరణ్ వెంట్రుకవాసిలో పోటు తప్పించుకుని వాసు ముఖంమీద రెండు చేతులను బిగించి కొట్టాడు. వంద టన్నుల బరువు తగిలినట్టు బాధతో మూలిగాడు వాసు. ముక్కు నుంచి రక్తం వరదలా కారింది. అదే అదనుగా మరో రెండు పిడిగుద్దులు ఛాతీమీద గుద్దాడు. వాసు నేలకూలిపోయాడు.

సరిగ్గా అదే సమయంలో ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్ తన బలగంతో వచ్చి చేరాడక్కడికి.

“కమాన్ ఇన్‌స్పెక్టర్! ఇదిగో కేసెట్టులో తనంతట తను తన సాహసకృత్యాలని రికార్డు చేసుకున్నాడు శశిధర్! టేకిట్” అంటూ అంతదాకా శశిధర్ లూసీతో చేసిన ప్రగల్భాల ప్రసంగాన్ని శ్రీనివాస్‌కి అందించాడు కిరణ్.

లూసీ, డిటెక్టివ్ కిరణ్‌కు కృతజ్ఞతలు తెలుపుకుంది.

“బ్రదర్, శశిధరే హంతకుడని ఎలా గ్రహించావు? నేనసలు శశిధర్ నేరస్థుడని కలనైనా ఊహించలేను”

అన్నాడు శ్రీనివాస్.

"నేనూ మొదట్లో అనుకోలేదు. కాని లూసీని ఇంటర్వ్యూ చేసినపుడు ఆమె మాటల్లోని నిజాయితీనిబట్టి శశిధర్ అబద్ధం చెప్పాడనిపించింది. ఆ లైన్లోనే ఆలోచించాను. రవిని హత్యచేయాల్సిన అవసరం ఎవరి కుందని ఆలోచిస్తే అది శశిధర్ కే వుందనిపించింది.

రవిని ఎందుకు హత్యచేశాడో మోటివ్ దొరికింది. అందుకే రవి భార్య పుట్టింటికి వెళ్ళి ఆమెనుంచి వివరాలు సేకరించాను. స్నేహితుడి భార్య అన్న జ్ఞానంలేకుండా రవి భార్యని కూడా పాడు దృష్టితో చూశాడట. ఆమె కోసం వలపన్నాడట. ఆమె మందలించేకొద్దీ ఆమెమీద వ్యామోహం పెంచుకున్నాడట.

రవిని అడ్డుతొలగిస్తే ఆమె తనదవుతుందని, వాసు సాయంతో యాదగిరిగుట్టనుంచి వచ్చేటప్పుడు ఏక్సిడెంట్ సృష్టించారు. తను కూడా ఏక్సిడెంట్లో చిక్కుకుంటే యెవరూ అనుమానించరని అతని ప్లాను. మెటడార్ వాన్ కూడా వాసు ఫ్రెండుది. ఏక్సిడెంట్ కాగానే ఆ వాన్ సరిగ్గా స్పాట్ కొచ్చి శశిధర్ని తీసుకుని హాస్పిటల్లో చేర్చి మళ్ళీ కనబడకుండా మాయమయింది.

అయితే, ఆ రోజు వాసు లారీ డ్రయివ్ చేస్తూండగా యాదగిరి గుట్టకు కాకతాళీయంగా అదే సమయానికి వచ్చిన చైతన్య, రాఘవులు చూశారు. అందుకని వాసు అర్జంటుగా వాళ్ళ అడ్డు తొలగించుకున్నాడు. హాస్పిటల్లో వుండటం శశిధర్ కు తిరుగులేని పటిష్టమైన ఎలిబీ. అందుకే ఎవరి అనుమానమూ శశిధర్ మీదికి పోలేదు.

"జేమ్స్ని అరెస్టు చెయ్యమని నీతో మాటమాత్రంగా అన్నపుడు శశిధర్ లూసీ గురించి ప్రయత్నిస్తాడని

ముందుగానే ఊహించాను. అలాగే జరిగింది. నిన్న కొంత దూరంలో వేన్ ని వెంబడించమని, నేను వాసు శశిధర్ లూసీని తీసుకొచ్చే సమయానికి వాన్ సీటుకింద దూరి వాళ్ళతో బాటు ప్రయాణం చేశాను. అతడు రెడ్ హాండెడ్ గా పట్టుబడిపోయాడు." అన్నాడు కిరణ్.

—: అ యి పో యి ం ది: —

సీరియల్

# విషసర్పిణి

## సికిందర్

ఒకటే హోరుగా కురుస్తోంది వర్షం....

ఆకాశం నల్లటి కంబళి కప్పేసినట్టు మహా గంభీరంగా వుంది.

కింద అల్లకల్లోలాన్ని సృష్టిస్తూ, నిశ్చలంగా వున్న కారు మేఘాలతో కుండపోతగా కురిపిస్తోంది వర్షాన్ని...

హెచ్చరిక ప్రకటించి ఎనిమిది గంటలు దాటిందప్పటికి—తుఫాను హెచ్చరిక.

ప్రకటించిన టైముకి రెండు గంటలు ఆలస్యంగా అయితేనేం, ప్రారంభమైంది, ఈదురు గాలులతో కూడిన కుంభవృష్టి!

గంటకు డెభై కిలోమీటర్ల వేగంతో వీస్తూన్న గాలితో, అరగంట నించీ ఏకధాటిగా కురుస్తూన్న వర్షానికి కింద రోడ్లూ, పల్లపు ప్రాంతాలూ ఇట్టే జలమయి పోతున్నాయి....

పదిగంటలు కాలేదింకా టైము—చలిచీముల్లా పుట్టుకొస్తున్న జనాభాతో ఇరవై నాలుగ్గంటలూ రణగొణ ధ్వనులతో కిటకిటలాడుతూ వుండే జంటనగరాలిప్పుడు, అంత జనాభానీ ఏవో మహాతీత శక్తి అదృశ్యం చేసినట్టు నిర్మానుష్యమై పోతున్నాయి ప్రాంతాలన్నీ ...

ఎండకి వెరవని వాళ్ళుండవచ్చు.

కానీ వర్షానికి తలదాచుకోని ప్రాణిలేదు.

ప్రస్తుతం ముక్కుతూ మూల్గుతూ, నడుములేని ముసలమ్మలా కదుల్తూ, ప్రకృతితో తీవ్ర పోరాటం జరుపుతూ సాగుతూన్న ఆటోలో, ఇరువైపులనించీ ఈడ్చికొడుతున్న ఈదురుగాలులకి గజగజ వణికిపోతూ, కసురుకుంటూ కష్టపెడుతున్న డ్రైవరుమీద విసుక్కుంటూ, ముడుచుకూర్చున్న సుహాసినికి, ఇంటికెప్పుడు వెళ్ళి పడతానా అని మహా ఆరాటంగా వుంది.

కానీ ఈ తీరున ఇంకో గంటయినా పడుతుందని ఆమెకు తెలుసు. తెలిసీ ఏమీ చేయలేని నిస్సహాయ స్థితిలో వుంది. అంతా ఈ డ్రైవరు చేతిలో వుంది.... ఇతను మాత్రమేం చేస్తాడు? ప్రచండంగా వీస్తున్న ఎదురు వాటం గాలి! వేగం పెంచలేదు. మలుపులు తిరిగినప్పుడు గాలి దిశ మారుతుంది. అది ప్రమాదకరమైన దిశ! ఏ మాత్రని వేగం పెంచినా బండితోసహా లేచిపోతారిద్దరూ! ఆమె తడిసి ముద్దయింది....

చెవుల్లోకిదూరే ప్రతి గాలి కెరటం, మంచుకైజారులా కోసేస్తోంది నిలువునా లోన! జివ్వున నరాలు చిట్లిపోయే బాధ! రక్తం గడ్డకట్టే పరిస్థితులు. ఒళ్ళు మంచుగడ్డయిపోతోంది. పళ్ళు విపరీతంగా శబ్దం చేస్తున్నాయి... ఎంత అదిమి పట్టుకుందామకున్నా వుండటంలేదు దవడలు. డొక్కు ఆటో! డొక్కు ప్రయాణం! తిట్టుకుంటోందామె. తను కారెందుకు తెచ్చుకోలేదూ ఇంటినుంచి? వెంటనే కారప్పుడు ఇంట్లోలేదని తట్టింది.... పోనీ తనిప్పుడే బయల్దేరకపోతే ఏం పోయింది? ఆమెకు వంటరిగా బయట గడపటం ఇష్టపడని తల్లిదండ్రులు మెదిలారు.

ఒంటరిగానా?

ఆమె ముఖం చిటపటలాడింది. ఇలా ఒంటరిగా వదలడానికి భయపడేవాళ్ళు, రేపు తనను కలలుగంటూన్న తన స్వేచ్ఛా జీవితాన్ని ఎలా అనుమతిస్తారు?

ఆమె ముఖం మ్లానమైంది.

పిడికిలి బిగిసింది.

లేదు, తన నిర్ణయం మారదు! అనుకుందామె. వాళ్ళకింకా తన ఉద్దేశ్యాలు చెప్పలేదు. అయితేనేం, ఆ సమయం వచ్చినప్పుడు తను తలొగ్గకూడదు! వాళ్ళు ఏడ్చి మొత్తుకున్నా, బెదిరించి బహిష్కరించినా, సరే, నిర్ణయం మార్చుకోకూడదు! ఇంకో మూడేళ్ళు. తన చదువై పోతుంది. అప్పుడు ఈ సంకెళ్ళన్నీ తెంచుకొని, స్వేచ్ఛా జీవియై, పాటుపడుతుంది—తన ఆశయాల్ని ఆచరణలో పెట్టే ప్రయత్నం కోసం! జీవితానికి తానివ్వాలనుకుంటున్న అర్థాన్ని ఆ విధంగానే ఇవ్వగలుగుతుంది.

అప్పుడు —

అప్పుడామె మనసు ఎలాగో అయిపోయింది.... అది గుర్తొచ్చినప్పుడల్లా ఇలాగే అయిపోతుంది.... నిర్మలంగా వున్న కొలనులో యెక్కడినుంచో వచ్చి పడ్డ రాయిలా అనిపిస్తాడా నరేన్! తనలో అలజడి రేపి, కకావికలం చేస్తాడు మనసుని!

తనకెంత అసహ్యం అతనంటే! ఎంత ఏవగింపు ఆ రకమైన వ్యవహారాలంటే! ఆ ఆలోచనల్నే ఛీత్కరించుకుంటుంది! అసలు తానీ ప్రేమా దోమా అనే భావాలకే స్పందించదు. అందరు అమ్మాయిల్లా మోహావేశాలకి లోనవదు. తనకేమీ అన్పించదు అబ్బాయిల్ని చూస్తే. అందరిలా సిగ్గుతో మొగ్గయిపోదు. వూహల్లో తేలిపోదు.

పిచ్చి చేష్టలు చేయదు. అతీతంగా వుంటుంది. వేళ్ళు తాకితే గుండె ఝల్లుమనదు. చూపులు కలిస్తే హృదయం పులకించదు. చిరునవ్వులకి చలించిపోదు. ఏమీ అవదు. ఏమీ కాదు. ఎందుకని?

ప్రేమికులంతా అనేదేమిటి! పుస్తకాల్లోనూ, సినిమాల్లోనూ చెప్పేదేమిటి? అదంతా ప్రేమికుల ఉన్మాదమూ, రచయితల పైత్యమేనా? లేక తనలో లోపమా?

లోపమా? ఆమె తత్తరపడింది. తనలో లోపమా? తను జడురాలా? స్త్రీ హార్మోన్‌లు తనలో తగినంత లేవా?

కాదు! బలవంతంగా ఈ ఆలోచనని దూరం చేసుకుందామె. కాదు, ఈ కారణంగా కాదు. తన ధ్యాసంతా జీవితాశయంమీదనే కాబట్టి నరేన్‌ని అలా తృణీకరించింది. అంతే కానీ....ఆ తృణీకరించిన విధానం మాత్రం జీవితాంతం తనని బాధిస్తుంది!

తను నరేన్‌ని అలా తిరస్కరించి వుండాల్సింది కాదు.

ఉలిక్కిపడి తేరుకుందామె. ఏమైంది?

ఆటో ఆగిపోయి వుంది. ఎందుకో తెలియదు.

"డ్రైవర్, యేమైంది?" అడిగిందామె వణుకుతూ.

డ్రైవర్ పలకలేదు.

"డ్రైవర్ ఏమైంది?" రెట్టించిందామె అసహనంగా.

అప్పుడు చూసిందా చీకట్లో....

డ్రైవరు కిరుప్రక్కలా ఇద్దరు. ఇద్దరి చేతుల్లో తెల్లగా మెరుస్తూ....

కలవరపడిందామె. యేమిటి? యెవరు వాళ్ళు? ఎందుకాపారు?

ఆ రెండు గొంతులు డ్రైవర్ని హెచ్చరిస్తున్నాయి.

చల్లటి చలికెరటానికి బదులు, అప్పుడు నులి వెచ్చటి

స్పర్శ తన కుడి చెంపకి సోకగానే తలతిప్పుతూ చూసింది సుహాసిని—అదిరిపడి కెవ్వుమని ఒక్క కేక వేసిందామె..

* * *

రామేశ్వరరావు ఉద్రేకంగా గదిలో పచార్లు చేస్తున్నాడు. ఒక్కచోట క్షణం ఉండలేకపోతున్నాడు. మధ్య మధ్యలో ఆగి భార్యమీద అరుస్తున్నాడు....

"బుద్ధి లేదు నీకు! నీ కసలు బుద్ధుందా? దాన్ని పూట పంపవద్దన్నానా వంటరిగా? నా మాటలు నీకేమయినా తలకెక్కాయా? చూడిప్పుడు నీ ముద్దుల కూతురేం చేసిందో!"

"అది నా ముద్దుల కూతురు కాదు, మీ గారాల పట్టి!"

"నోర్మూసుకో! సినిమా డైలాగులు వల్లించకు!"

"బర్త్ డే పార్టీయట! ఎవరా ఉత్తమురాలు? పుట్టి ఉద్ధరించేది లేదుగానీ, పార్టీలు చేసుకుంటారు! పార్టీలు! వీళ్ళ హిపోక్రసీ తగలడిపోను—బయల్దేరి గంటన్నరయిందట! ఎంతసేపు పడుతుంది యిల్లు చేరడానికి" అతను ఆవేశంగా ఫోను దగ్గరకు వెళ్ళాడు.

"ఎందుకంత కంగారుపడుతున్నారు, డాడీ? రాకుండా ఎక్కడికి పోతుంది, మీ చాదస్తం గాని!" అంతసేపూ వాళ్ళని పట్టించుకోకుండా సోవియట్ జర్నలు తిరగేస్తున్న సతీష్ అన్నాడు.

"నీకు చెల్లెలంటే ప్రేమానురాగాలు లేవు, నోర్మూసుకో!" అరిచాడు రావ్.

"అదిగో సినిమా డైలాగు—" అంది భార్య.

రామేశ్వరరావు గబగబా మరికొన్ని చోట్లకి ఫోన్లు చేసి నిరాశగా నిట్టూర్చాడు. "ఎక్కడా లేదు! యెవ

రింటికీ వెళ్ళలేదు! ఈ వర్షంలో ఎక్కడ చిక్కుకుందో—నేనే వెళ్ళి చూస్తాను!"

"ఆగండి డాడీ," అన్నాడు సతీష్. "మీరు ఎక్కడని వెళ్ళి వెతుకుతారు? ప్రయాణం కష్టమయితే యెక్కడ దిగిపోయిందో ....యే థియేటర్లో వెళ్ళి కూచుందో ...."

"అదేనా దాని బాధ్యత? ఫోన్ చేయక్కర్లా?" కసిరాడు రావ్ అక్కడ్నించి కదుల్తూ, "లేదు నే వెళ్ళి చూస్తాను. ఇలా చేతులు ముడుచుకుని కూచోలేను. నాకేదో.... నా కేదో.... కీడు శంకిస్తోంది సతీష్! యాక్సిడెంట్ జరిగివుంటే ఆటోకి?"

"పదండి డాడీ! నేనూ వస్తాను."

తండ్రీ కొడుకులు బయటి కరికారు ఆమెని వదిలేసి. ఆమె ఆందోళనగా వుండిపోయింది. సతీష్ కారెక్కి స్టార్టు చేశాడు. వర్షం తగ్గుముఖం పట్టింది కానీ గాలి ఇంకా అలాగే వుంది. ఆమె వచ్చే మార్గం పొడవునా వాళ్ళు చూసుకుంటూపోయారు. మధ్య మధ్యలో ఆగుతూ కనుక్కున్నారు. థియేటర్లలో కూడా అడిగి చూశారు. రెండుసార్లు యింటికి ఫోన్ చేశారు వచ్చిందేమోనని. రాలేదు. వాళ్ళకి నిరాశే మిగులుతోంది....

తండ్రీ కొడుకులు అలసిపోయి, కారాపేసి కూర్చున్నారు.

"ఏం చేద్దాం యిప్పుడు?" సతీష్ అన్నాడు ఆందోళనగా.

"ఏదో జరిగింది.... రాలేకపోతే ఫోన్ చేయకుండా అదింత బాధ్యతారహితంగా ప్రవర్తించదు. ఏదో జరిగింది సతీష్! ఇక మనం పోలీస్ రిపోర్టివ్వడం మంచిదను

వుంటాను."

"వద్దు డాడీ!"

"ఎందుకు వద్దురా?"

"చాలా గొడవవుతుంది. మన గౌరవం చూసుకోవాలి. సుహాసిని ఇప్పుడే పరిస్థితుల్లో వుందో — రేపు దాని స్నేహితులకీ, లోకానికీ తెలిసిపోతే తలెత్తుకో లేను! పోలీసులు వద్దు, డాడి! వీలయినంత రహస్యంగా గాలిద్దాం...."

"సతీష్, నే నాలోచించలేక పోతున్నాను.... దాని కేదయినా జరిగితే భరించలేనురా...."

"అలా అనుకోకండి డాడీ! ఏమీ జరగద నే ఆశిద్దాం. ముందు మనం ఒక చోటికి వెళ్దాం...."

"ఎక్కడికి?"

"డిటెక్టివ్ల దగ్గరికి...."

"డిటెక్టివ్లా!"

"అవును. వాళ్ళవల్ల ఏదీ పొక్కదు డాడీ! సుహాసిని ఎక్కడున్నా వెతికి వాళ్ళు తీసుకువస్తారు ఈ రాత్రికి. ముందు మనం ఇంటికెళ్ళి ఆమె ఫోటో తీసుకువద్దాం...."

కారు స్టార్టుచేశాడు సతీష్ వెంటనే.

"నాకేం అర్థం కావడంలేదు సతీష్. ఎవరా డిటెక్టివ్లు?"

వేగం పెంచుతూ చెప్పాడు సతీష్, "లాల్ అండ్ జాన్, డాడీ."

* * *

తార్నాకలో వుండే తన స్నేహితురాలు రూప ఇంటి నుంచి, హిమయత్‌నగర్‌లో తమ యింటికి చేరుకోవాలంటే సుహాసిని, సీతాఫల్ మండి, కవాడిగూడల

మీదుగా టాంక్‌బండ్ వచ్చి, అక్కడ్నించి లిబర్టీ వైపు తిరిగి రావాలి.

ఆమె ఎప్పుడూ ఉపయోగించే మార్గం ఇది. ఆమె తార్నాక నుంచి తొమ్మిదిన్నరకే బయల్దేరింది. అప్పుడే వర్షం మొదలయింది. సాధారణ వాతావరణ పరిస్థితుల్లో అయితే ముప్ఫైఅయిదు—నలభై నిమిషాల్లో చేరుకోవచ్చు. ఇవ్వాళ ఈ వర్షాన్నిబట్టి, గంట గంటన్నర యెక్కువ వేసుకున్నా ఆమె పదకొండున్నరలోపే చేరుకోవాలి. కానీ ఇప్పుడు అర్ధరాత్రి దాటుతున్నా జాడలేదు. ఎక్కడ్నించీ కబురు లేదు. ఆమె యెప్పుడూ రాత్రిళ్ళు చెప్పకుండా బయట గడపలేదు.

ఈ విషయాలన్నీ విని, ట్విన్‌సిటీస్ డిటెక్టివ్ ఏజెన్సీ పార్ట్‌నర్స్ లాల్ అండ్ జాన్‌లు, ఆ తండ్రీ కొడుకుల్ని సాలోచనగా చూశారు.

అప్పుడన్నాడు లాల్ సిగరెట్ వెల్గించుకుంటూ, "మీరు పోలీసు రిపోర్టు యివ్వకపోవడం మంచిది కాదు. ఈ పరిస్థితుల్లో మీ అమ్మాయికి ప్రాణాపాయం గురించి ఆలోచించాలి. ఆమె కింకేదో కీడు జరిగిందని యెందుకనుకుంటారు? పదండి, మనం ఇప్పుడు వెళ్ళి చూద్దాం...."

నల్గురూ లేచి బయటికి నడిచారు. జాన్ సుహాసిని ఫోటో జేబులో పెట్టుకుని, ఆఫీసుకు తాళం వేశాడు.

కిందికి వచ్చిన నల్గురూ డిటెక్టివ్‌ల కారెక్కారు. తండ్రీ కొడుకులు వెనక కూర్చున్నారు. జాన్ స్టార్టు చేసి పోనిచ్చాడు. లాల్ చెప్పాడు అతనికి: "రివర్స్ జర్నీ, పార్ట్‌నర్! టాంక్‌బండ్‌నించి తిన్నగా తార్నాక— మధ్యలో ప్రతి పోలీస్‌స్టేషన్ దగ్గరా ఆపు. అక్కడేవయినా రిపోర్టులందాయేమో చూద్దాం. కమాన్,

క్విక్!”

జాన్ వేగం పెంచి నిటారుగా కూర్చున్నాడు. కారిప్పుడు శరవేగంతో పోతోంది. లాల్ సిగరెట్ పీలుస్తూ ఆలోచనల్లో పడ్డాడు. తండ్రీ కొడుకులు మాట్లాడకుండా యెవరి ఆలోచనల్లో వాళ్ళు ఉద్రేకంగా గడుపుతున్నారు.

మళ్ళీ టపటపమంటూ చినుకులు ప్రారంభమయ్యాయి. పైన కారుమబ్బులు చాలా కిందినుంచి ఏదో అర్జంటు పని వున్నట్టు వేగంగా సాగిపోతున్నాయి. రోడ్డుమీద అక్కడక్కడ వాహనాలూ, మానవ సంచారముంది. నీటి కాలువ లింకా ప్రవహిస్తూనే వున్నాయి.

అలా వెళ్తోన్న కారు వెనుక నుంచి హెడ్‌లైట్లు పడ్డాయి. లాల్ తిరిగిచూశాడు. కొంతదూరంలో ఓ కారు కన్పించింది, వేగంగా వచ్చేస్తూ. జాన్ అది గమనించి, ఓవర్ టేక్ చేయబోతోందని యింకా వేగం పెంచాడు.

అకస్మాత్తుగా వెనుక సైరన్ వినిపించింది.

జాన్ ఉలిక్కిపడి ఇంకా వేగం పెంచేశాడు!

“ఏమిటి, పారిపోతావా? క్రిమినల్ వా? స్లోడవున్!?” అరిచాడు లాల్.

నాలిక కరుచుకుని స్పీడు తగ్గించేశాడు జాన్.

వెనుకనుంచి ఆ పోలీసుకారు రివ్వున ఓవర్ టేక్ చేస్తూ వెళ్ళి ముందాగింది.

తటాలున డోర్స్ తెరుచుకున్నాయి—

గభాల్న ఇద్దరు అధికారులు కిందికి దూకారు.

వాళ్ళు రివాల్వర్స్ చేతబట్టి పరుగెత్తుకొచ్చారు చెరోవైపున.

జాన్ అయోమయంగా చూశాడు వాళ్ళని.

"ఎవరు మీరు? యెక్కడ్నించి వస్తున్నారు? యీ కారు మీదేనా? కారులో యెవరెవరున్నారు? కమాన్, జోషీ! వెనుక సీట్లో ఎవరున్నారో చూడండి—" అరిచాడు జాన్ వైపున్న అధికారి.

లాల్ వైపు అధికారి వెనుక డోర్ దగ్గరికి కదిలి తొంగి చూశాడు. తండ్రీ కొడుకులు బిత్తర చూపులు చూస్తున్నారు.

"మాట్లాడరేం? ఎవరు మీరు? కమాన్, ఈ కారెక్కడిది?"

జాన్ వైపు అధికారి గర్జించాడు. జాన్ నోరు విప్పలేదు. తాపీగా సిగరెట్ తీశాడు.

లాల్ అతన్ని ఓరకంట చూశాడు.

"లేడీస్ యెవరూ లేరు!" వెనుక నున్న అధికారి అరిచాడు.

"ఎక్కడో వదిలేసి వుంటారు! కమాన్, గెడవున్!" జాన్ కళ్ళముందుకు రివాల్వర్ వచ్చింది.

అప్పుడు లాల్ అయిష్టంగానే లోపల లైటు స్విచ్ నొక్కాడు.

ఆ వెలుతురులో డిటెక్టివ్‌లు ఒకర్నొకరు చూసుకుని నవ్వుకున్నారు.

"మైగాడ్, లాల్ అండ్ జాన్!" రివాల్వర్ చూపిన అధికారి అరిచాడు.

"పార్ట్‌నర్స్ ఇన్ డిటెక్షన్" లాల్ అన్నాడు నవ్వుతూ.

"ట్విన్ సిటీస్ డిటెక్టివ్ ఏజెన్సీ..." జాన్ కూడా చెప్పాడు.

"ఓహ్, ఏమిటిది?"

"మీరే చెప్పండి, కృష్ణన్! ఏమిటీ హడావుడి?"

కృష్ణన్ లాల్ వైపు పరుగెత్తుకొచ్చాడు, "మేన్ హాంట్, మిస్టర్ లాల్! కవాడిగూడ నుంచి వైర్ లెస్. ఒక ఆటోడ్రైవర్ రిపోర్టిచ్చాడట—తన ఆటోని ఎవరో ముగ్గురు అటకాయించి, అందులో యువతిని తీసుకుపోయారని—"

"ఎక్కడ?"

"ఆ ప్రాంతాలే—కవాడిగూడ దగ్గర."

వాళ్ళెలా వున్నారు?"

"చూడలేదట. కత్తులున్నాయట ముగ్గురి దగ్గరా! డ్రైవర్ని కిందికిలాగి, తలమీద కొట్టి పడేశారట. ఆమెని తీసుకుని పారిపోయారట—"

"ఎందులో?"

"కారులో! వైట్ ఫియట్. డామిట్, మీ కారు చూసి అదేననుకున్నాను. నెంబర్ చూడలేదు—అనుమానంతో ఆపిచూస్తే మీరున్నారిందులో!"

"నెవర్ మైండ్. ఇంకా చాలా చోట్ల ఆపుతారు మమ్మల్ని. ఆ డ్రైవర్ స్టేషన్లోనే వున్నాడా?"

"ఉండొచ్చు, మీరు వెళ్తున్నారా?"

"వెళ్ళాలి. ఆ కారు నెంబర్ని డ్రైవరు చూశాడా?"

"లేదు—"

కామేశ్వరరావు అప్పుడు తేరుకుని కారు దిగేశాడు. అతను వేగంగా కృష్ణని చేరుకుని చేతులు పట్టుకున్నాడు: "ఏమిటిది ఇన్ స్పెక్టర్? ఏం జరిగింది మా అమ్మాయికి? యెవరు తీసుకెళ్ళారామెని? యెక్కడికి? యేం చేశారు, చెప్పండి!"

కృష్ణన్ అతని చేతిని తట్టాడు. "మీరు భయపడ

కండి. ఆమెని రక్షించే ప్రయత్నంమీదే వున్నాం."

రావ్‌కి ఏడుపు ముంచుకొస్తోంది. సతీష్ వెళ్ళి అతన్ని తీసుకొచ్చాడు.

"సో లాంగ్, లాల్."

"సో లాంగ్ కృష్ణన్."

జాన్ స్టార్టుచేసి కారుని వేగంగా పోనిచ్చాడు.

"మీ అమ్మాయి ఏం చేస్తోంది రావుగారూ, చదువుతోందా?" లాల్ అడిగాడు వెనక్కి చూస్తూ.

"అవును.... మెడిసిన్ నాలుగో సంవత్సరం, సర్."

"అరె ..." లాల్ యింకేమీ అనలేకపోయాడు.

"ఆమెని కాపాడాలి, మిస్టర్ లాల్! లేకపోతే నేను బ్రతకలేను!"

"డాడీ, ప్లీజ్ ........" సతీష్ వూరుకోబెట్టాడు తండ్రిని.

సెక్రటరియేట్ ముందు యింకో స్క్వాడ్ ఆపింది కారుని. డిటెక్టివ్‌లని చూసి, "అన్ని వైట్ ఫియట్స్‌ని చెక్ చేస్తున్నాం మిస్టర్ లాల్. పట్టుకోగలమన్న నమ్మకముంది!" అన్నాడా అధికారి.

రావ్ తల వంచుకుని గొణుక్కుంటున్నాడు.

జాన్ తిరిగి స్టార్టుచేసి పోనిచ్చాడు. "పార్ట్‌నర్ వీళ్ళిలా ఆపుతూపోతే మనం తెల్లారి చేరుకుంటామనుకుంటాను కవాడిగూడాకి."

"నాకు నమ్మకం లేదు...."అన్నాడు లాల్ దూరంగా చూస్తూ, "అదిగో మరో బ్లాకేడ్ ఎదురవుతోంది పార్ట్‌నర్. ఆ చెట్టుకింద....ఎవరు వాళ్ళు? స్లోడవున్, జాన్. రోడ్డు మధ్య నిలబడ్డారు వాళ్ళు...."

జాన్ వేగం తగ్గిస్తూ తీసుకెళ్ళి ఆక్క డాపాడు కారుని.

వెంటనే ఎనిమిదిమంది చుట్టుముట్టారు కారుని. వాళ్ళు పోలీసులు కారు. వాళ్ళందరి చేతుల్లోనూ ఆయుధాలున్నాయి, రివాల్వర్స్.

కుడిపక్క ఆగివుంది, ఒక బ్లూ కలర్ మెటడార్ వ్యాను.

వాళ్ళు రివాల్వర్ గురిపెట్టి కారులోకి తొంగి తొంగి చూస్తున్నారు. వాళ్ళందరి ముఖాలూ వికృతంగా భయంగొలిపేలా వున్నాయి. నోళ్ళనించి చింతవాసన కొడ్తోంది. డిటెక్టివ్‌లు రెప్పవేయకుండా చూస్తున్నారు, కదలకుండా కూర్చుని.

తండ్రీ కొడుకులిద్దరు ఒకర్నొకరు అంటుకుపోయి కూర్చున్నారు.

"అమ్మాయి ఏదీ?" అడిగాడు జాన్ వైపు మనిషి. అతన్ని చూశాడు జాన్, రెయిన్ కోటూ క్యాపుతో భారీగా, యెత్తుగా వున్నాడు. ముఖం కనిపించడం లేదు....

"ఏ అమ్మాయి?" జాన్ అన్నాడు తేరుకుని, ముందుకు జరిగి ఆ మనిషిని బాగా చూడాలని ప్రయత్నిస్తూ.

వెంటనే అతని తలకు రివాల్వర్ ఆనింది. "కదలకు, మిస్టర్! చేతులెత్తు. అందర్నీ చేతులెత్తమనండిరోయ్!" ఆజ్ఞాపించాడు రెయిన్‌కోటు మనిషి, తన అనుచరుల్ని.

వాళ్ళంతా రివాల్వర్స్ తలల కానించారు. అందరూ చేతులెత్తి కూర్చున్నారు.

రెయిన్ కోటుమనిషి ఎడమచేయి లోపలికి పెట్టి హెడ్‌లైట్స్‌ని ఆఫ్ చేసేశాడు. జాన్ లోలోపల నవ్వు

కున్నాడు అది చూసి—ఆ మనిషి చేతులకి గ్లవ్స్ లేవు.

అప్పుడా మనిషిని జాన్ స్పష్టంగా చూశాడు—పొడ వాటి ముఖం, మాసిన గడ్డం, అంత చురుగ్గా లేని కళ్ళు. ముసలి ఆకారం.

"ఇక ఆలస్యం చేయకండి, చెప్పండి! అమ్మాయి ఎక్కడ?"

"ఏ అమ్మాయి?" అదే ప్రశ్న వేశాడు జాన్, డ్రైవింగ్ మిర్రర్‌లో చూస్తూ. వెనకనుంచి యే వాహనమూ రావడంలేదు. రోడ్డంతా ఖాళీగా వుంది.

"మీ రెత్తుకొచ్చిన అమ్మాయి!" గద్దించా డా మనిషి.

"మేమెవరినీ యెత్తుకురాలేదు. మేమలా కనిపిస్తున్నామా?"

"తిన్నగా మాట్లాడకపోతే చచ్చిపోతారు. మా కా అమ్మాయి కావాలి."

"దేనికి?" అన్నాడు జాన్.

లాల్ తనవైపు వాడ్ని పట్టించుకోకుండా, రెయిన్ కోటువాడికేసి తిరిగాడు. "ముందు మీరు చెప్పండి, యెవరు మీరు? మీ కెందు కా అమ్మాయి? ఏమి టీ దౌర్జన్యం?"

"మేం సి. ఐ. డీ. లం. ఆ అమ్మాయిని గాలిస్తున్నాం."

"ఐ.సీ....సి. ఐ. డీలు మెటడార్ వ్యానేసుకుని తిరగడం నేను చూడలేదు."

"పద్ధతులు మారాయి, మారుతున్నాయి. ఏ కాలంలో వున్నారు మీరు?"

"మీ రే లోకంలో వున్నారు? క్రైంబ్రాంచిలో

మా మొహం ఎరుగని ఆఫీసరు లేడు. మమ్మల్ని యింకా గు ర్తించలేదా?"

"సారీ, నే నిక్కడ కొత్తగా ట్రాన్స్‌ఫరయ్యాను. మీ పరిచయ భాగ్యం కలగలేదు. మీ రెవరో సెల వివ్వండి...."

"లాల్ అండ్ జాన్."

ఆ మనిషి గడ్డం రుద్దుకున్నాడు, "బట్టల వ్యాపారాలా?"

"నో, తోళ్ళ వ్యాపారులం" చెప్పాడు జాన్.

"అయితే యిలా యెందుకు తిరుగుతున్నారు రాత్రి పూట?"

"తోళ్ళు వలవడానికి. మనిషితోలుకి మంచి డిమాండు వుంది ఆఫ్రికాలో."

"సరసాలాడకండి. ఆ అమ్మాయిని ఎక్కడ వదిలేశారో చెప్పండి, మిమ్మల్ని ఏమీ చెయ్యం."

కామేశ్వరరావు ఉద్రేకపడుతున్నాడు. సతీష్ తండ్రి చేయి బలంగా పట్టుకున్నాడు.

లాల్ సాలోచనగా తలూపాడు, "సరే పదండి, చూపిస్తాం" అన్నాడు.

రెయిన్‌కోటు మనిషి వెంటనే అన్నాడు, "నో, ఎక్కడుందో చెప్పండి, వెళ్ళి చూస్తాం" మీలో ఒకరు వస్తే చాలు."

డిటెక్టివ్‌లు చూపులు మార్చుకున్నారు—

అంతవరకూ ఎలాగో కూర్చోగలిగిన కామేశ్వరరావు, యిక ఉండబట్టలేక అనూహ్యంగా ఒక్క తోపు డోర్‌ని తోసి, అక్కడున్న రివాల్వర్ మనిషిని కింద పడవేస్తూ, కారు దిగేశాడు. దిగి రెచ్చిపోతూ రెయిన్‌కోటు మనిషి

దగ్గరికి ఉరికాడు. ఉరికి వెళ్ళి అతడి కాలరు పుచ్చు కున్నాడు. ఆ చెంపా ఈ చెంపా వాయించేస్తూ అరవ సాగాడు—

"ఎందుకు నీకు మా అమ్మాయి? ఏం చేస్తావామెని? ఎవరు మీరసలు? ఎందుకిలా బెదిరిస్తున్నావ్ మమ్మల్ని? చెప్పు—చెప్పు—చెప్పూ—"

జాన్ తటాలున డోర్ తీసి దిగబోయాడు. కానీ కింద పడ్డ మనిషి ఒక్క గంతులో లేచివచ్చి కంట్రోల్ చేశాడు, "డోంట్ మూవ్, ప్లీజ్!"

రెయిన్‌కోటు మనిషి తేరుకుని రావ్‌ని ఒక్క తోపు తోశాడు. అతను బాయ్‌నెట్ మీద పడగానే గొంతు పట్టుకుని లేపి గర్జించాడు. "ఏమిటి కూస్తున్నావ్, ఎవరా అమ్మాయి? ఏమవుతుంది నీకు? నిజం చెప్పు?"

"నా కూతురు! సుహాసిని నా కూతురు!"

సతీష్ దిగ్భ్రమపోయి చూస్తున్నాడు.

డిటెక్టివ్‌లంతా అలాగే చేతులెత్తి కూర్చున్నారు, జరుగుతున్నది నిస్సహాయంగా గమనిస్తూ.

రెయిన్‌కోటు మనిషి రావ్‌ని ఒక్కసారి వదిలేశాడు: "ఓహ్ .... పప్పులో కాలేశాం! శంకర్, పదండి చెక్కేద్దాం! రాంగ్ పార్టీని పట్టుకున్నాం. కారు నెంబర్ తెలియకపోతే ఇలాగే వుంటుంది తంటా! కమాన్, అందరూ వ్యానెక్కేసేయండి—లెట్స్‌గో!"

అనుచరులందరూ వ్యాను దగ్గరికి పరుగెత్తారు.

ఆ మనిషి డిటెక్టివ్‌లని చూసి, "సారీ, ఫ్రెండ్స్. మేం పొరబడ్డాం. అనవసరంగా మిమ్మల్ని కష్టపెట్టాం.... ఇక మీరు వెళ్ళిపోవచ్చు. కానీ ఒక్కమాట.... మీరా అమ్మాయికోసం ఇంక వెతకకూడదు!"

రావ్ అతని మీదికి ఉరికాడు, "వెతుకుతాం! గాలిస్తాం మా అమ్మాయిని! నువ్వెవరు వద్దనడానికి? నీకు మేమేం...."

రావ్ మాట పూర్తి చేయలేదు. అతను హఠాత్తుగా గుండె పట్టుకుని కిందపడ్డాడు, ఆ మనిషి కాళ్ళదగ్గర. ఆ మనిషి దూరంగా జరిగిపోయి డిటెక్టివ్ లకి గురిపెట్టాడు సైలెన్సర్ రివాల్వర్ ని: "చూశారా, చంపాను. సారీ, అతను ప్రతిఘటించేకష్టమవుతుంది మా పని. కూతుర్ని వెతక్కూడదతను. మీరూ వెతక్కూడ దిప్పుడు....మర్చిపోవాలి! ఓ.కే.?"

వెనుక సీట్లోంచి సతీష్ విసురుగా దిగేశాడు కిందికి. ఆ మనిషి అంతకంటే వేగంగా కదిలి అతన్ని లోపలికి తోసి డోర్ మూశాడు.

"గుడ్!" అన్నాడతను, "కింద రక్తంమడుగులో పడివున్న కామేశ్వరరావుని దాటి వస్తూ, ఫ్రెండ్స్, విన్నారా నా హెచ్చరిక? జాగ్రత్త, ఆమెని వెతుక్కోండి! ఆమెకోసం ప్రయత్నించవద్దు. ఇప్పుడు మమ్మల్ని వెంటాడి రాకూడదు. అందుకని...."

సైలెన్సర్ రివాల్వర్ తో కారు టైరుని బరస్టుచేశాడా ఘరానా రెయిన్ కోటు మనిషి.

• • •

గలగలమని గాలికి చెట్ల ఆకులు కదుల్తూన్న చప్పుడు వినిపిస్తోంది.... వాటిమీది నీటి బిందువులు చిటపటమని కారు టాపుమీద రాలుతున్నాయి.

ఆమె అప్పుడే కళ్ళు తెరచి చూస్తోంది.

ఆమె కళ్ళకు యీ ప్రపంచం ఎప్పటిలా అగుపించడం లేదు.

అసలు ప్రపంచమే వున్నట్లు ఆమెకు తోచడంలేదు.

తను చూసిన ఆ ప్రపంచం ఇదికాదు, ఇలా లేదు— అందులో యెన్నో స్వప్న సౌధాలున్నాయి, ఆశల శిఖరాలున్నాయి. ఏవీ అవన్నీ? ఏమయిపోయాయి తృటిలో?

పటాపంచలయ్యాయి! జీవితం ముక్కలయింది! ముక్కలు చింపినవి సరి అయింది! ఆమె వెక్కి వెక్కి ఏడ్వ సాగింది.... ముఖం చేతుల్లో కప్పుకొని.

కారు వెనుకసీట్లో ఆమె పరిస్థితి ఘోరాతి ఘోరంగా వుంది.

ఏడ్చి ఏడ్చి ఆమె కాస్సేపటికి తేరుకుంది. ఇంక శక్తి లేకపోయింది. ఏడ్చి ప్రయోజనంలేదు. ఇప్పుడు పరిష్కార మార్గం చూడాలి. తనిప్పుడు బ్రతికి యెందుకు? చచ్చి పోవాలి. ఏ ముఖంతో యింటికి తిరిగివెళ్తుంది? స్నేహితుల్ని చూస్తుంది? చావే పరిష్కారం. అవును, చావాలి! చచ్చిపోవాలి!

ఆమె దిగ్గున లేచి కూర్చుంది. కొన్ని క్షణాలు రెప్ప వేయకుండా, తీక్షణంగా చూస్తూ కూర్చుండిపోయింది యేమీ కన్పించని కారుచీకట్లోకి. ఆ సమయంలో ఆమె మెదడంతా శూన్యంగా వుంది. ప్రమాదంలోకి నడచి వెళ్తున్న స్లీప్ వాకర్‌లా, మరేదో అఘాయిత్యానికి పాల్పడబోయే మేనియక్‌లా ఆమె కళ్ళలో భావాలు కదుల్తోన్నాయి, భయం గొలిపేవి. ఆమె మెదడులో శూన్యత తొలగి తిరిగి అవే దృశ్యాలు కదుల్తో న్నాయి.

తను విస్తరి. వాళ్ళు కుక్కలు. మూడు కుక్కలు నువ్వా నేనా అన్నట్లు కొట్లాడుకున్నాయి తన కోసం.

తన నోటికి, చేతులకి అప్పుడు కట్లున్నాయి. కల్లు తాగిన కుక్కలు కారులో కుదేసి తనని ఇరుప్రక్కలా ఇద్దరూ, ముందు మరొకడుగా నడుపుకుపోయారు. ఎక్కడవి? తనని ఎక్కడికి తీసుకెళ్ళిందీ బాగా తెలుసు తనకి. ఆ దారి బాగా గుర్తుంది. అదొక పాడుబడ్డ కొంప. పెద్ద ఇనుప గేటు. భూతాల్లాంటి చెట్లు. ఏ నవాబో కట్టించి తన కాలం తీరిపోయాక దిక్కులేక శిధిలమైన సౌధమది. అందులో తుఫాను రాత్రిలో తనని ఆ మూడు కుక్కలు....

ఆ మూడు కుక్కలతో పాటు తను కూడా అప్పుడే ఆ శిధిల సౌధం కూలి సమాధి అయ్యేలా ప్రకృతి కరుణిస్తే బాగుండు నన్పించింది....

గుడ్డి లాంతరు వెలుగులో చూసిన ఆ కుక్కల ఆకారాలు యింకా కళ్ళముందు మెదుల్తూనే వున్నాయి....

ఏ కుక్కకి ఇరవైకి మించదు వయసు.

ఆ తర్వాత యేం జరిగిందో తనకు తెలియదు.

కళ్ళు మూతపడుతున్నప్పుడు మోటారుసైకిలు శబ్దం మాత్రం విన్నది. తననెవరో మోసుకుపోతున్నట్లు అనిపించింది....అంతే.

ఇప్పుడు చూస్తే తనిక్కడ వదిలివేయబడి వుంది.

ఆమె లేచుకుంది. పరస్పర భావ సంఘర్షణలో ఓ భావం గెలుపొందింది. ఆ భావం చండమారుతంలా ఆమెలో ఏదో తెలీని శక్తిని నింపింది. ఆమె నిలువెల్లా కంపిస్తూ వూగిపోయింది. పిడికిళ్ళు బిగించింది—ముఖ కండరాలు బిగుసుకున్నాయి. తనకు పరిష్కారం చావు కాదు. చావదు తను. చావదు తను. చావదు! అప్పుడే చావ కూడదు!

ఆమె లేచి ముందుసీటులోకి దూకింది. క్షణంలో కారుని స్టార్టు చేసి వాయువేగంతో ముందుకు పోనిచ్చింది....

అయితే ఆ కారు ఆమెకు అచ్చిరాదని తెలియదు.

వెనకనుంచి వెంటపడుతున్న పోలీసు కారుని చూసి బెదిరిపోయింది. మరింత....మరింత....మరింతగా వేగాన్ని పెంచేస్తూ, ఎవర్నీ దేన్నీ లెక్కచేయకుండా దూసుకు పోసాగింది....

వెనుక పోలీసు కారుకు మరో జీపు తోడయింది. సైరన్ మోతతో మార్గమంతా మారుమ్రోగిపోతోంది. అందులోని అధికారులు వైర్‌లెస్‌లో ఆగకుండా అరుస్తున్నారు. మార్గంలో ఎక్కడ పోలీసుస్టేషన్ వున్నా ముందే యెలర్టు చేస్తున్నారు. రోడ్స్‌ని బ్లాక్ చేయిస్తున్నారు.

కానీ ఆమె ధైర్యం చెక్కుచెదర లేదు. సెక్రటరియేట్ దగ్గర బ్లాకేడ్‌ని తన రాకెట్ వేగంతో దూరం నించే తప్పుకునేలా చేసింది, అదరగొట్టేస్తూ. ట్యాంక్ బండ్ మీద ఓ జీపుకు కీచుమని రాసుకుంటూ, దూసుకు పోయింది నిర్లక్ష్యంగా.

అప్పుడామెకు తనేం చేస్తోందో తెలీదు! ఎక్కడికెళ్తోందో తెలియదు! కంగారు! అయోమయం! భయం! లిబర్టీ వైపు తిప్పి బషీర్‌బాగ్ రోడ్డుపడుతూ, సరిగ్గా సైక్లైన్ రాగానే ఇహ ఈ కారుతో లాభం లేదని గుర్తించింది. సడన్ బ్రేకుతో కీచుమని ముఫ్ఫై అడుగుల దూరాన ఆపగలిగి, దిగి వురకసాగింది, మరెటూ చూడకుండా సైక్లైన్ రోడ్డులోకి తిరిగి....

◆ ◆ ◆

పొద్దు బాగా ఎక్కింది. ఇంకా సూర్యుడి జాడ లేదు తొమ్మిదవుతూన్నా.

ఆకాశం యింకా మేఘావృతమై వుంది. సన్నగా చినుకులు పడుతున్నాయి. రాబోయే పన్నెండు గంటల్లో, గంటకు తొంభై నుంచి నూటాపది కిలోమీటర్ల వేగంతో ఈదురుగాలులతో కూడిన భారీ వర్ష సూచన కూడా చేయడం జరిగింది రేడియోలో. బంగాళాఖాతంలో ఏర్పడ్డ వాయుగుండం, ఈ సాయంత్రం కోస్తా తీరాన్ని తాకే సూచనలున్నాయట....పదే పదే హెచ్చరికలు ప్రసారమవుతున్నాయి.

లాల్ కళ్ళు విప్పి చూశాడు. అవి ఎర్రబడి, అలసి పోయి వున్నాయి. ముఖం నీరసంగా వుంది. లేచి అతను కిటికీ దగ్గరికి వెళ్ళాడు.

“పార్ట్‌నర్స్, ఇప్పుడా క్రూక్స్‌ని పట్టుకోవడం సాధ్యమయ్యేలా లేదు. వాళ్ళు బోగస్ నెంబర్ ప్లేట్స్ పెట్టుకున్నారు. అవును, ఆ వైట్ ఫియట్‌లో సుహాసిని కిడ్నాప్ చేయబడిందని వాళ్ళకెలా తెలిసింది? ఆమె వాళ్ళ కెందుకు? ఎందు కామెకోసం అంతగా ప్రయత్నిస్తున్నారు? ఎవరు వాళ్ళసలు?”

లాల్ సందేహాల్ని జాన్ కూడా తీర్చలేడు, ఒక్కటి తప్ప; కిడ్నాప్ గురించి పోలీస్ ఇన్ఫర్మేషన్‌ని ఎవరో కరప్ట్ ఆఫీసర్ ఆ ముఠాకి అందించి వుండాలి....”

జాన్ ఈ సందేహం వెలిబుచ్చి, “పార్ట్‌నర్, దీన్ని మనం వెంటనే కృష్ణన్‌కి తెలియపర్చాలి. ఇంకా ఇలాంటి టిప్స్ వెళ్ళకుండా—కమ్యూనికేషన్స్ లీక్ గాకుండా ఎలర్ట్ చేయాలి. ఏమంటావు?” అన్నాడు.

వెంటనే ఆ ప్రకారం లాల్ ఫోన్ చేసి చెప్పాడు

కృష్ణన్ కి.

నిమిషాల్లో నగరంలో ప్రతి పోలీసుకీ తెలిసిపోయిం దీ విషయం. అంతే, అక్కడ్నించీ వాళ్ళలో ముసలం పుట్టింది. ఒకర్నొకరు అనుమానించుకోవడం మొదలు పెట్టారు. తమలో ఒకడు శత్రువులకి తోడ్పడుతున్న ఉద్యోగి వున్నాడు....ఎవరతను?

రాత్రి రామేశ్వరరావుని హత్య చేసి పారిపోయిన ముఠాకోసం సిటీ అంతటా వల పన్నారు పోలీసులు, డిటెక్టివ్ లనించి ఫోన్ కాల్ అందుకొని. కానీ ఆ వ్యాను జాడ ఎక్కడా దొరకలేదు.

హంతకుడి వేలిముద్రల కోసం, జాన్ సూచనపై, వాడు హెడ్ లైట్స్ ఆర్పినప్పుడు డిటెక్టివ్ ల కారులో డాష్ బోర్డుని పరీక్షించారు నిపుణులు. కానీ అతని చేతు లప్పుడు తడిసి వుండడంవల్ల వేలిముద్రలు యేర్పడలేదు.

కారుమీద యింకెక్కడా స్పష్టమైన వేలిముద్రలు లేవు.

తెల్లవారుఝామున మూడుగంటలకి—బషీర్ బాగ్ లో పెట్రోలింగ్ చేస్తున్న ఒక పోలీసు వ్యానుకి, కిడ్నాపర్స్ ఉపయోగించిన వైట్ ఫియట్ కంటపడింది.

క్షణాలమీద నిపుణులాక్రమించి దానిమీద శల్య పరీక్షలు జరిపారు. వేలిముద్రలు చాలా దొరికాయి. రికార్డ్సుతో సరిపెట్టారు. అవి పాత కేడీలు నాగేష్, మల్లేశ్, రమేష్ లవని తేలింది. వెంటనే వాళ్ళకోసం గాలింపు మొదలయింది. కానీ ఈ మధ్య వాళ్ళ అడ్రసు మారిన సంగతి ఇంకా పోలీసులకి తెలియదు. గాలిస్తూనే వున్నారు వాళ్ళకోసం అలా....

పోలీస్ కంట్రోల్ రూంలో ఆపరేటర్ కో కాల్

అందింది: గ్రీన్ అంబాసిడర్, నెంబర్ ఎ.పి.టి. 9698, క్వారీ కాంట్రాక్టర్ వరవరరావుకి చెందింది. ఉదయం యెనిమిదింటికి అతని యింటి ముందు నించి మాయమయిందని.

రాత్రి సెక్రటరీయేట్ దగ్గర బ్లాకేడ్‌ని ఛేదించుకొని, టాంక్‌బండ్ మీద అధికారిని పడగొట్టి వెళ్ళిపోయిన వైట్ ఫియట్‌లో యువతి సుహాసినియే అని ధృవపడింది అందరికీ. అయితే ఆమె బషీర్‌బాగ్‌లో కారు వదలి ఎటు పారిపోయిందీ తెలుసుకోలేకపోతున్నారు.

అదే సమయంలో సుహాసిని తల్లి కాంత నరకం అనుభవిస్తోంది, సంగతులేవీ తెలీక! రాత్రినించీ వెళ్ళినవాళ్ళ జాడ లేదు—ఆమెకి పిచ్చెత్తినట్లుంది!

అలా గడుపుతున్న సమయంలో హఠాత్తుగా ఫోన్ మోగి ఆమె గుండె లదరగొట్టింది! గబుక్కున వెళ్ళి అందుకుంది ఆరాటంగా.

అవతలి గొంతు తుప్పుగా పలికింది: "అమ్మా, నేనిక ఇంటికి రాలేనమ్మా."

అదిరిపడిందామె, "సుహాసినీ!" కేక పెట్టింది.

"క్షమించమ్మా, మీ అందర్నీ వదిలి వెళ్ళిపోతున్నాను...."

"అయ్యయ్యో....సుహాసినీ! ఏం మాటలే అవి! ఎక్కడున్నావు నువ్వు? యేం జరిగింది నీకు? నాన్న రాలేదా? అయితే నాకు చెప్పు, ఎక్కడ్నించి మాట్లాడుతున్నావు? వెంటనే వచ్చేస్తాను....ఇప్పుడే...."

"నన్నిక మర్చిపోమ్మా."

"సుహాసినీ! అయ్యో, పిచ్చిదానా...."

"నన్నిక మర్చిపోమ్మా."

క్లిక్ మంది అవతల,

శాంత కొయ్యబారిపోయింది, చేతిలో రిసీవర్ వదిలేస్తూ.

* * *

సరిగ్గా ఉదయం పదకొండు గంటలకి తిరిగి బస చేరుకున్నారా ముగ్గురు.

ముగ్గురూ యెవరి ఆలోచనల్లో వాళ్ళున్నారు. ఆ గదిలో ఒక మూల చాపమీద కూర్చుని, పొట్లాలు కట్టి తెచ్చుకున్న పరోటాలు ఆరగించసాగారు....బీరు సేవిస్తూ నిషా తల కెక్కుతూంటే అప్పుడు నోరారా వదరసాగారు. రాత్రి తాము పొందిన అనుభవం గురించి అసభ్యంగా మాట్లాడుకోసాగారు.

నాగేష్‌కి ఇరవై ఏళ్ళుంటాయి. మల్లేశ్, రమేష్‌లకి పదెనిమిది వుంటాయి. వాళ్ళు ముగ్గురూ తమ పాత నార్టన్ మోటార్ సైకిలుమీద పగలల్లా తిరుగుతూ, రాత్రికి ఎవరో ఒక భామతో బసకి చేరుకుంటారు, డబ్బు పెట్టి; డబ్బు లేనప్పుడు సభ్య స్త్రీలమీద అఘాయిత్యాలకి పూనుకుంటారు. అప్పుడే వాళ్ళు యెన్నో ఏళ్ల జైలు జీవితాన్ని చవిచూసినా, అందులోంచి నేర్చుకొన్న పాఠం యేమీ లేదు. కొన్నాళ్ళు జైలు, కొన్నాళ్ళు జల్సాలు, వాళ్ళ జీవితాల్లో భాగాలైపోయాయి.

నాగేష్ వాగుతున్నాడు బీరు సేవిస్తూ, "రాత్రి........ ఆహాఁ, రాత్రి బలే మజా చేశాంరా, మల్లేశూ!"

"ఇంకెప్పుడూ అలాటిదే కావాలంటాను, యేమిట్రా రమేషూ?" అడిగాడు మల్లేశ్.

రమేష్ విశారంగా నవ్వాడు: "ఆ పోరి....రాత్రి పోరి బలే రంజాగా వుంది గానీ....ప్చ్, అనవసరంగా

అప్పుడే వదిలేశాం! అసలిక్కడే వుంచుకుంటే ఈ పగలంతా కూడా మజా చేసేవాళ్ళం కదా—"

"సరిగ్గా చెప్పావు, రమేష్టూ!" మల్లేశ్ అందుకున్నాడు, "ఓహ్, బజారుపోర్లతో బేజారై పోయాను, గురూ! పుణ్యాని కొచ్చిన సరుకు.... దేనికి వదులుకున్నాం అప్పుడే?"

"ఊరుకోరా, బాధపడకు" నాగేష్ చెప్పాడు, "ఇవ్వాళ మరో మంచి పోరిని ఎత్తుకొద్దాం. కనీసం వారంరోజులు దున్నేద్దాం!"

"ఓకే! మార్వాడీ పోరిని తెద్దాం బాస్. బలే పూరి, రంగు తేలి వుంటారు....

సుమారు అరగంట తర్వాత ముగ్గురూ లేచి బయట కొచ్చారు. వర్షం కొద్దిగా పెరిగింది. వాళ్ళేం పట్టించుకోకుండా వెళ్ళి నార్టన్ యెక్కారు. పూరిమీదికి బయల్దేరారు.

నాగేష్ స్టార్టుచేసి నడుపుతున్నాడు. మిగతా ఇద్దరూ వెనుక కూర్చున్నారు. అప్పుడు బైక్ గేటుదాటి బయటికి రాగానే, అదే సందులో చివరగా ఆగివున్న గ్రీన్ అంబాసిడర్ కారు, చిన్నగా కదిలింది దాని వెనుక.

మోటర్ సైకిల్ నిదానంగా వెళ్తుంది.

వెనుక వస్తూన్న కారుని చాలాదూరంవరకూ చూసుకోలేదు వాళ్ళు. వాళ్ళెంత తాపీగా పోతున్నారో, అంతకంటే నిదానంగా వెంబడిస్తోందా కారు, ముప్పై అడుగుల దూరంలో.

చాపెల్ రోడ్ నుంచి చాదర్ ఘాట్ వైపు తిరిగే వరకూ అలాగే ప్రయాణించారు వాళ్ళు ముగ్గురూ. ఆ కారు అలాగే వస్తోంది వెనుక. అప్పుడెందుకో మల్లేశ్

వెనక్కి తిరిగి చూశాడు. అతని కళ్ళు ఎగిరిపడ్డాయి. తల గట్టిగా విదిలించి మళ్ళీ చూశాడు. అదిరిపడి ఒక్క అరుపు అరిచాడు, "బాస్! వెనక్కి చూడు!"

"ఏమయింది?...." రమేష్ అన్నాడు వెనక్కి తిరుగుతూ.

"ఆ కారులో చూడు...." చూపించాడు మల్లేశ్.

"అరె బాప్రే..." నోరు తెరిచాడు రమేష్. "సుహాసిని!"

నాగేష్ వేగం తగ్గిస్తూ వెనక్కి చూసి, "ఏమిటి.... యేం జరిగింది?" అన్నాడు. అతనికళ్ళు ఉలిక్కిపడ్డాయి. గాభరాగా ఏక్సిలేటర్ తిప్పేశాడు. వేగం పుంజుకుంది మోటర్ సైకిల్.

"ఆపకు! ఆపకు! పోనివ్వు! స్పీడ్!" వెనుక నుంచి మల్లేశ్ అరిచాడు.

నాగేష్ యింకా వేగం పెంచడంతో, వెనుక అంబాసిడర్ వేగం కూడా పెరిగిపోయింది. రెండూ ఇసామియా బజార్ లో పరుగెడుతున్నాయి, ఆ ట్రాఫిక్ లో.

అంత వేగంతో దూసుకొస్తున్న ఆ రెంటినీ చూసి ఎదురొస్తున్న వెహికల్స్ పక్కకు తప్పుకుని ఆగిపోతున్నాయి. జనం పేవ్ మెంట్లమీదికి దూకేస్తున్నారు. వెనుక నుంచి యిద్దరు తొందరపెడుతూంటే, నాగేష్ పిచ్చిగా ట్రాఫిక్స్ రూల్స్ని ఉల్లంఘించి తోలుతున్నాడు. ట్రాఫిక్ ఐలాండ్ దగ్గర వీళ్ళ ట్రిపుల్ రైడింగ్ చూసి ఆపబోయిన ఓ పోలీసు పక్కకు పారిపోవలసి వచ్చింది.

అంబాసిడర్ అంతకంతకూ దగ్గరయిపోతూంటే, వాళ్లు వెర్రికేకలు వేస్తూ విన్యాసాలు చేస్తున్నారు. అప్పటికే

అవి రెండూ ఇసామియా బజార్ దాటేసి కోఠీవైపు పరుగుతీస్తున్నాయి....

కోఠి సెంటర్ దాటేసి బ్యాంక్ స్ట్రీట్ లో పడ్డాయి రెండు వాహనాలూ. వాళ్ళు వెనక్కి తిరిగి తిరిగి చూస్తూ అరుస్తోంటే, ట్రూప్ బజార్ ట్రాఫిక్ పోలీస్ స్టేషన్ ముందు ఓ అధికారి అడ్డుకోబోయాడు.

ఆ అధికారి మోకాలు విరిగింది.

ఎదురొచ్చే సైకిళ్ళని, రిక్షాలని, ఆటోలనీ ఢీకొట్టుకుంటూ యెవర్నీ దేన్నీ లెక్క చేయకుండా స్వైర విహారం చేస్తున్న ఆ రెండు వాహనాల్నీ చూసి ఆబిడ్స్ సెంటరులో పోలీసులు ఉద్రిక్తులయ్యారు.

మోటర్ సైకిల్ ఫట్-ఫట్-ఫట్-మని చూస్తుండగానే అడ్డుకోబోయిన ఇద్దరు అధికారుల్ని పక్కలకి విసిరేసి మాయమైంది.

అంబాసిడర్ ధడాలున ఒక పోలీస్ మోటార్ సైకిలుకి గుద్ది, నెహ్రూ స్టాచ్యూ కేసి విసిరేస్తూ దూసుకెళ్ళింది.

రెండూ గన్ ఫౌండ్రీవైపు అనుమతిలేని ఆన్ కమింగ్ వన్ వే ట్రాఫిక్ లో పడ్డాయి. పడుతూనే అడ్డదిడ్డంగా ఎదురొచ్చే ప్రతివాన్నీ సర్దేస్తూ నిర్లక్ష్యంగా పరుగెత్తసాగాయి. వెనకనించి అనుచరుల అరుపులకి పట్టువిడవని విక్రమార్కునిలా హేండిల్ చేస్తున్నాడు నాగేష్, బైక్ని.

వెనుక అంబాసిడర్ వాళ్ళకి భూతంలా కన్పిస్తోంది.... క్షణ క్షణానికీ దగ్గరయి పోతూంద....క్షణానికి కొన్ని అంగుళాల చొప్పున తగ్గిపోతోంది దూరం.

అంబాసిడర్ భూతం వేటకుక్కలా తరుముతోంది

వాళ్లని....ఆ సమయంలో వాళ్ళేం చేస్తున్నారో వాళ్లకే తెలియదు. పడుతూ లేస్తూ, దారీ దిక్కూ తోచక, ప్రాణాలు రక్షించుకోడానికి, అంబాసిడర్ భూతాన్నించి దూరం దూరంగా తప్పించుకోడానికి విశ్వ ప్రయత్నం చేస్తున్న ఆ క్షణంలో....

హఠాత్తుగా దురదృష్టం ఎదురైంది వాళ్లకి.

వెనుక అంబాసిడర్ భూతాన్ని వదిలించుకుందుకు తాజ్ హోటల్ వైపు మలుపుతీసుకోవాలని నాగేష్, కుడివైపు ట్రాఫిక్ ఐలాండ్‌ని రూలు ప్రకారం దాటించబోయాడు—ఆ క్షణంలో అతడి మెదడు పని చేయలేదు.

వాళ్లలా చుట్టూ తిరిగేలోగానే వెనుక నున్న అంబాసిడర్ భూతం యిటు నుంచి తిరిగి వాళ్ల కెదురొచ్చేసింది....

బెదిరిపోయి చేతులు వదిలేసిన నాగేష్‌తో బాటు అతని అనుచరుల్ని బైక్‌తో సహా అడ్డంగా నెట్టుకుంటూ వెళ్ళి కాంపౌండ్ గోడకి వత్తేసింది. ఠాప్-ఠాప్-పట పట-ధడ్ ధడ్-కెవ్వు కెవ్వుమన్న శబ్దాలతో మార్మోగిపోయిందా ప్రాంతం.

ముగ్గురూ నలిగి పచ్చడయ్యారు, గోడకీ కారుకీ మధ్య.

అంటించిన పోస్టర్స్‌లా వుండిపోయారు గోడల కలాగే.

కారు వెనక్కి జరిగితే తప్ప వాళ్ల శవాలు రావు.

కారు మరి కదల్లేదు, ఇంజనాఫ్ అయింది.

ఇక పూర్తి విశ్రాంతే నన్నట్టు నిలబడిపోయింది. వెనుక నే పోలీసు వాహనాలు సైరన్‌లు వూదుకుంటూ వచ్చి

ఆగాయి.

భీభత్సాన్ని చూసి అరిచే జనం, ఆగిపోయే వాహనాలు, విజిల్స్ ఊదే అధికారులతో క్షణాలమీద కల్లోలమైందా ప్రాంతం.

అప్పుడా గుంపులోంచి ఒకతను వేగంగా బయటికొచ్చాడు. అతను అటు యిటూ చూసుకుంటూ గబగబా హోటల్ గేటుదగ్గర కొచ్చాడు. అక్కడ సైకిలుతో నిల్చున్న మనిషికేదో చెప్పాడు. ఆ మనిషి తలూపి సైకిలిచ్చేశాడు.

సైకిలు తీసుకున్న మనిషి దానిమీదెక్కి తొక్కుకుంటూ వెళ్ళిపోసాగాడు.

అతనెక్కడా ఆగకుండా ఉద్రేకంగా. ఆరాటంగా తొక్కుతూ రాంకోట్‌లోని జైహింద్ కేఫ్‌కి చేరుకున్నాడు. సైకిలు బయట నిలిపి లోపలికి పరుగుతీశాడు విసురుగా. కౌంటర్‌లో బిజీగా వున్న సేట్‌ని విష్ చేసి టెలిఫోనెత్తాడు. చక చకా ఒక నెంబర్ తిప్పి, రెస్పాన్స్ రాగానే మాట్లాడసాగాడు తగ్గుస్వరంతో....

* * *

"ఎందుకు నువ్విలా చేశావ్?"

ఆమె చెప్పలేదు.

"రాత్రంతా ఎక్కడున్నావ్?"

ఆమె మాట్లాడలేదు.

"నిన్నేం చేశారు వాళ్ళు?"

ఆమె నోరు విప్పలేదు.

"నువ్వు చేసింది చట్టరీత్యా నేరమని తెలుసా?"

(ఇంకా వుంది)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ము ఖ చి త్రా ల కు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- లు నగదు బహుమతితోపాటు 6 నెలలు "సప్లిమెంట్" కూడా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.



# క్రైమ్‌లో తమాషాలు

## పరారి?

ఓ దొంగ దొంగతనం చేసి పారిపోతుంటే పోలీసులు కాల్పులు జరపడంవల్ల గాయాలు తగిలి ఆస్పత్రి పాల య్యాడు. కొన్ని రోజుల తర్వాత, గాయాలకు చికిత్స జరిగాక అతన్ని పోలీసు స్టేషన్‌కు తీసుకొచ్చారు.

అప్పుడతను ఇన్‌స్పెక్టర్‌తో "సార్! ఆస్పత్రిలో నాకు చాలాసార్లు ఆపరేషన్లు చేశారు. మొదటి ఆప రేషన్‌లో నా ఎడమ చెయ్యి తీసేశారు. తర్వాత నా కుడి కాలు మోకాలి వరకు తీసేశారు. తర్వాత నా కుడి చేతి మూడు వేళ్ళు తీసేశారు. ఆ తర్వాత...."

"చాల్చాలు! నువ్విలాగే ఒక్కొక్కటి చొప్పున అన్ని అవయవాలు పంపేసి పూర్తిగా పరారి అవుదామను కుంటున్నావా! ఆ పప్పులు నా దగ్గరేం వుడకవు!!" మధ్యలోనే అడ్డుకుని అన్నాడు ఇన్‌స్పెక్టర్ గాభరాగా.

—మహబూబ్ బాషా, ఆదోని.

## నేరం విలువ?

క్లాసులో మాష్టారు పాఠం చెప్తుండగా మాష్టారుకు ఎదురు బెంచీలో వున్న సుధీర్ లేచి, తన వెనుక వరు సలో చివరి బెంచీమీద వున్న కృష్ణారావుని చూపిస్తూ "ఈ రాతి ముక్కను నా మీదకు వేశాడు సార్" అన్నాడు.

"ఏరా! ఎందుకేశావ్" అని అడిగాడు మాష్టారు కృష్ణారావును.

"ముందుగా సుధీర్ నా కేసి కొట్టాడండి" అన్నాడు కృష్ణారావు.

మాష్టారు గబగబా వెళ్ళి కృష్ణారావును బెత్తంతో నాలుగు బాది వచ్చి కుర్చీలో కూచున్నాడు.

క్లాసు లీడర్ లేచి "అదేంటి సార్! ముందుగా రాయి వేసిన సుధీర్‌ను కొట్టలేదేమండీ!" అన్నాడు.

"సుధీర్ వేసిన రాయి కృష్ణారావుకు తగలకపోతే పోయి గోడకు తగులుతుంది. కాని, కృష్ణారావు వేసిన రాయి సుధీర్‌కు తగలకపోతే, వచ్చి నాకు తగిలేది తెలుసా!" అన్నాడు మాష్టారు కోపంగా.

—'కా.కా', నూతక్కి.

## ప్రమాణం?

సుబ్బారావు తాగుడుకు బాగా అలవాటు పడిపోయాడు. ఓ రోజు అలవాటుగా పీకలదాకా తాగేసి పొద్దుపోయాక యింటికి చేరుకున్నాడు. బెడ్ రూంలో కెళ్ళి గుడ్డలు మార్చుకుని పడుకోబోతూ, గదిలో వెలుగుతున్న క్రొవ్వొత్తి దీపాన్ని ఉఫ్‌మని ఊదాడు. బ్రాందితాగిన నోటితో దీపాన్ని ఊదేసరికి అది ఒక్కసారి భగ్గున మండింది.

వెంటనే సుబ్బారావు కంగారుపడి "అయ్యో! ఎంత పొరపాటు చేశాను. ఎలాంటి తప్పుడు పని చేశాను. నాకు విముక్తి లేదు. నేనీ క్షణమే భగవంతుడి మీద ప్రమాణం చేస్తాను. వెంటనే వెళ్ళి భగవద్గీత పట్టుకురా" అని కన్నీళ్ళతో భార్యను ప్రాధేయపడ్డాడు.

భర్తలో అకస్మాత్తుగా వచ్చిన మార్పుకు సంతోషిస్తూ వెను వెంటనే భగవద్గీత తెచ్చి అందించింది భార్య. సుబ్బా రావు భగద్గీత మీద చెయ్యి పెట్టి, ఆకాశంకేసి చూస్తూ ఇలా ప్రమాణం చేశాడు.

"భగవాన్! నీ మీద ప్రమాణంచేసి చెప్తున్నాను. ఇక ముందెప్పుడూ బ్రాందీ తాగిన నోటితో దీపాన్ని ఊదను!"

—మహబూబ్ బాషా, ఆదోని.

## వస్తాదుల కాపలా?

కొత్తగా విడుదలయిన ఓ సినిమా కెళ్ళారు రమేష్, సురేష్.

"ఈ సిన్మా బాగుండదు బ్రదర్" లోనికి వెళ్ళి కూర్చున్న తర్వాత అన్నాడు రమేష్.

"విడుదలయిన తర్వాత మొట్టమొదటి ఆట యిదేగా! బాగుండదని నీకెలా తెల్సు?" ఆశ్చర్యంగా అడిగాడు సురేష్.

"గేట్ల దగ్గర వస్తాదులున్నారు చూశావా?"

"అవును! వాళ్ళెందుకున్నారు!?"

"మధ్యలో బోర్ కొడ్తుందని ఎవరూ బైటికి వెళ్ళ నివ్వకుండా!!"

—ఆర్. వెంకటేశ్వర్, బెల్లంపల్లి.

## ఫోన్‌కి స్థానచలనం!

టెలిఫోన్ అదేపనిగా మ్రోగసాగింది. ఎవరినీ ఫోన్ దగ్గరకు రానీయని సెక్షన్ ఆఫీసర్ చిరాకుగా టెలిఫోన్ ఎత్తాడు.

"ఎవరు కావాలండి?" అడిగాడు సెక్షన్ ఆఫీసర్.

"మీ అబ్బాయికి చిన్న ఆక్సిడెంటు!"

"అబ్బాయా? నాకు అబ్బాయిలు లేరు."

"పోనీ అమ్మాయి లున్నారా? అమ్మాయికి యాక్సిడెంట్!"

"ఎవరు మీరు?"

"నీ మొగుడిని!"

"ఏయ్! మిస్టర్?"

"లేకపోతే ఏమిటోయ్! వెర్రివెధవా! టెలిఫోన్ వుపయోగాలు తెలుసా?"

"మీరు చాల అమర్యాదగా...."

"షటప్! కాలం కలపిరావడానికీ, డబ్బు ఆదా కావడానికీ టెలిఫోన్ ఉపయోగపడుతుంది. నీకు టెలిఫోన్ వుపయోగము తెలియదు. నీ బల్లమీద ఫోన్ ఎందుకు?"

సెక్షన్ ఆఫీసర్ విసురుగా టెలిఫోన్ రిసీవర్ పెట్టేశాడు.

"ప్యూన్! ఈ ఫోన్‌ని మరో బల్లమీదకు మార్చు. ప్లగ్ పిన్‌కి దగ్గరగా వుండేలా చూసుకో!" సెక్షన్ ఆఫీసర్ తీగలాగి సెట్టుమీద ప్లగ్ పడేశాడు.

ఆ సాయంకాలం భాస్కరం తన మిత్రుడిని అడిగాడు "కేశవా! మీ సెక్షన్‌లో టెలిఫోన్‌కి స్థాన చలనం వచ్చిందా?" అని.

కేశవరావు ఆశ్చర్యంగా భాస్కరాన్ని చూశాడు.

—ఎమ్.వి.వి. సత్యనారాయణ

# పిరికివాడి ఆత్మహత్య?

అర్ధరాత్రి! రైలు వేగంగా వెళ్తోంది.

ఒక యువకుడు లేచి అటు-యిటు చూస్తూ శబ్దం కాకుండ అడుగులు వేస్తూ డోర్‌వద్దకు వెళ్ళి దూకటానికి సిద్ధమయ్యాడు. అంతట ఒక వ్యక్తి అతన్ని చూసి వెనుక నుండి పట్టుకున్నాడు.

ఆ యువకుడు "నన్ను వదలండి — నన్ను వదలండి ప్లీజ్! నేను బ్రతకలేను" అన్నాడు.

ఆ వ్యక్తి పట్టును మరికాస్త బిగించి "ఆత్మహత్య పిరికి వాళ్ళు చేసుకుంటారు. ఆత్మ ధైర్యం వున్నవాళ్ళు సమస్య లనే హత్యచేసి తాము బ్రతుకుతారు" అన్నాడు.

"వేదాంతం ఎవరైనా చెప్పగలరు. ముందు మరియాదగా నన్ను వదలండి" అన్నాడు ఆ యువకుడు కోపంగా.

"నా కంఠంలో ప్రాణం వుండగా నేను మిమ్మల్ని ఆత్మ హత్య చేసుకోనివ్వను" అన్నాడు ఆ వ్యక్తి.

"అయితే మీరే ముందు దూకండి. ఆ తరువాత నేను" అని గట్టిగా నెట్టాడు ఆ యువకుడు. ఒక పెద్ద అరుపుతో కొండలమీది నుండి దొర్లుతూ చీకటిలో కలిసిపోయాడు ఆ వ్యక్తి.

ఆ అరపు విని అందరూ లేచి తలుపువేపు వచ్చి, "పాపం! ఏం కష్టం వచ్చిందో, అలా ఆత్మహత్య చేసు కున్నాడు" అన్నారు కొందరు.

"ఆ పిరికి వెధవలు ఆత్మహత్య చేసుకోక ఏం చేస్తారు!" అన్నాడో పెద్దమనిషి.

అది విని ఆ యువకుడు శిలాప్రతిమలా నిలబడి పోయాడు. —ఆనందకుమార్, చుడీబజారు

